


## ముఖచిత్రం

సూపర్ స్టార్ 'జయసుధ' ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక మా ఇంటిల్లిపాదిని ఆకట్టుకొంది.

కె. రామసీత, దువ్వ.

*  *  *

ఊర్వశి శారదగారి ముఖచిత్రంతో మన వారపత్రికను చూడాలని మేమంతా ఆకాంక్షిస్తున్నాము. పత్రిక ధర పెరిగినా మంచి కథలు వస్తున్నందుకు సంతోషం.

డా. జి. యస్. రాయుడు, షక్కర్‌నగర్.

*  *  *

''సూపర్ స్టార్'' జయసుధ ముఖచిత్రంతో వెలువడిన 9–3–84 ఆంధ్ర సచిత్ర వారపత్రిక మా యింటిల్లిపాదినీ ఆకర్షించినది.

ఎస్. పర్వీన్‌బేగం. గిరింపేట.

*  *  *

నా అభిమాని అయిన ''సూపర్ స్టార్'' జయసుధ ముఖచిత్రం వేసినందుకు సంతోషించాము. అలాగే కమలహాసన్ ముఖచిత్రం వేస్తారని ఆశిస్తున్నాను.

ఎ. ఎన్. రాణి, ఆదవాని.

*  *  *

''సూపర్ హీరోయిన్'' జయసుధ ముఖచిత్రంతో వెలువడిన ''ఆంధ్ర సచిత్ర వారపత్రిక'' ముగ్ధ మనోహరంగా ఉండి, మమ్మల్ని ముగ్ధులనుచేసి, మా హృదయాలను ఆకర్షించి, మా మనస్సులో చెరగని ముద్ర వేసింది.

కొర్లపాటి బాపిరాజా ప్రదీప్‌కుమార్,
కొర్లపాటి బాపిరాజా గణేష్‌కుమార్,
అంబాజీపేట.

## 'విమర్శ అంటే తిట్లని ఏర్చికూర్చడం కాదు....'

నా ''గాడ్సే పుట్టిన దేశం'' కథపై 9–3–84 సంచికలో ప్రచురించబడ్డ కె. రాజ సులేఖ, పూర్ణా (మహారాష్ట్ర) గార్ల ఉత్తరం చదివాక ఈ ఉత్తరం రాయక తప్పిందికాదు.

కథా విషయం పూర్తిగా విస్మరించి కథకు సంబంధంలేని విషయాన్ని ఆధారం చేసుకొని విమర్శించాలని విమర్శించినట్లున్న ఆ ఉత్తరాన్ని, రచయిత పాఠకుల అనుబంధ పరిధిని అధిగమించి, 'అంకితం' చేసుకునే రచయిత వ్యక్తిగత స్వేచ్ఛను ఎత్తిపొడిచి, కేవలం గాంధీగార్ని విమర్శించాలని అనవసరపు విసుర్లు విసిరి తమ బలహీనతను అందంగా బైటేసుకున్న ఉత్తరాన్ని... ఉత్తరం రాసినవారి జ్ఞాన శూన్యత్వాన్ని చూసి నవ్వాలో ఏడవాలో కోప్పడాలో జాలిపడాలో అర్ధంకాలేదు.

కానీ 'తాజ్‌మహల్ విమర్శకుడు' మాత్రం గుర్తొచ్చాడు. (వెనకటికెవడో అందరు మెచ్చుకునే తాజ్‌మహల్‌ని తాను మెచ్చుకుంటే తననెవరూ గుర్తించరని 'తాజ్‌మహలంత ఛండాలమైంది నికృష్టమైంది ప్రపంచంలో యింకోటి లేదనడం ప్రారంభించాట్ట. కారణమేమిటని అడిగితే తాజ్‌మహల్ సౌధాగ్రంమీద అప్పుడప్పుడూ ఓ కాకివాలుతుంటుంది .. అందుకే దానంత ... ది యింకోటి లేదని చెప్పేట్ట)

కథను విస్మరించి కథా రచయిత 'అంకితమివ్వడాన్ని' విమర్శించడం కేవలం అజ్ఞానమని... నేనేదో గాంధీగారి గురించి ఏమీ తెలీని స్థితిలో వున్నానని 'వారు' అనుకోవడం మరింత అజ్ఞానానికి నిదర్శనమని మనవి చేస్తున్నాను. మంచితనం గురించి కథరాసి 'ఇడీ అమీన్‌కు' అంకితం చేస్తాను...లేదా ప్రపంచంలో నంబర్‌వన్ రాక్షసుడెవరో, వారికి అంకితం చేసుకుంటాను...అది నా యిష్టం. మిగతావారికి కనిపించని సుగుణాలు వారిలో నాకు కనిపించవచ్చుగదా ! కథను చదివి అందులోని విషయాన్ని గ్రహించడం వరకే (లేదా ఏదైనా సందేహాలు, సర్దుబాట్లు సూచించడం వరకే) పాఠకుల పరిధి. రచయిత యిష్టాలను విమర్శించే హక్కు ఎవరికీ లేదని .. అటువంటి అనవసరపు అసందర్భపు విమర్శలు చేసి అజ్ఞానాన్ని బైటవేసుకోవద్దని సదరు పాఠక విమర్శక ద్వయానికి విజ్ఞప్తి. పంచములు పంచముల కథలు నాకు కనిపించడానికి గాంధీయే కారణమని వారు ఒక అనవసరపు అంచనా వేశారు. కేవలం ఒక్క కులాన్నే నేను కథలో చెప్పలేదు. మనిషిలోని అవకాశవాదానికి కులాన్ని ఒక 'ఉత్ప్రేర'కంగా మాత్రమే స్వీకరించాను (విమర్శలో ఒక్క కులమే ముఖ్యాంశంగా వుండడం గమనార్హం) కావలసివస్తే ఆ కథను మళ్ళీ ఓసారి చదివి. .సహృదయి విమర్శ చేయిగలరు.

విమర్శలో ''...యికనైనా కులమతాల సమరం సాగకుండా వుండాలంటే ఇటువంటి (నా కథవంటి) ప్రచురణలకు ప్రోత్సాహం యివ్వకూడదు'' అని 'వారు' మీకు ఓ ఉచిత సలహా యిచ్చారు. సామాజిక సమస్యల్ని చర్చించడం లేదా వాటి ఆధారంగా రచనలు చెయ్యకపోతే ప్రస్తుత సాహిత్యమంతా దేని చుట్టూ తిరుగుతున్నట్టు ? 'అస్పృశ్యత ఒక మహానేరం' అంటూ గవర్నమెంటు ఆర్టీసీ బస్సుల మీద రాయడం, రేడియోలలో ప్రకటనలు, కార్యక్రమాలు యివ్వడం ఎందుకో మరి! (విమర్శకులు ఆత్మవిమర్శ చేసుకోగలరు)

విమర్శ అంటే తనకు తెలిసిన నాలుగు తెలుగు తిట్టుపదాల్ని ఏర్చి కూర్చడం కాదని... అన్నింటా అది పరిపూర్ణత కలిగివుండాలని గుర్తు చేస్తూ చివరిగా... ''ఆవేశంలో ఆ గాడ్సే (గాంధీని) హత్య చేయలేదు. ఆలస్యంగా చేశాడు'' అని రాయగలిగిన చేతులకు చేతులెత్తి శతకోటి నమస్కారాలు చేస్తూ యింకెప్పుడూ యిలాంటి కాలహరణం, కాలవ్యహరణం గావించే విమర్శలు చేయవద్దని సహృదయంతో సదసద్వివేచనతో సద్విమర్శలు చేయమని పాఠకులను (ప్రత్యేకించి ఆ యిద్దరు పాఠకుల్ని) కోరుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.

పైడిశ్రీ, ఒంగోలు.

## ప్రస్తుత స్థితి

''శశాంక''గారు వ్రాసిన ''మన రాజ్యం'' అనే కవిత ప్రస్తుత స్థితిని ప్రతిబింబిస్తోంది.

కాని ఆ కవితలో ''హాహాకారములు'' బదులుగా ఆహాకారములు అనీ, ''అందలము'' నకు బదులుగా అందెలము అని ప్రచురింపబడింది!

వసుధ బసవేశ్వరరావు, మచిలీపట్నం ★

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

***శివలెంక శంభుప్రసాద్***

**సంపాదకుడు :**

[1938–1972]

శుక్రవారం : 30–3–'84

రుధిరోద్గారి నామ సం. ఫాల్గుణబ. త్రయోదశి

**సంపుటము 76 : సంచిక 29**

**సంపాదకుడు :**

***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-80

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి రాధ

(ఫొటో : పి. రవిచందర్)

***కథలు :***



***సీరియల్ నవలలు :***



***వ్యాసాలు, శీర్షికలు :***



## లోకం పోకడ









# భారతదేశంలో పన్నుల బాధ ఎందరికి ?




ఇంకేదయినా దేశంలో అయితే నానీ పాల్కీవాలాకి ఒక న్యాయశాఖ మంత్రి అయ్యే అర్హత ఉంది. భారతదేశంలో ఆయన కేవలం ఒక [అమెరికా పరిభాషలో] కార్పొరేటు లాయర్‌గా ఉండిపోయాడు— ఎంత తెలివి ఉన్నప్పటికీ, ఎంత చదువుకున్నప్పటికీ. ఆయన కొన్ని కంపెనీలలో డయిరెక్టరుగా ఉంటున్నాడు. వీటిలో తాతా కంపెనీలు కూడా ఉన్నాయి. కార్పొరేట్ [లేదా కంపెని] లాయర్‌గా ఉండటం పెద్ద గొప్ప ఏమీ కాదు. అజిత్ కేర్కార్ ఒక తాతా కంపెనీ అధ్యక్షుడుగా ఉంటే పాల్కీవాలా మాత్రం ఎందుకు ఉండరాదు ?

పోయిన నెల పాల్కీవాలా పుస్తకం ఒకటి వెలువడింది. దాని పేరు ''వుయ్ ది పీపుల్''. [ప్రజలము మేము, అని అనువాదం చెయ్యవచ్చునా ?] గత నాలుగు దశాబ్దాలుగా ఆయన చేసిన ప్రసంగాలనీ, రాసిన వ్యాసాలనీ కలిపి ఇలాగ పుస్తకంగా వేశారన్నమాట.

కొన్ని కారణాల వలన పుస్తకంలో మూడవ వంతుకన్నా ఎక్కువే ఆర్థిక విషయాలని గురించీ, పన్నులని గురించీ రాశాడు పాల్కీవాలా. ఈ మూడవవంతులో మళ్లీ వంద పేజీలు పన్నులగురించి రాశాడు ఆయన. ఇందులో వింత ఏమీలేదు. పాల్కీవాలా ప్రత్యేకత పన్నులే. ఆయన ''టాక్స్ లాయర్'' లేదా పన్నుల న్యాయవాదిగా పేరుపొందాడు. పన్నులూ, ఆర్థికాభివృద్ధీ ఒకటేనా ? భారతదేశంలో పన్నులు చెల్లించే వారి సంఖ్య చాలా తక్కువ. ఇలాంటి దేశంలో పన్నులకీ, ఆర్థికాభివృద్ధికీ పాల్కీవాలా, ఇతరులూ అనుకున్నంత దగ్గిర సంబంధం లేదనుకుంటాను.

పన్నులు ఎక్కువగా ఉంటే లంచగొండితనంకూడా ఎక్కువగానే ఉంటుంది. నిజమే, లంచగొండితనం అభివృద్ధిని తినివెయ్యగలదు కూడా — నిజమే. కాని, పన్నులు ఎక్కువగా లేని చోట మాత్రం ఎక్కువ అవినీతి లేదనగలమా ? అవినీతి లేకపోయినా అభివృద్ధిలేని దేశాలూ ఉన్నాయి.

ఎక్కువ పన్నుల బెడద మధ్య తరగతికే ఎక్కువగా ఉంటుంది. బీదవారికి పన్నుల బాధ అంతగా ఉండదు. బాగా ధనం కలవారి సంగతి సరేసరి. పాల్కీవాలా మధ్య తరగతివాళ్ల తరఫున బాగా మాటలాడే మనిషిగా పేరు పొందాడు. ఇది ఆయనకి బలం ఆపాదించే విషయం కాదని నా నమ్మకం. అది ఆయన బలహీనత అని నేను అనుకుంటాను. ఎందుకంటే, స్వరాజ్యం తరువాత మనదేశంలో బాగుపడిన వర్గం ఏదయినా ఉంటే అది మధ్య తరగతే. ఈ తరగతి వాళ్లు బీద అరుపులు అరవక్కరలేదు. కాని వాళ్లు చేసే పని అదే.

తక్కిన దేశాలలోనూ పన్నులు అందరిమీద పడుతూనే ఉంటాయి. కాని ఆ దేశాలలో మధ్య తరగతివాళ్లు ఇలాగ భాధపడరు. ఇంగ్లాండులో ఒక చిన్న కంపెనీలో పనిచేసే అమ్మాయి కూడా పన్ను కడుతుంది. తను కడుతున్నట్లు ఆమెకి తెలుసు. భారతదేశంలో పన్నులు కట్టేవాళ్ల సంఖ్య చాలా చిన్నది. ఈ సంగతి పాల్కీవాలాకి తెలుసు. పన్నులు చెల్లించేవాళ్లు బాగానే ఉన్నారనికూడా పాల్కీవాలాకి తెలుసు. ఈ మధ్యనే ఒక పత్రికలో ఒక గృహిణితో జరిగిన ఇంటర్‌వ్యూ పడింది. తను ప్రతి వారమూపార్టీకివెళ్లలేకనెలకిరెండుసార్లువెళ్తున్నానని, తన భర్త స్థానిక 5 చుక్కల హోటల్‌లోని తాలింఖానాకి వారానికి ఒకసారి బదులు నెలకి ఒకసారి మాత్రమే వెడుతున్నాడనీ ఆవిడ అంది. ఆవిడ భర్త వయసు 35 మాత్రమే. ఆయన జీతం సాలుకి 50,000 రూపాయలు. ఇలాంటి వాళ్లు పాల్కీవాలా ఉపన్యాసాలకి రావటం నేను చూశాను. వాళ్లు భారతదేశం ప్రతినిధులు కారు. సాలుకి 50,000 రూపాయలు చేసే ఆయన భార్య వారం వారమూ పార్టీ కెళ్లలేకపోవటం పెద్ద బాధ ఏమీకాదు; ఇలాంటి వ్యక్తి సగటు భారతీయుడు కానేకాదు. ఇరాన్‌ని ఒకప్పుడు పాలించిన షా పెద్ద చమురు కంపెనీల దోపిడీని ఖండించేవాడు — అంతమాత్రాన ఆయన ఒక బీద దేశం ప్రతినిధి అయిపోయాడా ? రోజుకి రెండు పూటల భోజనం లేని మనుషులే ఎక్కువమంది ఉన్న దేశంలో పన్నుల భారం అంత ముఖ్యమయిన విషయమా ? దేనికయినా సందర్భం అంటూ ఉండాలి కదా ? పాల్కీవాలా పుస్తకంలో బడ్జెట్‌ల మీద చాలా ఉంది. అదంతా చదవటానికి కొంచెం విసుగుగానే ఉంటుంది ! ఆయన ఈ భాగాలని పుస్తకంలోకి ఇరికించకుండా ఉంటే బాగా ఉండేది. ఆయన బాగా రాయగలడు. ఎన్నో మంచి విషయాలని గురించి బాగా రాయగలడు. అటువంటి వాడు పన్నుల మీదనే పట్టిస్తే ఎవరికీ ఏమీ ప్రయోజనం ఉండదు.

భారతదేశంలో లాయరులు తమ ప్రాక్టీసు వదిలిన తరువాతనే బాగుపడ్డారు. జిన్నా అంతే. గాంధీ మహాత్ముడిని తరుచు ఉదాహరిస్తాడు పాల్కీవాలా — ఆ మహాత్ముడు ఒక లాయరుగానే ఉండిపోతే ఏమయిపోయేవాడు ? నేను నెహ్రూ అభిమానిని కాను. పాల్కీవాలా కూడా ఆయన అభిమానికాడని పుస్తకం చదివి తెలుసుకున్నాను. ఎలాగంటే, 350 పేజీలలోని 150000 మాటలలో పాల్కీవాలా నెహ్రూని గురించికానీ, ఇందిరా గాంధీని గురించికాని ఏమీ రాయలేదు — కనీసం నాకు వాళ్ల పేరులుకాని కనిపించలేదు. (అధోజ్ఞాపికల సంగతి నేను చెప్పలేను — పొరబాటున వదిలివేశానేమో !) మంచిదే. అయినా నెహ్రూ ప్రాక్టీసు చెయ్యలేదు. ఆయన చేసిన మంచి పనులలో ఇదొకటి. రాజకీయాలనీ, న్యాయవాది వృత్తినీ కలిపేవాడు ఎప్పటికీ ఏదీ సాధించలేడు. ఈ శతాబ్దంలోకెల్లా గొప్ప జడ్జి ఎవరంటే చాగ్లా, అంటాడు పాల్కీవాలా. నిజమే. కాని జడ్జివేరు, లాయరు వేరు. రాజకీయాలలో మునిగి మళ్లీ న్యాయస్థానాలని ప్రవేశించటానికి చాగ్లా ఏ మాత్రం ఇష్టపడలేదు. ఆయన విచక్షణకల వ్యక్తి అని ఈ సంగతే మనకి తెలుపు


శ్రీ నానీ పాల్కీవాలా

తుంది. పాల్కీవాలా తన ప్రాక్టీసు మానుకుని, పన్నులని గురించి ఆలోచనలు తగ్గించుకుని [అంటే ఆర్థికాభివృద్ధికి పన్నులే ముఖ్యం అన్న బాధని తగ్గించుకుని]. వాణిజ్యంలో తన దగ్గిర సంబంధాలని తగ్గించు కుంటే ఇంకా ఎంతో ప్రకాశించేవాడని నా విశ్వాసం. మినూ మసానీ కూడా ఇలాగే చేసి ఉంటే మరింత వెలిగిపోయేవాడని నేను అనుకుంటూ ఉంటాను. మసానీ బాగా ప్రసిద్ధి పొందుతున్న రోజులలో టాటా వాణిజ్య సంస్థలో చేరాడు. ఆయన రెండు పుస్తకాలలో తన జీవిత చరిత్రని కొంత వర్ణించాడు. స్కూలు రోజుల నుంచి కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరేదాకా మసానీ తన వర్గం యొక్క ప్రభావాలని వదిలించు కోవటానికి ఎంత కష్టపడ్డాడో ఆయన జీవిత చరిత్ర చదివితే తెలుస్తుంది [మసానీ తండ్రికి ''సర్'' బిరుదు ఉండేది. తను ఒక మితవాదిని అనుకునేవాడు ఆయన. అంటే సామ్రాజ్యవాదుల తొత్తు అనే కదా, అర్థం!] స్వతంత్రపార్టీలో ఆయన చేసిన కృషిని గురించి చదివితే మీకు విసుగుపుడుతుంది.

భారతదేశంలో ఒక జాతీయ నాయకుడు అధిక సంఖ్యాకుల ప్రతినిధిగా ఉండాలి. అంతేకాని, ఏ మధ్య తరగతికో ప్రతినిధి కాకూడదు. అభివృద్ధిగా పిలువబడేదాని ద్వారా లాభం పొందిన తరగతి ఏదయినా ఉంటే అది భారతీయ మధ్య తరగతే ఒక పెద్ద కంపెనీలో ఊడిచే పనిచేసే వ్యక్తికి సాలుకి రు. 40,000 పయిగా వస్తుందని తెలుస్తుంది. ప్రధానమంత్రి జీతం కన్నా ఇదే ఎక్కువ. ఊడిచే వాళ్లంటే నాకు కోపం అనుకోకండి! కాని, ఒక పల్లెటూరు బడిలో పనిచేసే టీచరుకన్నా పదిరెట్లు ఎక్కువ జీతం ఈ వృత్తి చేసే మనిషికి రావటం న్యాయమేనా? అసలు ఈ వ్యక్తికి ఇంత జీతం ఎలాగ వస్తోంది? ఆయన పనిచేసే కంపెనీ టూత్ పేస్టు చేస్తోందనుకోండి. దానిని అమ్మితే వచ్చే లాభాలు అలాంటివి అన్నమాట. ధరలు పెరిగితే లాభాలు పెరుగుతాయి. జీతాలు పెరగాలంటే ధరలు పెరగాలి. పన్నులు మరీ ఎక్కువగా ఉన్నాయి, అనే వాళ్లని చూస్తే నాకు తలనొప్పి! పన్నులు ఇంకా తగ్గితే ఊడిచే పని చేసేవాళ్ల జీతాలు మరింత పెరగవా?

పాల్కీవాలా తన ఆఫీసులో కూర్చుని తన క్లయింట్ల ఫయిళ్లని చదవటంలో నిమగ్నులయి పోయి ఉండటం శోచనీయం. ఆయనతో ఇంటర్వ్యూ దొరకటమే చాలా కష్టం. తన కాలాన్ని ఇలాగ వృధా చేసుకునే బదులు ఆయన పార్లమెంటులో మాటలాడితే ఎంత బాగుం టుంది!

ఎన్నికలు చీకాకు కలిగిస్తాయి నిజమే. కాని ప్రజలతో సంబంధాలు పెంచుకోవాలంటే ఇదొక్కటే మార్గం. 



'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

# దక్షిణ భారతదేశంలో అతి పెద్ద సంబరం

# మేడారం సమ్మక్క జాతర!

"నా తల్లీ మేడారమ్మే
నా ఇంటి బాలుడ్ని
తేలేదే ...
నా తల్లీ మేడారమ్మే ...
హూ ఓ హూహూ
మేడారమ్మే సమ్మక్కో...సారక్కో ! ''

అంటూ వో మహిళ జుత్తు విరబోసుకొని వేగంగా తల వూపుతూ అందంగా అడుగులు వేస్తోంది. వున్నట్లుండి ఆమె ప్రక్కనే వున్న మరో మహిళ కూడ జుత్తు విరబోసుకొని గట్టిగా కూతలు పెట్టడం ప్రారంభించింది. ఆ మహిళల కుటుంబ సభ్యులే కాక ఇతరులు కూడ వారికి నమస్కారాలు పెట్టడం — ఏమేమో అడగటం— ఆ అడిగిన వాటికి ఆ మహిళలు జవాబులు చెప్పటం జరుగుతోంది.

ఆ ప్రాంతంలో ఈ ఇద్దరు మహిళలే కాదు వేల సంఖ్యలో స్త్రీలు—పురుషులు అదేమోస్తరుగా వూగుతూ ఆశువుగా ఏదేదో పాడేస్తున్నారు. ఆ ప్రాంతాన్ని ''మేడారం'' అని పిలుస్తారు. అలా వూగుతూ ఏదేదో పాడేస్తున్న వారిని ''సమ్మక్క —సారాలమ్మ'' దేవతలు ఆవహించారని చెబుతారు.

మేడారం వరంగల్‌కు 120 కి. మీ. దూరంలో వున్న గ్రామం కాని గ్రామం. అంటే కుగ్రామం కూడ కాదన్న మాట. ఆ ప్రాంతంలో అక్కడక్కడ మూడు ''కోయ గూడెం''లు వున్నాయి. దక్షిణ భారత దేశంలోనే అతి పెద్ద గిరిజనుల జాతర అయిన ''సమ్మక్క — సారమ్మ జాతర'' మేడారంలోనే జరుగుతుంది. యావ ద్భారత దేశం నుండి గిరిజనులంతా ఇక్కడకు వొస్తారు. ఈ జాతర ప్రతి రెండేళ్ల కోమారు మాఘ శుద్ధ పౌర్ణమి నాడు జరుగుతుంది.

సమ్మక్క — సారాలమ్మగా భావించి గిరిజనులు పూజించే నెమలి నారచెట్లు



## ఎవరీ సమ్మక్క — సారమ్మలు ?

కాకతీయచక్రవర్తి ప్రతాపరుద్రుడి కాలంలో మే డా ర ం కోయరాజుల రాజ్యం. వోనాటి మధ్యాహ్నం దట్టమైన అ డ వి ప్రాంతంలో సింహాల—పులుల నడుమ వొక చిన్న పాప ఆడు కుంటూ కేరింతలు కొడ్తోందట. అటుకేసి వేటకు వచ్చిన కోయవాళ్లు ఆశ్చర్యపడి ఆ పాపని తమ గూడేనికి తీసికెళ్లారట. ఆ పాప అక్కడ అద్భుతాలు చూపెట్టడం మొదలుపెట్టిందట. ఆ కోయలు ఆ పాపని పెంచు కుంటూ వో మాఘ శుద్ధ పౌర్ణమినాడు 'సమ్మక్క' అనే పేరు పెట్టారట.

ఈ విషయాలన్నీ ఎంత వరకు నిజమో మనకు చరిత్ర చెప్పటం లేదు.

కానీ సమ్మక్క పగిడి గిద్దరాజు భార్య అనే విషయం కాకతీయుల చరిత్రలో కనబడుతుందని చరిత్రకారులు చెబుతారు. కరినగర రాజ్యానికి ప్రభువైన మేడరాజుకు ఈ పగిడి గిద్దరాజు మేనల్లుడు. మేడరాజు కాకతి ప్రతాపరుద్రుడికి సామంతుడు. పగిడి గిద్దరాజుకూడ ప్రతాప రుద్రుడికి సామంతుడే !

నాగులమ్మ — సారాలమ్మ — జంపన సేనాని సమ్మక్క, పగిడి గిద్దరాజుల సంతానం. సమ్మక్క సూచనమేరకు తన మేడారం రాజ్యాన్ని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకున్నాడు పగిడి గిద్దరాజు. వెంటనే ప్రతాపరుద్రుడు యుగంధర మంత్రి నాయకత్వంలో మేడారం మీదకు సైన్యాన్ని పంపాడు. జరిగిన యుద్ధంలో సమ్మక్క భర్త పగిడి గిద్దరాజుతోసహా కూతుళ్లు సారాలమ్మ, నాగులమ్మ, అల్లుడు గో వి ం ద రా జు లు మరణించారు.

జంపన సేనాని వీరోచితంగా సంపెంగ వాగు వొద్ద కాకతీయ సైన్యాలతో యుద్ధం చేస్తుండగా వొకడు కత్తితో వెన్నుపోటు పొడిచాడు. ఆ వాగులో పడి జంపన సేనాని మరణించాడు. అప్పట్నుండి ఆ వాగుని జంపన వాగు అని పిలుస్తున్నారు.

అందరూ చనిపోవటంతో కోయ సైనికులు సమ్మక్క వొద్దకు వచ్చి ''నీ అద్భుతాలతో వీళ్ళందరినీ బ్రతికించ''మని కోరగా తానే పురుష వేషం ధరించి రణరంగంలోకి దూకింది.

శత్రువులని చండ చండంగా చీల్చేస్తూ స్వైర విహారం చేస్తున్న సమ్మక్కని యుగంధర మంత్రి వెనుకగా వొచ్చి బల్లెంతో వీపుమీద పొడిచాడు. వెంటనే ఆమె తన గుర్రాన్ని దౌడు తీయించింది చిలకలగుట్ట వైపుకి. ఆమె వెనుకనే వచ్చిన కోయలకి సమ్మక్క మరి కనిపించలేదు. వెతకగా వెతకగా ఆ గుట్ట దగ్గరలో వున్న నెమలినార చెట్టువద్ద వొక కుంకుమ భరిణ కనిపించింది వాళ్ళకు. అప్పట్నుండి ఆ కుంకుమ భరిణనే వారు సమ్మక్కగా భావిస్తూ పూజించడం మొదలెట్టారు. తర్వాత ప్రతాపరుద్రుడు పశ్చాత్తాపపడి మేడారంను స్వతంత్ర రాజ్యంగా ప్రకటించి క్రీ. శ. 1260–1323 నుండి సమ్మక్క, సారాలమ్మ జాతరకు నాంది పలికాడు.



"మాయమ్మ సమ్మక్కతల్లో మాయమ్మ సారక్కతల్లో..." అంటూ పూనకంతో సమాధి స్థితిని చేరుకున్న ఒక మహిళల జట్టు.

వంగి వంగి నమస్కారాలు పెడుతూ, అందంగా అడుగులు వేస్తూ పూనకం నిండినవారు —

"అమ్మా నీకు పరిపరి దండాలమ్మా
మాయమ్మో సమ్మక్కో – సారమ్మా
కాతోడు పోటు పొడిసెనా మాయమ్మా
నీకు పరిపరి దండాలమ్మా"

అని పాడుతుంటే కాకతీయ సైనికుడు సమ్మక్కను వెనుకపోటు పొడిచాడనే విషయం అర్థమౌతుంది. బహుశ "కాతోడు" అనే పదానికి అర్థం "కాకతి వాడు" అనేమో!

చిలకల గుట్టపై గర్భంతో వున్న అప్పని కోసి, పసుపు కుంకుమలతో దానిని పూజించి కుంకుమ భరిణ తీసుకొని ఒక యువకుడు నెమలి నార చెట్ల దగ్గిర చేరుకోగానే జాతరలో ఉత్సాహం పుంజుకుంటుంది. ఈ జాతరలో "వరాలు పట్టడం" వొక విశేషం. జంపన వాగులో నిలబడి మనసులో కోరికని స్మరించుకొని నీళ్ళు వదులుతుండాలి (అర్ఘ్యం వదిలే మాదిరి) ఆ సమయంలో ఆ వ్యక్తిని సమ్మక్క ఆవహిస్తుందట. "బంగారం"తో సమ్మక్కని పూజిస్తారు. ఇక్కడ బెల్లంను "బంగారం"గా భావిస్తారు. కోరిక తీరిన ఎడల నిలువెత్తు బంగారాన్ని సమర్పించుకుంటామని గిరిజనులు మొక్కుకుంటారట. ఆ మేరకు అక్కడ బెల్లం రాసులు రాసులుగా పడి వుంటాయి.

ఈ సంవత్సరం ఫిబ్రవరి నెల 16, 17, 18 తేదీల్లో జరిగిన మేడారం సమ్మక్క సారాలమ్మ జాతరకు 25 లక్షల మంది జనం వొచ్చారు. ఆర్టీసి వారు 500 ప్రత్యేక బస్సులు వేస్తే 400 టూరిస్ట్ బస్సులు వివిధ ప్రాంతాల్నుండి వొచ్చాయి. వేల సంఖ్యలో ఎడ్లబండ్లు, వేల సంఖ్యలో కాలినడకన చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలు ఈ జాతరకు వొచ్చారు. గోండ్లు, కోయలు, చెంచులు, లంబాడీలు లాటి గిరిజనులే కాక నాగరికులు కూడ ఈ జాతరలో ఆనందం పంచుకున్నారు.

"తాకరో కోయ్ దాదా మేడారే ..." అంటో గోండ్లు నృత్యం చేసికుంటూ పాడిన పాటలు, "మా తల్లి మేడారమ్మే..." అంటో కోయలు పాడిన పాటలు, నృత్యాలు, పూనకంలో వారు ఆశువుగా పాడిన పదాలు మనసుని రంజింప జేస్తాయి.

జంతు బలులు కూడా ఈ జాతరలో విశేషంగా కనిపిస్తాయి. వొక్క మాటలో చెప్పాలంటే "మేడారం జాతర" కోటప్పకొండ జాతరని కూడా మరిపిస్తుందని చెప్పటం అతిశయోక్తి కాదు.

వ్యాసం : **విద్యారణ్య**

ఫోటోలు : **ధనంజయ**

సైనికుల గుడారాలు కావు! మేడారం సమ్మక్క జాతరకి తరలివచ్చిన వారి తాత్కాలిక స్థావరాలు; ఎడ్లబళ్ళు.



# ఇది ఇద్దరి కథ

## శీల జగన్నాథరావు

### ప్రసాద్ :

ఈశ్వరుడి గుడిలో చూసేను, రాజేశ్వరిని !

నంది చుట్టూ ప్రదక్షిణం చేస్తోంది. కళ్ళు భక్తితో తన్మయత్వంగా మూతపడి వుండగా, చేతులు జోడించి, ప్రదక్షిణం చేస్తున్న ఆమె ముఖంలో ఎంత వెలుగు వుంది ?! ..

రెండేళ్ళలో, రాజేశ్వరి అందం రెట్టింపయి నట్టు కనిపిస్తోంది ! తెల్లటి ఒళ్ళు మరింత పాలతెలుపుని సంతరించుకొంది. అవయవపుష్టి అణువణువునా అభివ్యక్తమవుతోంది. స్నానం చేసి, జారుముడి వేసిన జుత్తు, నల్లటి మబ్బులా అటుఇటు కమ్మేస్తోంటే, తెల్లటి చందమామ ముఖం ఆ కురుల మబ్బుల మధ్య దోగాడుతున్న ట్టుంది ! విశాలమయిన నుదుట పావలా కాసంత కుంకుమబొట్టు పెట్టుకుంది అందమైన కళ్ళ మధ్యనించీ, సూటిగా దిగిన నాసిక, ఆ దిగువ చిన్న నోరు బిగించిన పెదిమల వెనుక, ఏ మాటలు కదులుతున్నాయో ? జోడించిన చేతులలో, ఏ కోర్కె వున్నదో? మూసిన కన్నుల్లో ఏ ఆరాటం మూలుగుతోందో ?!

సెమలికంఠం రంగు పట్టుచీర కట్టుకుంది ఎర్రటి జాకెట్టు, మెళ్ళో సన్నటి గొలుసు మాత్రం వుంది చేతుల్ని రెండేసి జతల గాజు గాజులున్నాయి.

రాజేశ్వరి రూపం నా కళ్ళల్లో నిలిచింది ఆ నిమిషం !

అక్కడికి, కొన్ని అడుగుల దూరంలో, ఒక స్థంభం దగ్గర నిలబడి, ఈశ్వరుడి గుడి లోపలి సౌందర్యాన్ని చూస్తున్న వాణ్ణి, హఠాత్తుగ, రాజేశ్వరి కనిపిస్తే, స్థంభంచాటుకి తప్పుకున్నాను.

దేవాలయాలకు వెళతాను గాని అక్కడ, నా మనసు తీసుకునే భక్తిభావం తక్కువ. కళ్ళు గ్రహించే ఆలయం అందచందాలెక్కువ !

రాజేశ్వరిది నిజమైన భక్తి ! ఆ చెరువులో ఎంత రాయి పడ్డా, చెదరదది !!

ఇన్నాళ్ళకి చూసేను రాజేశ్వరిని !

నా కళ్ళు నన్ను నిలవేసేయి. నా ఒళ్ళు పరిసరాల్ని విస్మరించింది. రాజేశ్వరి దగ్గరికి వెళ్ళాలని, పలకరించాలని, కబుర్లు కలపాలని అనిపించింది. కాని... ఆగిపోయేను.

నన్ను నేను నిగ్రహించుకున్నాను. శరీరం ఎప్పుడూ శరమే ! అది ముందుకి పోవడానికే చూస్తుంది ! మనసు దాన్ని ఆపాలి ! వదిలే టప్పుడు ఆలోచించాలి !!

ఆలోచిస్తూ, స్థంభంచాటునే వున్నానలా. రాజేశ్వరి, వచ్చిన పని ముగించుకుని, వెళ్ళి పోతోంది !

గుడిలో గంటలు మోగుతున్నాయి.

నేను గబగబా ఇవతలికి వచ్చి, ఓ దండం ఈశ్వరుడికిచ్చేసి, పూజారి తెచ్చిన పళ్ళెంలో పైసాలు పడేసి, ప్రసాదం పుచ్చుకుని, అడుగులు కదిపేసరికి —

రాజేశ్వరి రోడ్డుమీద, రిక్షాని పిలిచి ఎక్కుతోంది !

నా గొంతు మారాం చేసింది, పిలుస్తా నంటూ ! కసిరి, ఆపేసింది మనసు. నాకేమిటో అసహనంగా వుంది! కోపం, వుద్రేకం, అశక్తత.

మళ్ళా ఎందుకు కనిపించింది రాజేశ్వరి ? అని కోపం.

ఆమెని కేవలం చూస్తూవుండలేక,దగ్గరయి పోవాలని వుద్రేకం.

కాని... ఏమీ చేయలేని అశక్తత !!

రోడ్డుమీదికెళ్ళేను. ట్రాఫిక్ ఎక్కువగా వుంది అన్ని రిక్షాల్లో, రాజేశ్వరి రిక్షానే వెదుకుతున్నాయి నా కళ్ళు. గబుక్కున ఓ రిక్షాని పిలిచి ఎక్కేసేను. ఫలానా చోటికని చెప్ప లేదు. బేరమాడలేదు. పోనీయమన్నాను, ఆ పాడవాటి రోడ్డుగుండా తిన్నగా. ఎందుకంటే, రాజేశ్వరి రిక్షా, ఇంకా, ఆ రోడ్డునే వెళుతోంది!

ఎందుకిలా చేసేనని, తరవాత అనుకున్నాను.

అల్లంత దూరంగా... వెళుతోంది రాజేశ్వరి రిక్షా. రాజేశ్వరి వీపు కనిపిస్తోంది. జడ కనిపిస్తోంది. పమిట గాలికి కొద్దిగా కదలాడు తోంది. ఆ దృశ్యం చూడ్డానికేనా, నేనీ రిక్షాని ఎక్కేను ?

ఎంతసేపలా చూస్తానామెని ?

ఏమో ? అలా చూడడం నాకేదో తృప్తిని కలిగిస్తోంది !

రాజేశ్వరి రిక్షాలో వెడుతోంటే — వెనకే వెడుతూ — ఆ రిక్షాలోంచి కనిపించినంతమేరం, ఆమెని చూడాలనిపిస్తోంది !! ఇందాకే నేనేమను కున్నాను ? శరీరాన్ని మనసే ఆపాలని అనుకో లేదూ ? ఇప్పుడేం చేస్తున్నాను ? ఛీ ! నాకు బుద్ధిలేదు !

రాజేశ్వరి రిక్షా ఆ రోడ్డుమీంచి, ఆ పక్క వీధిలోకి తిరిగింది ! నా రిక్షాని అటు తిప్పమన లేదు నేను. ఇప్పటికి నా ఇంటి అడ్రసు రిక్షా వాడికి చెప్పేను.

వాడు మరోవేపు మలుపు తిరిగేడు

### రాజేశ్వరి :

జ్యోతీ థియేటర్‌లో చూసేను, ప్రసాద్ గారిని !

మా దిగువ తరగతిలో కూచునివున్నారు. ఎవరో ఫ్రెండుతో వచ్చినట్టున్నారు. అతని మీదికి ఒరిగి, ఏవో కబుర్లు చెపుతూ సినీమా చూస్తున్నారు.

మనిషి బాగా నల్లబడిపోయేరు. పొట్టి చేతుల తెల్లచొక్కా, నల్లపాంటూ వేసుకొన్నారు. ఆ తెల్లటి చిన్నచొక్కాలోంచీ, ఆయన శరీరం, రంగుమారి, బలహీనంగా ప్రస్ఫుటమవుతోంది. పక్కనున్న స్నేహితుడు ఆరోగ్యంగా నిగనిగలాడు తోంటే, ఆయన అతనిపక్కన, దివిటీపక్కన దీపంలా వెలవెలబోతున్నారు !

నా కళ్ళు ఆయన్ని గుర్తించిన దగ్గరినించీ ఆయనమీదే వున్నాయి ముఖం అటు ఇటు తిప్పినప్పుడు, బొమ్మ వెలుగులో, ఆయన నుదుటిమీద, చెంపలమీద, మెడమీద ఎముకలు, నరాలు బైటపడి, జీర్ణావస్థని చాటుతున్నయ్.

ఒంట్లో ఏమయినా అస్వస్థతగా వున్నదా ? అలా అయితే, మంచంమీంచీ లేవలేరుగదా ? ఇలా సినీమాలికి తిరగగలరా ? ఏదో జ్వరం తీవ్రంగా కాసివుంటుంది ! జ్వరం తగ్గగానే, రిలీఫ్‌కోసం, సినీమాకి స్నేహితుణ్ణి వెంట తీసుకువచ్చి నట్టున్నారు, సిగరెట్లు తెగకాలుస్తారుగదా ! అందువల్లే ఆరోగ్యం దెబ్బతినుంటుంది !

రెండు సంవత్సరాల తరవాత, చూసే నాయన్ని ! ఈ వూర్నించీ వెళ్ళిపోయేరు. మళ్ళా వచ్చేరు కాబోలు !

అప్పుడింత అనారోగ్యంగా, బలహీనంగా లేరు !

తెల్లగా, బలంగా, కళకళలాడుతూండేవారు!

ఆయన్ని చూస్తు, స్థిమితంగా కూచో లేకపోతున్నాను. సినిమాకి వచ్చిందాన్ని, చూడ కుండా, ఆయన్ని చూస్తున్నానేమిటి ?

అమ్మ తట్టింది నా స్థితి గమనించు కున్నాక. నన్ను నేను నిగ్రహించుకొన్నాను.

ఇంటర్వెల్ అయింది.

ఆయన స్నేహితుడితో లేచేరు. పైకి చూస్తారేమోనని, అమ్మ చాటుకి తప్పుకున్నాను బయటికి వెళ్ళేరు వాళ్ళిద్దరు.

"ఏమిటే, రాజు ? సినీమా చూడకుండా, ఎటోచూస్తున్నావేమిటి ? బాగాలేదా నీకు ?" అంది అమ్మ.

"బాగానే వుంది" అన్నాను.

"ఏమిటి బాగుంది? నువ్వసలు చూళ్లేదు. చెప్పు! తలనెప్పిగా వుందా ? అలా అయితే ఇంటికి పోదాం! నా కోసం అని నువ్వు కూచో వద్దు!" అంది అమ్మ.

"ఏం లేదమ్మా ! తలనెప్పేంలేదు. బానే వున్నాను..." అన్నాను

అమ్మ ఏదో సణుక్కుంటూ కూచుంది.

ఆట ఆరంభమయింది ఆయనింకా రాలేదేమిటి చెప్మా ! ప్రేక్షకులందరూ వచ్చేస్తున్నారు ! అనుకొంటుంటే, వాళ్ళిద్దరూ నెమ్మదిగా ప్రవేశించేరు.

హాలులో నవ్వులు, చప్పట్లు !

సినీమా బావున్నట్టుంది ! అమ్మ కూడా నవ్వుతోంది గట్టిగా ! అమ్మని చూసి, నేనూ నవ్వేను. లేకపోతే, నేను సినిమా చూడలేదంటుందని !

ఆయన నవ్వుతున్నారో లేదోనని చూసేను. గట్టిగానే నవ్వుతున్నారు ! ఆయనకీ ఈ సినీమా బాగుందన్న మాట! అవునేమిటిలా ఆలోచిస్తున్నానేను ? ఆయనకి సినీమా బావుంటే నాకేం ? బాగులేక పోతే నాకేం ! ఆయనేం చేస్తే నాకేం !

ఇద్దరికీ ఇప్పుడే సంబంధమూ లేనప్పుడు, నేనెందుకిట్లా, ఆయన గురించి తలపోస్తున్నాను? ఎందుకు ఆరాటపడు తున్నాను ? ఛీ! నాకు బుద్ధిలేదు !!

ఆ తరువాత సినీమా అంతా చూస్తూ కూచున్నాను.

శుభం !

హాలు ఖాళీ అవుతోంది.

"ఏమే ? బావుంది కదూ ?"— అమ్మ.

"వూఁ ..."

వెళుతోంటే చప్పున గుర్తొచ్చినట్టు 'ఏరీ ? ఆయనేరీ ?' అనుకుని, చూసేనటు.

హాలు బయట—జనప్రవాహంలో—నా కళ్ళు చురుకుచురుగ్గా—తొందర తొందరగా—ఆత్రంగా, ఆయన్ని వెదికి పట్టుకున్నాయి. అమ్మ ఆటో మాట్లాడుతోంది. వాళ్ళు రిక్షా బేరమాడు తున్నారు.

"ఎక్కవే !" అంటోంది అమ్మ.

వాళ్ళ బేరం ఇంకా కుదిరినట్టులేదు.









ఆయన నన్ను చూసినట్టులేదు. చూస్తే, ఇటొస్తారా? పలకరిస్తారా? వుహు! ఎందుకు పలకరిస్తారు? ఒక్క నిట్టూర్పు విడిచేను బరువుగా. అమ్మ సతాయింపుతో ఆటో ఎక్కేను.

వాళ్లా రిక్షా ఎక్కుతున్నారు! వాళ్ళ రిక్షా వెనక, మా ఆటో వెడితే బావుండుననుకుంటుంటే, ఆటో రివ్వుమని, దూసుకుపోయింది వాళ్ళ రిక్షా పక్కనించీ! చూసేరా ఆయన? చూసేరో? లేదో?... చూస్తే ఏమవుతుంది నా పిచ్చిగాని!?...

## ప్రసాద్:

ఎగ్జిబిషను గ్రవుండు చాలా రద్దీగా, హడావుడిగా వుంది. గొప్ప కలర్‌ఫుల్‌గానూ వుంది! రకరకాల షాపులు సొగసులు విరజిమ్ము తున్నాయి. రకరకాల అమ్మాయిలు కులుకులు ఒలకబోస్తున్నారు.

అరె! రాజేశ్వరి! ఎవరామె పక్కన? స్నేహితురాలులా వుంది! ఏమిటీ రాజేశ్వరి? నేను ఎక్కడికి వెళితే అక్కడే కనిపిస్తోంది! నా ఏకాగ్రతని చెదరగొడుతూ, నా మనసుని అస్థిమితం చేస్తూ.

వాళ్ళకి, తనకీ కొన్ని గజాలు ఎడం వుంది. చాలామంది జనం అడ్డం వున్నారు. రాజేశ్వరి తన వేపు చూసినట్టులేదు. అటుఇటు చూస్తోంది స్నేహితురాలు పక్కన షాపులో ఏదో వస్తువు అడుగుతోంటే, రాజేశ్వరి పరిసరాలను చూస్తోంది.

ఆమెని చూస్తుంటే తనకెంత ఆకర్షణ కలుగుతోందో? అంత కోపం వస్తోంది! ఇంత అందమైన రాజేశ్వరిలో ఎంత అహంకారం వుందీ?! ఎంత దర్పం, కర్కశత్వం వున్నాయి?!

వాళ్ళ నాన్న పెద్ద కంట్రాక్టరుకావచ్చు! వాళ్ళకి రెండు మేడలు, పొలాలు వుండొచ్చు; రాజేశ్వరి ఏకైక సంతానం, ముద్దుల గారాబు తనయా కావచ్చు. అయితే, ఐశ్వర్యం అహంకారం ఇవ్వాలనుందా?

రాజేశ్వరిని పెళ్ళిచూపులనాడు చూసి, తను

# ఇది ఇద్దరి కథ

ఎంతో సంతోషాన్నీ, సంతృప్తినీ పొందేడు! అందం — అయిశ్వర్యం — ఎమ్మెస్సీ డిగ్రీ!! ఆ అమ్మాయిని భార్యగా పొందడం తన అదృష్టం అనుకున్నాడు.

పెళ్ళయిపోయింది! తన స్నేహితులు తనని ప్రశంసించేరు! ఒకరిద్దరు అసూయ కలుగుతోందనీ అన్నప్పుడు, తనకి గర్వం కలిగింది.

కొంతకాలం 'ఇదే స్వర్గం!' అనిపించింది.

మామగారు వాళ్ళ ఇంటిలోనే తమని వుండిపొమ్మంటే, తనకది ఇష్టపడక, వేరే ఇల్లు అద్దెకి తీసుకుని కాపురం పెట్టేడు. "నన్నింతగా ఆరాధించే భర్త దొరకడం, నా అదృష్టం!" అనేది రాజేశ్వరి. "మనం పూర్వజన్మలో కూడా భార్యాభర్తలం అయివుంటాం! లేకపోతే మన బంధం ఇంత బలపడదు!" అనేది.

అంతగా అభిమానించిన రాజేశ్వరి —

"మీరేం అనుకోనంటే, ఒకమాట చెప్తాను ... చాలా కాలంనించీ చెబుదామనుకుంటున్నాననుకోండీ . . " అందో రోజున.

ఆమె చెప్పినది విని తను నిర్ఘాంతపోయేడు. తను సిగరెట్లు కాల్చడం రాజేశ్వరికి నచ్చడం లేదుట. అసహ్యం వేస్తోందిట. తను డబ్బూ, ఆరోగ్యము నష్టపోతున్నాడంది. సిగరెట్టు వాసనంటే ఆమెకి చాలా ఎలర్జీట!!

అసలు పెళ్ళయిన మొదట్లోనే చెబుదామనుకొందిగాని, జంకు, బిడియం కలిగీ, తనే మనుకుంటాడోనని, ఆమె అసహ్యాన్నీ, అసహనాన్నీ బలవంతంగా మూతపెడ్తూ వస్తోందిట!

"సిగరెట్లు మానెయ్యడం నాకు వీలుకాని పని!" అని చెప్పేసేడు. "మానాల్సిందే! నా కోసం!" అంది! ప్రయత్నించేడు. ప్రాణం విలవిలలాడిపోయింది! మళ్ళా ఆరంభిస్తే ఒళ్ళు ఓదార్చుకుంది.

రాజేశ్వరి కోపగించుకుంది. అనురాగం స్థానంలో అధికారం వచ్చింది! "మానాస్తారా? లేదా?" అని నిలదీసింది! దూరంగా వుండసాగింది! విసుర్లూ కసుర్లూ!! తనకా పరిస్థితి దుర్భరంగా వుంది! రాజేశ్వరి ఎడంగా వుంటే భరించలేడు! సిగరెట్లకి దూరం అవలేడు!

తనలో రాజేశ్వరి భరించలేనిది సిగరెట్టు ఒక్కటేకాదు! తనకి శుభ్రంలేదంది!

"మీకు నీట్‌నెస్ అస్సల్లేదండీ! ఇల్లంతా సిగరెట్ పీకలు డర్టీగా పడేస్తారేం? పక్కమీద కూడా! కంపు కంపు! మీతో నాకు చాలా యాతనగా వుంది!"

"నాలుగు రోజులకో జత తొడుగుతారు! రోజూ బట్టలు మార్చమంటే వినరేం? చెమట కంపుకొడ్తూ! అసహ్యంగా! మీకేం తక్కువ? బోలెడు జీతం! వున్న బట్టలు చాలవా? చెప్పండి! నేను కొని కుట్టిస్తాను! అంతేగానీ తొడిగిందే తొడక్కండి! నాకు రోతగా వుంటుంది!"

"రాజేశ్వరీ! నేనివాళ ఇంజనీరునేకావచ్చు! కాని, నీ అంత అయిశ్వర్యం నాకు లేదు! మా నాన్న కష్టపడి నన్ను బి.య్యే. చదివించేరు! మా అమ్మ గాజులమ్మి, లంచం పోసీ, వుద్యోగం సంపాదించేను! డబ్బు విలువ నాకు తెల్సు! నీకేంతెల్సు? నేను రోజుకో డ్రెస్సు మార్చే గొప్పవాణ్ణి కాను!"

"అందుకే కాబోలు! సిగరెట్లకంతేసి డబ్బు తగలేస్తున్నారు?"

"షటప్! అది నా పర్సనల్ విషయం!"

"భార్య కూడా పర్సనలే భర్తకి!"

మాటమీద మాట పెరిగేది! మనసులు పాడయ్యేవి!

రాజేశ్వరి విసుక్కుంటూ, "మీ అంత మూర్ఖపు మనిషి ఎవరూ వుండరు! నేను శుభ్రం గురించి చెబితే, మీరు విలువలు అంటూ మరో మాట తెస్తారేం!" అంది.

"చిన్న చిన్న విషయాలకి నువ్వు కొంప మునిగినట్టే గోల చేయడం, నన్ను గోలపెట్టడం నాకేం బావులేదు, రాజేశ్వరీ!"

"ఇవి చిన్న విషయాలా? రోజూ, మనం ప్రతీ నిమిషం ఎందుకు కీచులాడు కొంటున్నాం?

సహించలేనివీ, చికాకుపెట్టేవీ చిన్న విషయాలెలా అవుతాయండీ ? మీకెలా వుందో గానీ, నాకు మాత్రం నరకయాతనగా వుంటోంది! అశుభ్రాన్నీ, చెడు అలవాట్లనీ నేను ఒక్కపిసరు కూడా సహించలేనండీ !''

''సహించ లేకపోతె, ఫో ! నా పద్ధతులు నావి !''

''మీ మొండితనమే మీది ! అంతే గాని, మీ పద్ధతులు మార్చుకోరన్నమాట ?''

''మార్చుకోను !''

తమ పెళ్ళి అయిన మొదటి రోజుల్లో—

తను ఆఫీసునించి రాగానే, అలాగే వెళ్ళి మంచమ్మీద వాలి, జేబులోంచి సిగరెట్ పాకెట్ తీస్తే – రాజేశ్వరి వచ్చేసి – ''మంచి వాళ్ళు కదూ ? ప్లీజ్ ! ప్లీజ్ !'' అంటూ చెయ్యి పట్టుకు లాక్కెళ్ళి సోఫాలో కూచోపెట్టేసేది !

రోజూ, సాయంత్రం విధిగా స్నానం చెయ్యా లంటూ ! ''ప్లీజ్ ! ప్లీజ్ !'' అంటూ, బాత్రూమ్‌లోకి తోసేసేది !

అప్పుడు తను రాజేశ్వరి చర్యల్ని అంతగా పట్టించుకోలేదు. అదంతా తనమీద ఆమెకున్న వల్లమాలిన ఆపేక్ష కాబోలు ! అనుకున్నాడు. లోపల విసుక్కున్నా, అలాగే చేసేడు !

బహిరంగంగా రాజేశ్వరి అయిష్టాన్నీ, అసహ్యాన్నీ వెల్లడించేక, తనకి వుక్రోషం, అవమానం కలిగేయి ! ప్రతీ రోజూ, ప్రతీ నిముషమూ అసహ్యించుకొనే ఆమెతో కలిసి వుండడం దుర్భరం అనుకొన్నాడు .

## రాజేశ్వరి :

అదేమిటక్కడ ? ప్రసాద్‌లా వున్నారే ? ఆయనేనా ? ... అవునవునాయనే !!

తను వెళ్ళిన చోటికల్లా వస్తున్నారేమి టాయన ?

తన ఏకాగ్రతని చెదరగొడుతూ— మనసుని అస్థిమితం చేస్తూ —

ఆయనకీ, తనకీ కొన్ని గజాల ఎడం వుంది. తననిగాని చూసేరేమిటాయన ? చూసే వుంటారు ! ఎంత ఇష్టం లేకపోయినా, వారగా అయినా చూడకుండా వుంటారా ?

ఆయన్ని చూస్తూంటే తనకెంత జాలి వేస్తోందో ? అంత కోపం వస్తోంది ! ఆ మనిషిలో ఎంత మూర్ఖత్వం వుందీ ?! ఎంత మొండితనం వుందీ ?!

పెద్ద ఇంజనీరే కావచ్చు; అయితే మాత్రం? అంత అవివేకమూ, పట్టుదలా, పంతమూ వుండకూడదు !

పెళ్ళయిందగ్గర్నించీ తనని ఆకాశాని కెత్తేసేరే !

''రాజేశ్వరీ ! మగవాడి కలల పంట నీలాంటి ఆడది! నువ్వు నాకు లభించడం నా అదృష్టం!''

## ఇది ఇద్దరి కథ

''మా స్నేహితులందర్లో నేనిప్పుడు గొప్ప వాడిగా పరిగణింపబడుతున్నాను తెల్సా ? నాకది చాలా గర్వంగా వుంది !''

అంత యిదిగా పొగడి, తనకి ఆధిక్యతని ఇచ్చినాయన, తన మాటలకి ఎందుకు విలువ ఇవ్వలేదు ? తన అభిప్రాయాలకి, సలహాలకి ప్రిఫరెన్సు ఇవ్వలేదు ? తను ధన కనక వస్తు వాహనాలేమీ కోరలేదే ! తనకి అనుకూలంగా వుండమన్నది ! దానికే అంత వైరం పూనాలా ? శత్రుత్వం వహించాలా ?

''నీకు బాగా డబ్బుంది కాబట్టే, నువ్వు రోజుకో చీరె కడతావు ! అలా నాకు జరగదు!''

''గొప్పవాళ్ళకయితే నీట్‌నెస్ మెయింటైన్ చెయ్యడానికి జరుగుతుంది. మాలాంటివాళ్ళ కలా జరగదు ! ఎలాగోలా గడిపేస్తాము !''

''నీకంత ప్రత్యేకమైన పద్ధతులుంటే, పెళ్ళికి ముందరే చెప్పాల్సింది! నీకు అనుకూలంగా వున్నవాడే నిన్ను పెళ్ళి చేసుకోనుగద ?''

''అప్పుడు వూరుకున్నావ్ ! ఇప్పుడు నన్ను చంపుతున్నావ్ !''

''భర్తని అసహ్యించుకొనే ఆడదాన్ని భరిం చడం చాలా కష్టం ! మనం దగ్గరగా వుండీ పోట్లాడుకొనేకంటే, విడిపోయీ, ఎడంగా వుండడమే ఇద్దరికీ మంచిది !!''

అని ఖచ్చితంగా చెప్పేసేరు ! తనకి ఒళ్ళు మండిపోయింది! ఆయనంత సూటిగా, ఘాటుగా చెబుతూంటే, ఇంకా బతిమాలుకొందికి తన కసహ్యం వేసింది ! తనకేం తక్కువని ఆయన దగ్గర పడివుండాలీ ?

ఇద్దరు ఒక నిర్ణయానికి వచ్చేసేరు !!

## ప్రసాద్ :

రెండు వైపులా పెద్దవాళ్ళు ఆ వార్త విని, నిశ్చేష్టులయ్యేరు. ఇద్దరినీ తిట్టేరు స్నేహితులు చీవాట్లు పెట్టేరు. 'ఇలాంటి విషయాల్లో సర్దుకుపోవాలి ! రెండోవాళ్ళని మన్నించాలి !

### చిరునామాలు : మనవి

పత్రికలోపడ్డ రచయిత్రుల చిరునామాలు కావాలని రాయవద్దని మనవి. మీరు వారికి రాసే ఉత్తరాలు కేరాఫ్ ఎడిటర్, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 3 అని రాసినట్లయితే— మా కార్యాలయం నాటిని ''రీ డైరెక్టు'' చేయడానికి ప్రయత్నిస్తుంది. కనుక రిప్లయి కార్డులు రాయవద్దని మనవి.

— సం॥

అంతే గానీ, ఏకంగా కోర్టుకే ఎక్కిపోతారా ? ఛీ !'' అన్నారు !!

వాళ్ళకేం ? ఎన్నయినా చెప్తారు ! తమతో వుంటే వాళ్ళకి తెలిసేది తమ బాధలు !!

ఇక్కడినించి పైవూరికి బదిలీ చేయిం చుకొని వెళ్ళిపోయేడు తను ! రెండేళ్ళు అక్కడ వుంచీ, మళ్ళా ఈ వూరికే బదిలీ చేసేరు ఆఫీసు వాళ్ళు !

మళ్ళా ఈ వూర్రావడం – మళ్ళా రాజేశ్వరి కనిపించడం— మళ్ళా వెనుకటి అను భవాన్ని తలచుకోవడం— బాధపడడం !!

చ ఛ ! ఎందుకిదంతా ? అనిపించింది. రాజేశ్వరి కనిపించితే, అదేమిటో ? కోపంవచ్చినా, దగ్గరవాలనే అనిపిస్తోంది ! ఇటే చూస్తోంది రాజేశ్వరి !! ఆ చూపుల్లో ఆపేక్ష వుంది !, తనే ఆవేశపడ్డాడేమో ? ఆమెకి అనుకూలంగా వుండాల్సింది !! ఎంత భర్త అయినా, పాడు అలవాట్లు పాడు పద్ధతులుండే భార్యకి ఓర్చు కోవడం కష్టమే !! రాజేశ్వరి మళ్ళా దగ్గరయితే బావుండును !! ఒంటరి బ్రతుకు తనకి దుస్సహంగా వుంది ! ఎంత విడాకులిచ్చినా, ఆమెని పూర్తిగా మరిచిపోయి మరో పెళ్ళి చేసుకోలేకపోయేడు !!

ఆమె అంగీకరించితే, తన పద్ధతులు మార్చేసుకుంటాడు ఆమెకంటే ఎక్కువా, అవి ? ? ..

## రాజేశ్వరి :

ఆయన తననే చూస్తున్నారు ! ఈ గ్రవుండులో ఇంతమంది ఆడవాళ్ళు కళ్ళు చెదిరేట్లుంటే, తననే చూస్తున్నారేమిటాయన? తనమీదాయనకి వ్యామోహము, ఆపేక్ష వున్నాయన్నమాట, ఇంకా ? ! తన నాయన మరిచిపోలేదన్నమాట ?

అదిగో ! నవ్వుతున్నారు !! ఆ నవ్వులో, చూపులో అదే ఆరాధన ! శరీరాలు విడాకులు తీసుకున్నా, మనసులు విడాకులు తీసుకోలేదన డానికి, తమిద్దరే సాక్ష్యం !!

ఆయన ఒప్పుకొంటే, తనకేమీ అభ్యంతరం లేదు ! విడిపోయిందేగాని .ఆ ఒంటరి బ్రతుకులో నరకం అనుభవిస్తోంది ! లోటు, అసంతృప్తికి తోడు, ఇంట్లో – వాకిట్లో విమర్శలు ! హేళనలు !!

తనే ఆయన్ని బాధ పెట్టిందేమో ? ! ఆయన పద్ధతులు తనకి నచ్చకపోవచ్చు కాని, ఆయన మనసుకేం ? తనంటే ఎంతో ప్రేమ !!

అదిగో ! వస్తున్నారిటు !! పిలుస్తున్నారు ! తననే !!

## ప్రసాద్ :

తన రాజేశ్వరి పలికింది !! ఈశ్వరుడి గుడిలో గంటలు మ్రోగాయి !!



# వారఫలం

30-3-1984 శుక్రవారం మొదలు 5-4-1984 గురువారం వరకు

♈ మేషం: పనిపాటలు చేసే వారితో గాని, నడిపే వ్యాపారమందు గాని అనవసరంగా యిబ్బందులుండగలవు. చేసిన పనే మరలా చేయవలసి రావచ్చు. శుభవార్తా శ్రవణానికి, అప్పులు వసూలు కావటానికి మాత్రం యిబ్బంది లేదు. స్త్రీలకు: నూతనాంశాలు వినటం, నూతన మిత్ర సాంగత్యానికి అవకాశమున్నది.

♉ వృషభం: ఆరోగ్య లోపం ఏర్పడుతుంది. వ్యవహార రీత్యా ఎదురు చూడని దెబ్బలకు ఆస్కారమున్నది. ఉన్నత విద్యా యోగ్యతకు, రాజకీయ రంగాన సదవకాశాలకు మాత్రం ఏలాంటి యిబ్బంది లేదు. స్త్రీలకు: సమాజ పరంగా, కళారంగ పరంగా సదవకాశాలు, ఆదాయం లభ్యం కావటంలో ఆక్షేపణ లేదు.

♊ మిథునం: బంధువులు యింటికి రానున్నారు. పదిమందిలో పేరు ప్రతిష్ఠలు అతిశయింపనున్నవి. పరోపకారంతో కాలం వ్యయించవలసి వస్తుంది. చాలమందికి వృత్తిలో ప్రగతి కనిపించే అవకాశమున్నది క్రయవిక్రయాలందు గణనీయమైన మార్పు కనిపిస్తుంది. స్త్రీలకు: ఆదాయమందు వృద్ధి, నూతనాంశాలు గ్రహించటం జరుగుతుంది.

♋ కర్కాటకం: వృత్తియందు గాని, ఉద్యోగమందు గాని, వ్యాపారమందు గాని చెప్పదగిన అభివృద్ధి కనిపిస్తుంది. చాలమందికి నూతన వ్యాపారంపై దృష్టి మరలుతుంది అధికాదాయానికి కూడా అవకాశం గల వారం. చాలమందికి గృహ విస్తరణకు సదవకాశముంటుంది. స్త్రీలకు వస్తు సంగ్రహణానికి అవకాశమున్నది.

♌ సింహం: ధనవంతుల ఆశ్రయం గాని, పెద్దల అనుగ్రహం గాని, దైవారాధనా తత్పరత గాని, శుభ ప్రసంగాలకు అవకాశం గాని చాలమంది విషయంలో చెప్పదగిన వారం. సభాగౌరవానికి కొందరకు ఆస్కారం గల వారం. నూతనాంశాలు గ్రహించే మార్గమున్నది. మిత్ర సంపద అభివృద్ధినందుటకు కూడ కొందరకు అవకాశమున్నది. స్త్రీలకు. అధిక విద్యార్జనకు, ఉద్యోగాభివృద్ధికి అనుకూల వారం

♍ కన్య: పెద్దలను కలిసికోవటం, దూర ప్రాంతాలకు ప్రయాణం చేయవలసి రావటం, ఉద్యోగాన్వేషణ సానుకూలం కావటం, ముఖ్య బంధువులను కలిసికోవటం, వ్యాపార విషయాలను చర్చించటం యిత్యాది ఉత్సాహ జనకములైన విషయాలకు ఆస్కారం గల వారం కొందరకు గృహ మార్పు సూచింపబడు వారం స్త్రీలకు: వృత్తియందు ప్రకాశం, ధనలబ్ధి, కార్యానుకూలతకు అవకాశం గల వారం.

♎ తుల: సులభంగా ఒకానొక విషయం వారాంతంలో సానుకూలం కాగలదు. రాశియందు స్థితుడైన 'ఉచ్ఛ శని' కొన్ని విషయాలలో మేలు చేయటం మరి కొన్ని రంగాలలో కీడు గావించటం గమనిస్తారు. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధి, ధనలబ్ధికి అవకాశం గల వారం.

♏ వృశ్చికం: మీ తెలివితేటలు రాణింపునకు రాగల సన్నివేశాలుంటాయి. దూర బంధువుల రాక, ముఖ్య వ్యవహార పరిష్కారాలకు ఆస్కారం గల వారం. వివాహాది శుభకార్యానుకూలత కూడా చేకూరుతుంది. పోయిన ఉద్యోగం విషయం మరచి, నూతనంగా జీవనాధారానికై ప్రాకులాడండి. స్త్రీలకు: సర్వానుకూలత గల వారం.

♐ ధనుస్సు: ప్రజారంగంలో, గ్రామ పెద్దరికంలో సభా కార్యక్రమంలో పాల్గొనుటకు చాలమందికి అవకాశం లభించగలదని గ్రహించాలి. అనుకోకుండా కొందరకు ఆరోగ్యమందు లోపం గమనించగలుగుతారు. స్త్రీలకు ఆదాయమున్నది, కార్యానుకూలత యున్నది, పదిమందిలో పేరు ప్రతిష్ఠలుంటవి.

♑ మకరం: ఇల్లు గాని, విలువ గల వస్తువులు గాని కొనుగోలు చేయుటకు అవకాశమున్నది. ముఖ్య విషయములందు పరిష్కారం, అభివృద్ధి సాధింపనున్నారు. శక్తి వంచన లేక ఉద్యోగమందు పాటు పడటం సర్వదా అవశ్యకమని గ్రహించాలి. స్త్రీలకు. నూతనాంశాలు గ్రహించుటకు వస్తు వాహనాలు సమకూర్చుకొనుటకు అవకాశం గల వారం.

♒ కుంభం: బాగా విజృంభించి కార్య కలాపాలందు జోక్యం కలుగ జేసికోవలసిన సమయం మీ తాలూకు వ్యక్తులు విరోధపడకుండా చూచుకోవాలి. వృత్తిలో పెంపు కనిపిస్తుంది. చాల కాలంగా అపరిష్కృతంగా ఉన్న ఒకానొక వ్యవహారం సానుకూలం కాగలదు. స్త్రీలకు కళారంగాభివృద్ధి, ధనలబ్ధి

♓ మీనం: దూర ప్రాంతాలకు ప్రయాణం చేయాలని చాలమంది ఉబలాటపడుతారు. వృత్తియందు నూతన శక్తి యుక్తులు ప్రదర్శించి ఔన్నత్య శక్తిని సముపార్జించుకోగలరు వైజ్ఞానికంగా కొందరకు లాభదాయక సమయం ఆదాయంలో కూడా కించిత్తు అభివృద్ధి కనిపిస్తుంది. స్త్రీలకు: చాల కాలంగా అందని ద్రవ్యం అందటం, అవసరాలు తీరటం సుఖ సంతోషాలతో విందు వినోదాలతో వారం గడవటం గమనిస్తారు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం



సునీల్ గవాస్కర్‌కి ఈ మధ్యనే కొల్హాపురంలో పురసత్కారం చేశారు ఆ సందర్భంలో ఆయన ఈ వేషం ధరించారు! సుప్రసిద్ధ క్రికెట్ ఆటగాళ్లు కొందరు త్వరలో వికలాంగుల సహాయం కోసం క్రికెట్ మాచిలు ఆడగలరని ఆయన వెల్లడించారు



కీ. శే. యూరీ ఆంద్రోపోవ్ అంత్యక్రియలకి హాజరయిన వారిలో వీరొకరని ప్రచురణ సందర్భం తెలుపుతోంది శ్రీమతి గాంధీ వెనుక నుంచుని ఉన్నారు కూడా కాని వారి పేరు ఈ బొమ్మని వేసిన పత్రిక తెలుప లేదు ...



కొంత కాలం కింద ఒక పులి (టైగర్)కీ సింహం (లయన్) నికీ పుట్టిన జంతువుని "టైగర్" అన్న పేరు పెట్టారు. పయి బొమ్మలోని ప్రాణి ఒక మేక (గోట్) కీ గొర్రె (షీప్) కీ పుట్టినట్టు లెక్క. ఇంగ్లీషు అక్షరాలనిబట్టి "గీప్" అని పేరు పెట్టారుట. తెలుగులో 'మేర్రె' అనికాని 'గొక' అనిగాని పేరు పెట్టాలేమో!

ఇది ఎలాగ పుట్టింది? కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం (ఇంగ్లాండు) లో కొన్ని మేకల, గొర్రెల భ్రూణాలని (చాలా తక్కువ కణాలు కలవాటివి) గొర్రెల, మేకల గర్భకోశాలలో పెట్టారుట.

వాటిలో కొన్ని పుట్టిన తరువాత ఈ విధంగా ఎదిగాయి

వీటిలో ఒకదాని నెత్తురులో మాత్రమే ఇటు మేకలకీ, అటు గొర్రెలకీ ఉండే మాంసకృత్తులు రెండూ ఉన్నాయట

కాని కంచరగాడిదలలాగే దీని వీర్యం సంతానం కలిగించలేదుట...

సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

(గత సంచిక తరువాయి)

కృష్ణారావు కంఠంలో వేదన వణికింది.

ఆ కన్నులలో — ఆవేదన తొణికింది.

"బాబాయ్ —"

శ్రీహరిగారిలో చలనం అలలా రేగింది.

అప్పటిదాకా ఆయన కళ్ళముందు కన్పిస్తున్నాయి — రెండు అరుదైన అపూర్వమైన ఆకృతులు ఆ రెండూ ఒకే తేజోపుంజంలా — కృష్ణారావులో నిక్షిప్తమవటం లీలలా కన్పించింది —

"బాబాయ్ —"

"కృష్ణా — నాకు తెల్సు ..నాకు తెల్సు .."

కృష్ణ చూపుల్ని తట్టుకోటం కష్టమైంది.

తన భావాలను చదవాలనే అతని దృష్టి — తాత్కాలికమైన ఆవేదనను చీల్చుకుని మరీ చూస్తోంది —

"...కృష్ణా — నీతో మాట్లాడటమే కష్టమనుకున్నాను. కానీ — నీ మాటలు ఇంకా ఇంకా వినాలనీ — ఎంతో కష్టంగా అన్పించే నీ భాషలోని భావాలు చదవాలనీ, నా మనసు ఉవ్విళ్ళూరుతోందయ్యా... అంతేకాదు ."

అంత చల్లదనంలోనూ చిరుచెమటలతో — తనతో ఏదో చెప్పాలనీ — ఏదో వినాలనీ తహతహలాడుతున్న ఆయన్ని విస్మయంగా చూశాడు కృష్ణ.

"బాబాయ్ . ఏమిటి చెప్పాలనుకుంటున్నావ్ — !" కొద్దిగా తొట్రుపడ్డారాయన

"కృష్ణా ! — నువ్వు చెప్పినట్టు వారిద్దరూ కారణజన్ములే. ఈ కలియుగంలో అరుదైన వ్యక్తిత్వం వున్నవాళ్ళే — గోలోకమంటూ ఒకటుంటుందని చాలామందికి తెలియని ఈ రోజుల్లో — నీ భావన ప్రకారం గోలోకానికి తప్పక వెళ్ళేవుంటారు. నువ్వన్నట్టు అంత అదృష్టం ఎవరికుంటుంది ? ఎంతమంది కుంటుంది ?

వాళ్ళకది సాధ్యమైంది పూర్వజన్మ సుకృతం వాళ్ళని పునీతుల్ని చేసింది

ఆ తానులో గుడ్డవే నువ్వు అందుకే ఇంత చిన్నతనంలోనే — ఇంత ఆధ్యాత్మిక తత్వాన్ని స్వంతం చేసుకున్నావు ఇంత విషయ పరిజ్ఞానం — ఈ వయస్సులో... "

కృష్ణారావు చిన్నగా నవ్వాడు.

"నా మాటలు నవ్వు తెప్పిస్తున్నాయా కృష్ణా ?"

కృష్ణారావులో తను కోరుకున్న సమాధానాన్ని వెతుకుతూ కుతూహలంగా చూశాడు.

"..కాదు బాబాయ్... అప్పుడప్పుడు అన్నయ్య నాతో అనేవాడు . ఆ శ్లోకం గుర్తుకు వచ్చింది —"

"ఏమిటది ?"

కృష్ణ కంఠం ఖంగుమంది

శ్లో॥ శిశేనాసీ ద్మాత్యం జనని తవ మన్త్రం ప్రజ పితుర్.
కిశోరే, విద్యాయం, విషమ విషయే, తిష్ఠంతి మనః
ఇదానీం భీతోహం మహిషగళ ఘంటా ఘ సరవా
న్నిరాలింబో లంబోదర జనని కంయామి శరణమ్॥

పాపం ఒకతను దుర్గాదేవిని తల్చుకుంటూ— శైశవంలో శక్తి లేకపోయినందువల్ల నీ మంత్రం జపించలేకపోయాను. ఇక బాల్యంలో— చదువుమీదా, ఇతర సుఖాలమీదా మనసు కేంద్రీకరించి వుండటంవల్ల ధర్మమేదో తెల్సుకోలేకపోయాను — ఇప్పుడు దున్నపోతు గంటల చప్పుడు విన్పిస్తోంది. అంటే నాకు మృత్యువు సమీపిస్తోంది — ఈ సమయంలో నాకు మృత్యు భయం తప్ప మరే భయం కలగటంలేదు

ఈ క్షణంలో నన్నెవరు రక్షిస్తారు ? — 'నేనెవర్ని శరణు కోరను ?' అంటూ ఏడ్చేవాడుట.

అందుకే అన్నయ్య నన్నెప్పుడూ హెచ్చరించేవాడు. 'మృత్యువుకు — పసివారనీ — వృద్ధులనీ తారతమ్యాలు వుండవు. ఎప్పుడైనా — ఎవరైనా ఏ క్షణంలోనైనా మృత్యు పిలుపుకు సంసిద్ధులమై వుండాలి ఈ జీవితం బుద్బుదం. రేపటి క్షణం మనది కాదనుకుని, మృత్యువును గురించి భయపడకుండా —

ఎప్పటికప్పుడు — ఏ క్షణాని కాక్షణం — దైవ చింతనతో జీవితాన్ని చరితార్థం చేసుకోమనేవాడు —'

కృష్ణారావు కళ్ళల్లో కాంతిపుంజాలు కన్పించాయి.

"బాబాయ్ — నాకున్న కొద్దిపాటి జ్ఞానం వల్లా గ్రహించింది — క్షణానికున్న విలువను కూడా. ప్రతీ క్షణం దైవసమానమే. ఏ క్షణాన్నీ వృధాపుచ్చుకూడదు. అంతకుమించిన అజ్ఞానం వుండదు. మృత్యువుకు భయపడుతున్నామంటే — సాక్షాత్తూ ఆ భగవంతుని ఆలింగనకు భయపడినట్టే. మృత్యువంటే ఎవరు బాబాయ్— ఆ లోక నియంత, కాలాగ్నిరుద్రుడు, సృష్టి స్థితిలయ కారకుడూ — సాక్షాత్తూ, ఆ శ్రీకృష్ణ పరబ్రహ్మేకదూ —"

చిన్నగా — చల్లగా — వెన్నెలలా — చిరునవ్వులు చిందిస్తూ — అభం శుభం ఎరుగని

**జరిగిన కథ — 4 :** తులసమ్మ కుమారులు రామకృష్ణయ్య, కృష్ణారావు. రామకృష్ణయ్య కృష్ణభక్తుడు భార్య కళ్లలోకూడ ఆయనకు నీలమేఘశ్యాముని దివ్యరూపమే కన్పిస్తుంది. కృష్ణారావుకి సంగీతం అంటే ప్రాణం వీరిద్దరి ప్రవర్తన చూసి తల్లి తులసమ్మ తనువారిపై పెంచుకొన్న ఆశలు తీరవేమో అని భయపడింది. తులసమ్మ కృష్ణారావుని వంశం నిలపమని వేడుకొంటుంది తల్లి కోరిక అన్నతోచెప్పి ఆయన సలహా అడుగుతాడు కృష్ణ. అడిగిన వాళ్లకు రాధ మాధవుల తత్వం బోధించమని కృష్ణను కోరుతాడు రామకృష్ణయ్య. అన్న పరిస్థితి బాగలేదని తల్లిని, వదినను వచ్చి చూడమంటాడు కృష్ణ. రామకృష్ణయ్య మరణిస్తాడు. లక్ష్మి తన శేష జీవితం అత్తగారింట్లోనే గడుపుతానని చెపుతుంది. కృష్ణారావుని పెళ్లి చేసుకొమ్మని తల్లి వేడుకొంటుంది అత్తగారి కోరిక తీర్చమని కృష్ణకు చెపుతుంది లక్ష్మి. తల్లి ఆశను తీర్చాలా ! గృహస్థ ఆశ్రమం స్వీకరించాలా వద్దా ! అనే సందిగ్ధంలో పడతాడు కృష్ణారావు. శ్రీహరి బాబాయికూడా తులశమ్మగారి కోరిక న్యాయమైనదని, పెళ్లి చేసుకోమని బోధిస్తాడు.



అమాయకత్వంతో — లేతవయసులో—విచిత్రంగా కన్పిస్తూన్న కృష్ణదెంత లోతు హృదయం !—

లోతే తెలియని ఆ సాగర మానసంలో — సాక్షాత్తూ దైవాన్నే దాచుకోగల సమర్థతగల కృష్ణ — సామాన్యుడుకాడని తెల్సుకోటానికి ఎక్కువసేపు పట్టలేదు శ్రీహరిగార్కి.

ఎప్పటికప్పుడు గమనిస్తూనే వున్నా — విస్మయాన్ని కలిగిస్తున్న అతని ప్రతిచర్యా — ప్రతీమాటా — మరుగున పడిపోయిన మహానుభావుల్ని గుర్తుకు తెస్తూంది. తులశమ్మ అమాయకురాలు. బిడ్డల శక్తి సామర్ధ్యాలకన్నా— అందర్లా వాళ్ళూ — సుఖపడాలనే సిద్ధాంతాన్ని అమాయకంగా నమ్ముతోందావిడ. ఆవిడ బాధ చూడలేకే—కృష్ణతో పెళ్ళి గురించి నచ్చచెప్పి — వొప్పిస్తానని — పట్టుదలతో వుండిపోయాడు తను —

కానీ ఇప్పుడేం జరగబోతోంది ?

తనేం చెప్పగలుగుతున్నాడు ?

కృష్ణ ఏం చెప్తున్నాడు ?

ఆనాడు శ్రీకృష్ణుడ్ని—వసుదేవుడి దగ్గర వదిలిపోతూ — పుత్రవాత్సల్యం చావక — ఆ బంధానికి దూరంకాలేక — కన్నీరు మున్నీరుగా విలపించే నందునికి జ్ఞానబోధచేసి — అతని అజ్ఞానాన్ని తొలగించి మహానందాన్ని నందునిపరం చేసి పంపిన పసివాడైన శ్రీకృష్ణ పరబ్రహ్మ గుర్తుకువస్తున్నాడిప్పుడు —

నవ్వు పెదాల చాటునే బిగించి కర్తవ్యం ఆలోచించాడు.

ఒక బాధ్యత పెద్దరికంతో నెత్తిన వేసుకున్నాడు తను. శక్తివంచన లేకుండా కృషి చెయ్యాల తను.

ఇందులో విజయం ఎవరివైపున్నా — అది కేవలం దైవ సంకల్పం మాత్రమే. ఇప్పుడు తృప్తిగా వుంది శ్రీహరిగారికి.

"కృష్ణ —"

ఆ పిలుపులో ఊహించని వాత్సల్యం కన్పించింది.

"నిన్ను కొన్ని ప్రశ్నలడుగుతానయ్యా ... సమాధానాలు చెప్తావా ?—"

కృష్ణారావు చిన్నబుచ్చుకున్నాడు.

"అదేమిటి బాబాయ్—చెప్పమని ఆజ్ఞాపించే అధికారం నీకు లేదనుకుంటున్నావా ?"

"అలా అనుకోటంలేదు బాబూ — ఆ అధికారం వుంది — కనుకనే నీ సమాధానాలు కావాలి నాకు —"

"... —నాకు నీ సలహాలు కూడా కావాలి బాబాయ్ —"

కృష్ణారావు కళ్ళల్లో తడబాటు కూడా కన్పించింది. అతని వినమ్రత శ్రీహరిగార్కి కొండంత ధైర్యం అందించింది.

"నీకు వివాహమంటే ఎందుకంత వైముఖ్యం ?—"

ఉదాసీనంగా వుండిపోయాడు కృష్ణారావు.

"చెప్పు కృష్ణ ..."

కృష్ణ కళ్ళు విశాలంగా విచ్చుకున్నాయి

"బాబాయ్. అక్షరజ్ఞానం తెల్సిన తరువాత నేను విపరీతంగా ఆకర్షించబడింది వివేకానంద స్వామి పట్ల. ఆయన ఉపన్యాసాలు వినటానికీ — శక్తికొద్దీ అర్థం చేసుకోటానికీ అలవాటుపడిపోయాను. ఆయన ఆదర్శాలూ— ఆచరణలూ — నా సందేహాలకు సమాధానం చెప్పేవి. విదేశాల్లో ఆయన సింహగర్జన — నా ఉడుకు రక్తాన్ని ఉప్పొంగించేది. అతి నిర్మలమూ— నిష్కపటమూ ఐన ఆయన మనోభావాలూ — ఆధ్యాత్మిక బోధనలూ, ఆయన పవిత్ర జీవనం— కఠోర నియమనిష్టలూ నా మనసులో అలజడి రేపేవి. ఉప్పెనలా వచ్చే ఆలోచన్లని అదుపులో పెట్టుకోలేక పోయేవాడ్ని

ఒక వ్యక్తి మహాశక్తిగా మారి — దేశదేశాలనూ ఆకట్టుకుని— మన దేశ ఔన్నత్యాన్ని వేనోళ్ల చాటిచెప్పి — మన విజయ పతాకాన్ని నిల్పి— భారతదేశ ప్రతినిధిగా మన కంతులేని పేరుప్రతిష్టలు తెచ్చిన ఆ మహానుభావుడే — నాలో చిరస్థాయిగా నిల్చిపోయాడు ...

ఆ తరువాత నా వయసునే నేను పూర్తిగా మర్చిపోయాను... బాబాయ్... నిత్యం మన ఇల్లు వేదాలతో— పురాణ ఘోషతో, పుణ్యగీతాలతో హోరెత్తి పోయేది. నా ఆలోచన్లను పరిసర ప్రభావం మరింతగా పెంచింది. అజ్ఞాతంగా

## కర్మయోగి

నాలో నిల్చిన అర్థంకాని తపన ఒక రూపాన్ని సంతరించుకుంది. ఇటువంటి ఇంట్లో — భక్తికి వారసుడుగా పుట్టట్టం నా పూర్వజన్మ సుకృత మనిపించింది. నాన్నగారు వ్రాసుకున్న డైరీలూ, పుస్తకాలూ— నా జిజ్ఞాసను పెంచాయి. మానసికంగా ఆయన భావనలకు ఆకర్షితుడినయ్యాను.

... ఆ తరువాత అన్నయ్య వ్యక్తిత్వానికి దాసుడ్నయ్యాను. భార్యను, భార్యలా కాక — అంతలా మన్నించే ఆయన వ్యక్తిత్వం మొదట్లో అర్థమయేది కాదు నాకు. అందరు స్త్రీలలోనూ మాతృత్వాన్నే చూడగల ఆయన దృష్టి వదిన మీద కూడా అదేవిధంగా వుండటం గమనించి నిశ్చేష్టుడినయ్యాను.

సాక్షాత్తూ కృష్ణ చైతన్యుడిని అన్నయ్యలో చూడగలిగాను. శ్రీ కృష్ణ సన్నిధిని మించిన గమ్యంలేదని—అహోరాత్రులూ—కృంగి కృశించి—మృత్యువు కోసం ఆనందంతో ఎదురుచూసే అన్నయ్య ... అన్నయ్య కూడా పరిస్థితులకు లొంగి—ఎలా వివాహం చేసుకోగలిగాడా అని ఆశ్చర్య పడేవాడిని. వదిన స్థితికి వదినకన్నా నేనే ఎక్కువ బాధపడేవాడినేమో కూడా. అన్నయ్యకి చాలా మటుకు నాన్నగారి పోలికలొచ్చాయి. అలాగే—అత్తగారి సహనం—వ్యక్తిత్వం—కోడలికి రావటం కూడా అరుదే. లోపల్లోపల అమ్మ, వదినా—ఏమనుకున్నా—ఎంత బాధపడినా పైకి మటుకు జీవితంలో రాజీ పడిపోయేవారు ... అందుకే — నాన్నగారూ అన్నయ్యా ... వాళ్ళ లక్ష్యాన్ని నెరవేర్చుకోగలిగారేమో...'

"...నీకూ అటువంటి అనుకూలవతి రాకపోవచ్చని భయపడుతున్నావా ? రాని పక్షంలో నీ ఆదర్శాలకు తిలోదకాలివ్వలేకేనా నీ బాధ ? అందుకేనా పెళ్ళి వద్దంటున్నావ్ !—"

శ్రీహరి గారిలో ఆశా, ఆత్రుతా పోటీలు పడుతున్నాయి.

"కాదు బాబాయ్..."

కృష్ణ గొంతులో గంభీరత ధ్వనించింది.

"అన్నయ్య నా మీద పెట్టిన బాధ్యత సామాన్యమైంది కాదు బాబాయ్...అది పూర్తి చెయ్యాలంటే..."

"ఏమిటా బాధ్యత ?"

ఆ ప్రశ్నలో జిజ్ఞాస కన్పించింది. ఆత్మీయత విన్పించింది.

"కారణ జన్ములైన నాన్నగారు ఏమై పోయారో తెలియదు. అణువణువునా కృష్ణ భక్తినే రంగరించుకున్న అన్నయ్య— రాధికలా — ఆ మాధవుడికోసం విరహంలోనే తన జీవిత గమ్యాన్ని వెతుక్కున్నాడు. ఈ రోజుల్లో అటువంటి భక్తి అరుదు. ఊహాకందనిది. ఎవరికీ అర్థంకానిది. అందుకే అన్నయ్య అందరి దృష్టిలో పిచ్చివాడు—పిరికివాడు—చేతకానివాడు—అల్పాయుష్కుడూ, ఐపోయాడు. తన వల్ల ఎవరికీ—భక్తిపరంగా కూడా ఉపయోగం లేకపోయిందే అని చివర చివర్న ఎంతగా కుమిలిపోయాడో ఎలా చెప్పగలను బాబాయ్. అంతటి భక్తికి వారసుడ్ని చేసిన భగవంతునికి—తన పరంగా—ప్రజలకోసం నిర్దేశించబడిన కార్యం ఏదో వుండే వుంటుందని ఆయన నమ్మకం. దాన్ని తను చెయ్యలేక పోయాననే అన్న బాధ. అసమర్థుడిగా ఊహించుకుని చిన్నపిల్లాడిలా ఏడ్చేసేవాడు. తనలో అంకురించిన భక్తి తనతోనే ఆహుతై పోకూడదనీ—ఎవరూ అర్థం చేసుకోటానికి ప్రయత్నించని భగవంతుని లీలల్ని తెలియ చెప్పలేకపోయాననీ అన్నయ్య అనుభవించిన బాధ ఊహించలేనిది.

ఆయన ఆవేదనను అర్థం చేసుకున్నాను కనుకే—ఆయన్లో అజ్ఞాతంగా మిగిలిపోయిన కోరికను నేను పూర్తి చేద్దామనుకుంటున్నాను."

మెట్ల చాటున రెండు నీడలు బరువుగా కదిలాయి.

"ఏం బాబాయ్... నా నిర్ణయం తప్పంటావా ?—"

శ్రీహరిగారు తడబడ్డారు... తప్పని ఎలా అనగలగాలి ? అలా అని...

"ఏం బాబాయ్—"

"...ఎలా అంటాను నాయనా— ఇంత చిన్న వయసులో— ఇటువంటి భావాలు నాటుకు పోవటం అరుదు. 'నా' అన్న భావాన్ని విస్మరించి కఠోర నియమాన్ని చేపట్టటం అంత తేలికైన విషయం కాదు. మీ అన్నదమ్ముల్లా ఎంతమంది—ఇతరులకోసం సర్వస్వాన్నీ త్యాగం చెయ్యటానికి సిద్ధపడుతున్నారు ? ఎంతమంది కన్నీటినికూడా ఖర్చుపెట్టగలుగుతున్నారు ? నీ దీక్షకు తప్పు పట్టను కృష్ణా. అందులో నువ్వేమిటో ఇప్పుడే అర్థం చేసుకుంటున్నాను. నీ ఆదర్శం తప్పనే ధైర్యం నాకు లేదు, ఐతే— అమ్మవైపు నుంచి కూడా పెద్దరికంతో వకాల్తా పుచ్చుకున్నందుకిలా అడుగుతున్నాను.

కృష్ణా ! నీ దీక్ష వైవాహిక జీవితానికి ప్రతిబంధకమా ? సంసారం సాగిస్తూనే— నీ బాధ్యతను నెరవేర్చలేనంటావా ?— నెరవేర్చ గలవనే ఆశ నాకుంది... మీ నాన్నా— అన్నయ్యల జీవితాలు నిరూపించలేదా ?—"

"... ... ... ... ..."

"చెప్పు కృష్ణా—"

"నాన్నగారితోనూ అన్నయ్యతోనూ, దయచేసి నన్ను పోల్చవద్దు బాబాయ్. వాళ్ళు కారణ జన్ములు. అందుకే బంధాలకుదూరంగా— దైవానికి దగ్గరగా వుండగలిగారు. నేను సామాన్యుణ్ణి. కృషిమీద దైవ భక్తిని అలవర్చు కున్నవాడ్ని. పైగా బాధ్యతని కావాలని చేపట్టిన వాడ్ని... నా శక్తి నాకు తెల్సు బాబాయ్. అందులో సంసార బంధమంటే భయపడు తున్నాను. నన్ను స్వేచ్ఛగా వదిలేస్తే... మరో ఆలోచన లేకుండా— ఎప్పటికైనా వాళ్ళ అడుగు జాడల్లో నడవగలనేమో...—"

ఇంకా పసితనం పోనట్టు కన్పించే కృష్ణలో— అజ్ఞాతంగానే జ్ఞాని కాపురం చేస్తున్నాడు. అందుకే ఏ విధంగా నచ్చచెప్పి— ఏ రకంగా సమాధాన పర్చాలో... ఏమంటే ఏం వినాలో అర్థం కావటంలేదు శ్రీ హరిగార్కి.

తులశమ్మ— తన మాటమీద కొండంత ఆశపెట్టుకుంది. పాపం— ఆవిడ బాధ మటుకు త్రోసివెయ్య దగ్గదా ? కన్నతల్లికి ఆ బాధ

మంగుళూరులో ఇటీవల జరిగిన తెలుగు సమితి సాంస్కృతిక కార్యక్రమంలో ప్రఖ్యాత కూచిపూడి నృత్య కళాకారిణి శ్రీమతి వై. గీతాలక్ష్మణ్‌కు సభాధ్యక్షుడు ప్రొ. హెచ్. పి.సి. శెట్టి మెమెంటో అందజేస్తున్న దృశ్యం.



సహజం. పైగా — ఎదురు దెబ్బలు తిన్నాక— అంత బాధ వుండటంలో కూడా ఆశ్చర్యంలేదు.

కృష్ణని పెళ్ళికి వొప్పిస్తానని ఆవిడకి మాట ఇచ్చాడు. అయితే అదంత సులభమా ? కృష్ణని బలవంతాన వొప్పించటం కష్టం. వొప్పించలేకపోతే — ఆ తల్లి బాధను చూడటం ఇంకా కష్టమైపోతుంది ... మానసికంగా క్షీణించిపోతున్న ఆవిడేమైనా అయిపోతే ?

ఒకవేళ కృష్ణను వొప్పించగలిగినా — దాంపత్య జీవితం కృష్ణ ఆదర్శాలకు గొడ్డలి పెట్టైతే — దాన్ని మటుకు కృష్ణ భరించ గలడా ?

చివరికి దైవంమీద భారం వేశారు శ్రీహరిగారు.

"కృష్ణా ... వాళ్ళిద్దరూ కారణ జన్ములే. అయితే వాళ్ళకన్నా నువ్వే విధంగా తక్కువ ? నువ్వెన్నుకోవాలనుకుంటున్న మార్గం — నువ్వు తీసుకున్న నిర్ణయాలూ ... వారిని మించిన ఉత్తమ స్థాయికి నిన్ను తీసుకువెడతాయనటంలో సందేహం నాకు కన్పించటంలేదు. కారణం చెప్పనా ? నువ్వేరిగిందే అయినా ... వాళ్ళ వాళ్ళ పూర్వజన్మ సుకృతాల్నిబట్టి వాళ్ళు మాత్రమే తరించారు. అంతకన్నా ఉత్తమమైనది — ఎందర్నో తరింపజెయ్యాలనే భావన కలగటం. ఆ భావనతోనే ఈ వయసులో దాంపత్యజీవితాన్ని వ్యతిరేకిస్తున్నావు ... అయితే కృష్ణా .. ఆ దైవ నిర్ణయం ప్రకారం నీకు రాబోయే భార్య— నీకన్ని విధాలా అనుకూలవతి అయితే ? నీ లక్ష్యాన్ని అర్థం చేసుకుని — అన్ని విధాలా నీకు చేదోడు వాదోడుగా వుండే ఉత్తమురాలైతే . . నీకేమిటి అభ్యంతరం ?"

కృష్ణారావు చిన్నగా నవ్వాడు.

అర్థాలు వెతుక్కుంటున్నారు శ్రీహరిగారు

"ఏం కృష్ణా ... "

"నన్నింకా పూర్తిగా అర్థం చేసుకోలేదు బాబాయ్ ... నాలో వివేకానందస్వామి ప్రభావం తీవ్రంగా వుండేది. ఆయనవల్ల ప్రభావితుడ్నైన వాడ్ని ... "

"అంటే — సన్యాసం స్వీకరించాలనుకుంటున్నావా ? అప్పుడే నువ్వు కోరుకున్న దారి నిష్కంటక మౌతుందనుకుంటున్నావా ? లేక ఇంకా ఇతర కారణాలేమైనా వున్నాయా ?"

ఈసారి శ్రీహరిగారి గొంతులో పట్టుదల ధ్వనిస్తోంది.

"వున్నాయి — "

ఇంకా పట్టుదలగా వుంది కృష్ణారావు గొంతు.

"బాబాయ్. ఈ శరీరాన్ని ఒక అమూల్య వస్తువుగా — కేవలం భగవంతుని కోసం నిర్మించబడ్డ దేవాలయంలా భావిస్తున్నాను నేను. ఈ దేవాలయం కళంక రహితమైన పవిత్రస్థలంగా భాసించాలి. నిత్యం దైవ చింతనా, ఆ చింతనలో ఇతరులకూ స్థానం కల్పించాలనే తపనా— పరిశుద్ధమైన అంతరాత్మా, కామ క్రోధ మోహాది వికారాలకు చోటివ్వని దృఢవిశ్వం, నాకు కావాలి.

అప్పుడే నేను పవిత్రంగా భావిస్తున్న ఈ శరీరాన్నీ, ఈశరీరంలో దైవం కాపురమున్నాడన్న నమ్మకాన్నీ నేను కాపాడుకోగలను. నాలో ఆ న మ్మ క మూ స్థి ర త్వ మూ లేకపోతే నా లక్ష్యం నిష్ఫలం ఐపోతుంది. నేను అతి సామాన్యుడ్ని. నిప్పు కాలుతుందని తెలిసీ— దానికి దగ్గరై— దగ్ధమయేకన్నా— ముందే మేలుకుని జీవితాన్ని అర్థవంతం చేసుకోవాలన్నదే నా తపన

దాంపత్య జీవితంలోకి అడుగు పెట్టటమంటూ జరిగితే నేనూహించని బలహీనతలూ— పశువాంఛలూ—నన్నావేశించవచ్చు. నేను విషయ వాంఛలకు బందీనైపోవచ్చు. తప్పించుకోలేని బంధాల్లో చిక్కుకుపోయి— జీవితాంతం రాగ ద్వేషాలతో— సుఖదుఃఖాలతో— జీవితాన్ని నరక ప్రాయం చేసుకున్నా ఆశ్చర్యం వుండదు. బాబాయ్. నా జీవితాన్ని స్వర్గంగా మార్చాలన్నా నరకమయం చేసుకోవాలన్నా ... నా ఇష్టం, కానీ- నా ఇష్టం కోసం— మరొకర్ని నా జీవితంలోకి అయిష్టంగా ఆహ్వానించి— వాళ్ల జీవితంతో ఆడుకునే హక్కు నాకెక్కడుంది?.."

శ్రీ హ రి గా రు రెప్ప వెయ్యకుండా చూస్తున్నారు.

పైకి పట్టుదలగానే వున్నా— సందిగ్ధంతో కొట్టుమిట్టాడుతున్న కృష్ణారావు అంతరంగం లీలగా కన్పిస్తూనే వుంది.

"కృష్ణా. నీ వాదనకి నేనూ వొప్పుకుంటాను. నిజమే. ఈ శరీరాన్ని పవిత్ర దేవాలయంగా భావించాలని నువ్వంటున్నావు, కానీ కృష్ణా ఈ శరీరం తుచ్ఛమైంది. రక్తమాంసాలతో— చర్మపు తొడుగులతో— అమర్చబడిన తోలుతిత్తి. దీని కెటువంటి ప్రాధాన్యతనూ ఇవ్వకపోతేనేం ? నువ్వనుకున్నట్టుగా ఈ తోలుతిత్తిని దేవాలయమనే ఎందుకనుకోవాలి ? గుప్పెడు బూడిదగా మిగిలే— ఈ బొంది కెందుకంత పవిత్రతను ఆపాదింపజెయ్యాలి ? ఎంతో పవిత్రమైనదీ— భగవత్స్వరూపమైనదీ— పునీత దృష్టితో చూడదగ్గదీ ఒక్క ఆత్మనే. ఆత్మ పరిశుద్ధమైనప్పుడు— ఆత్మలో— ఆధ్యాత్మిక భావాలు దైవత్వాన్ని మరింతగా పెంచినప్పుడు— అశాశ్వతమైన శరీరాన్ని దైవ మందిరంగా భావించటం సముచిత మౌతుందా ? అది అందమైన ఆత్మవంచన కాదా ?—"

కృష్ణారావునుంచి సరైన సమాధానాన్ని ఆశిస్తూ చూశారాయన.

కృష్ణారావు చిన్నగా నవ్వుకున్నాడు.

"మీరిలా అడుగుతారని నాకు తెల్సు బాబాయ్. సమాధానంకూడా మీకు తెలియనిదేం కాదు. ఐతే నానుంచికూడా వినాలని మీ కోరిక."

"ఔనా !!!—" అన్నట్టుంది అతని చూపు.

శ్రీహరిగారు అర్థవంతంగా నవ్వారు.

"...నేను అవునన్నా కాదన్నా మీ వాదనా యదార్థమే. దానికి నాలాంటి వాడి వొప్పుకోలు అనవసరం. ఇంత మెచ్చుకోలు... అంతటి వాడ్ని కాను. ఐతే బాబాయ్ — ఈ శరీరం బుద్బుదమనీ — అతి తుచ్ఛమూ హేయమైందనీ, పండితులనుంచీ పామరులదాకా అంగీకరించే పచ్చినిజం.

ఈ క్షణం మరుగున పడిపోతుంది. మరో క్షణంలో అవాంఛనీయమైంది జరుగుతే ఆకృతే మారిపోతుంది. కాలక్రమాణ జీర్ణించిపోయి — ఈ తుచ్ఛ శరీరం క్షణ క్షణానికీ పొందే మార్పు అతి దారుణం. అత్యంత భయంకరం. ఆత్మ వేరైన మరుక్షణంలోనే పనికిమాలిన కట్టెగా రూపులు దిద్దుకునే ఈ శరీరంమీద మమకారాన్ని పెంచుకోటం అవివేకమని తెల్సినా — ఆ మమకారమే స్థిరమైపోతోంది. ఎలాగూ నశించిపోయేదేనని — ఐహిక వాంఛలకూ — క్షణిక



సుఖాలకూ — జిహ్వా చాపల్యాలకూ లొంగిపోయి—
ఆత్మశాంతిలేని భయంకర పోరాటంలో —

విశ్రాంతే ఎరుగని జీవన సంగ్రామంలో —

రోగాలతో—రొష్టులతో — అనారోగ్యంతో ఏ గమ్యం తప్పిన జీవితాల్లో, చివరికి మిగిలే దేముంటుంది ?

తనకోసమంటూనైనా మిగుల్చుకునేదేముంటుంది ?

అనారోగ్యకరమైన ఆలోచనల్తో, పాపాల పుట్టలాంటి శరీరంతో — మిగుల్చుకునే మృత్యు నీడలో - ఆధ్యాత్మికత ఎలా మొలకెత్తుతుంది? మొలకెత్తినా — అది మహావృక్షం కావటం —

అది ఫలప్రదమై పదిమందికి ఉపయోగపడటం సాధ్యమా ?

అలా సాధ్యం కాని రోజున ఈ బ్రతుక్కు అర్థమేమిటి బాబాయ్ !!!

బ్రతికే కొద్ది కాలాన్నీ ఇతర వ్యాపకాలు — వ్యామోహాలూ నాశనం చేస్తుంటే — మనం ప్రయోజనంకోసం మిగుల్చుకునే కాలమెంత ?

బాబాయ్ !!! -

దేవాలయాల్లో మనం పాపాలు చెయ్యటానికి భయపడతాం - దైవ సన్నిధిలో — అన్నివిధాలా పరిశుభ్రతనే పాటిస్తాం.

దైవం నివసించే చోటు ఇదనుకొని— అక్కడ పవిత్రతను నెలకొల్పటానికి అన్ని విధాలా ప్రయత్నిస్తాం.

కాదా ? అటువంటి న్యాయాన్నే ఈ శరీరానికీ వర్తింపజేసి — తాత్కాలికంగా దేవాలయమనుకుంటే తప్పేముంది ? ఈ శరీరంలో దైవమున్నాడనుకుని మనసా—వాచా— ఆరాధనతో — పవిత్రంగా మిగిలిపోతే — నష్టమేముంది ? పోనీ ప్రతీ ఆత్మా దైవ స్వరూపమైనప్పుడు అది నివసించే శరీరం దేవాలయం కాకపోతుందా ? కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలవంటి దుర్గంధ భూయిష్టమైన

# కర్మయోగి

చెత్తా చెదారాలను — శరీరమనే దేవాలయానికీ— అందులో నివసించే ఆత్మ అనబడే భగవానునికీ— అతి దూరంగా నెట్టివేయటం కాని పనౌతుందా బాబాయ్ !!!''

శ్రీహరిగారు విస్మయంగా — రెప్పవాల్చటం మర్చిపోయి, తనకూ కృష్ణకూ మధ్యనున్న వయసు తేడానే మర్చిపోయి, ఆరాధనో — అనురాగమో .. ప్రేమో — వాత్సల్యమో, భక్తో — భయమో — కలగా పులగంగా ముట్టు ముడుతుంటే — తను పసివాడనుకున్న కృష్ణ ఇంతవాడా ? ఇంతటి వాడయ్యాడా ? ఈ ఆలోచన ఆయన్ని అప్రతిభుడ్ని చేస్తోంది.

అయినా వయసు తెచ్చిన బాధ్యత వెన్ను తడుతూనే వుంది.

''నీ మనసూ—ఆలోచనలూ—నా వయసుకు పదిరెట్లుగా కనపడుతున్నాయి. అయితే కృష్ణా ఒక్కమాట. సంసార లంపటంలో చిక్కదల్చుకోలేదని నిక్కచ్చిగా చెప్తున్నావు. అయితే ... ఏ బలహీన క్షణం . . నిన్నెటువంటి బలహీనతకూ లొంగదియ్యదనే నమ్మకం నీకుందా ? నీ మీద నమ్మకం లేక ఈ ప్రశ్న వెయ్యటం లేదు ... నీ వయసునుబట్టి ... ''

కృష్ణారావు నవ్వు విచిత్రంగా విన్పించింది.

నిశ్చలంగావున్న కృష్ణ పెదాలు మధురంగా విచ్చుకున్నాయి.

''తదేవ రమ్యం రుచిరం నవం నవమ్.
తదేవ శశ్వన్మనసో మహోత్సవమ్
తదేవ శోకార్ణవ శోషణం నృణామ్.
యదుత్తమం ముక్తయశోను గీతయే॥''

తరచుగా వీరరాఘవయ్య నోట మధురంగా విన్పించే భాగవత శ్లోకమిది. ఈనాడు కృష్ణ నుంచి మృదుమధురంగా విన్పించింది.

అర్థం తెల్సినా — తెలుసూనే వున్నా వీరరాఘవయ్య కావాలని విడమర్చి మరీ చెప్పేవాడు తనకి.

అది అతని తృప్తి.

అతని తృప్తిని తృప్తిగా చూడటం తనకు తృప్తి.

''ఆ భగవంతుని యశోగానమూ, మనోహరమైన నవరుచులతో నొప్పారు నద్వైయ డి దానికదే సాటి అయినప్పుడు ...

హరీ !!!

నిత్యం భక్తి రసపానానికే అలవాటుపడ్డ భక్తుడు ...

అతి నీచమూ హేయమూ అయిన కామము వంక కన్నెత్తి చూడగలడా ? అతని దృష్టిలో కామం తుచ్ఛమైంది కాదా ? — నిజమైన భక్తుడు దానిని తరిమి వెయ్యకుండా వుండగలడా ? —

మరి నాకు నిర్బంధనలేమిటి శ్రీహరీ ?— ఈ ఆంక్షలన్నీ ఎందుకురా హరీ?'' కళ్ళనీళ్ళు పెట్టుకునేవాడు వీరరాఘవయ్య.

ఇన్నాళ్ళకి ఆయన రూపం—ఈ ప్రతిరూపంలో అజ్ఞాతంగా వుండి వెలికి వచ్చినట్టు కన్పిస్తోంది

తనకు జరిగిందనుకుంటున్న అన్యాయాన్ని తన కొడుకుమీద బలవంతంగా రుద్దటాని అన్యాయమని హెచ్చరిస్తున్నట్టు కూడా వుంది.

''బాబాయ్...''

శ్రీహరి గారి కళ్ళల్లో తేమ కన్పించింది.

''చాలా రాత్రయింది...''

కృష్ణ పక్క సర్దుతుంటే బరువుగా కళ్ళు మూసుకున్నారు శ్రీహరి గారు.

'రేపు కూడా వుండాలి...వుండి...వుండేం సాధించాలి ... !!!''

ఆ రాత్రి చాలా తొందరగా తెల్లవారి పోయింది.

[ఇంకా వుంది]






# వినాయక దామోదర్ సావర్కార్ అస్తమయం



వినాయక దామోదర్ సావర్కార్ ఫిబ్రవరి 26 వ తేదీ బొంబాయిలో తమ 84 వ ఏట మరణించారు. వీరి మరణంతో, భారత స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న ఒక తరం వారి సంఖ్య మరింత క్షీణించింది. 1863లో నాసిక్ జిల్లాలోని భాగూర్ గ్రామంలో జన్మించిన సావర్కార్ చిన్నప్పటినుంచీ రాజకీయాలలో ఆసక్తి చూపించారు. చపేకర్, లోకమాన్య బాలగంగాధర్ తిలక్‌లు వారిని బాగా ఆకర్షించారు. స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నవారిని అప్పటి అధికార వర్గాలు దండించటంలో ఆశ్చర్యంలేదు. సావర్కార్ డిగ్రీ విషయంలో కూడా చాలా యిబ్బంది కలిగించారు . కాని ఆయన ఎలాగో ఇంగ్లండులో చదువుకునే అవకాశం కల్గించుకుని, అక్కడ 'ఫ్రీ ఇండియా సొసైటీ' స్థాపించారు. 1910లో ఆయనని ఎరెస్టు చేశారు. ఆయన సాహసంతో తప్పించుకుని మార్సెయిల్స్‌లో దిగటం, అక్కడ దురదృష్టవశాత్తు పట్టుబడటం అందరికీ తెలిసిన విషయాలే.

సావర్కార్‌కి ఆ తర్వాత 50 సంవత్సరాల కారాగారవాసం శిక్షగా విధించారు. కారాగృహంలో ఆయన చాలా కష్టాలు అనుభవించారు. 1924లో సావర్కార్‌ని రత్నగిరికి పంపించారు రాజకీయాలలో పాల్గొనరాదనే నిబంధన పెట్టారు. ఆయన తదనుగుణంగా తన దృష్టిని సాంఘిక సమస్యలపయికి మరల్చారు. హైందవ సమాజంలో అసహ్యం కలిగించే అంశాల నన్నింటిని ఖండించారు. హరిజనుల ఉద్ధరణకి కృషి చేశారు. 1937లో కాంగ్రెస్ పదవిలోకి వచ్చింది. సావర్కార్‌ని విడుదల చేయించింది. 1940లో శ్రీ సావర్కార్, నేతాజీ సుభాష్ చంద్రబోస్‌లు మిలటరీ విప్లవం తీసుకురావటానికి పథకాలు వేశారు.

శాంతియుతంగా స్వాతంత్ర్యోద్యమాన్ని సాగించి యుద్ధానంతరం బలహీనమయిన బ్రిటిషువారి సహాయంతో దేశాన్ని విడుదల చేసుకున్న కాంగ్రెస్ పక్షంలో ఎటువంటి రాజకీయవాదికయినా స్థానం లభించేది; హిందూ మహాసభ అధ్యక్షుడుగా ఎన్నిక అయిన శ్రీ సావర్కార్ కూడా కావాలనుకుంటే కాంగ్రెస్‌లో చేరి ఉండవచ్చునేమో ! కాని ఆయన ఆ మార్గాన్ని అనుసరించ లేదు. హైందవ సమాజాన్ని 'లోపలనుండి' సంస్కరించాలనీ, భారత రాజ్యాంగంలో హైందవ మతానికి ప్రాధాన్యం ఉంటేనే, ఇటువంటి సంస్కరణ వీలవుతుందని సావర్కార్ 'రాజకీయాలని' బలపరచేవారు వాదిస్తారు. ఇటువంటివారికి నేడు అమలులో ఉన్న 'సెకులర్ స్టేట్'లో ఏ స్థానం ఉండగలదు ? ప్రజాదరణతో ఎన్నిక అయిన కాంగ్రెస్‌పార్టీ అధికారాన్ని స్వీకరించి హైందవ సమాజంలో శాసనసభల ద్వారా చాలా అభివృద్ధి సాధించగలిగింది. సంఘ సంస్కరణ ప్రభుత్వాలు కాక వ్యక్తులే సాధించాలనే వారు లేకపోలేదు. స్వాతంత్ర్యం ముందు గాంధీగారి నాయకత్వం క్రింద ప్రజలలో కలిగిన చైతన్యం నేటి ప్రభుత్వం సాధించినదాని కన్నా, ఒకవిధంగా చూస్తే, అధికమే అనిపిస్తుంది.

శ్రీ సావర్కార్ తమ వీలునామాలో, తమ దహనక్రియల విషయంలో, మరణానికి సంబంధించిన ఇతర వివరాల విషయంలో కొన్ని సూచనలు చేశారట. ఇది వారి విశాల దృక్పథాన్ని తెలుపుతుంది. కాని భారతదేశం శతాబ్దాలుగా మహమ్మదీయ పరిపాలన కింద ఉండినదనే సంగతిని ఆవేశం లేకుండా పరిశీలించనివారు మన అభిమానానికీ, గౌరవానికీ, ప్రేమకీ ఎంత పాత్రులయినప్పటికీ ఆధునిక, సాంకేతిక సమాజాలలో ఎటువంటి నిర్మాణాత్మక పాత్ర వహించగలరనే ప్రశ్నని మనకి మనమే వేసుకొనటం అవసరం.

— ఒక విలేఖరి

ఆంధ్ర పచిత్ర వారపత్రిక
**1966 మార్చి 11**
పంచిత మంచి

# అమ్మే కావాలి

జ్యోత్స్న



"కాయ్ రాజా కాయ్! పావలాకి అర్ధ! అర్ధకి రూపాయ్! రూపాయికి రెండు! అయిదుకి పది! కాయ్ రాజా కాయ్! అదృష్టాన్ని పరీక్షించుకోండి!"

"రండమ్మా రండి! రండి బాబూ రండి సజ్జ సరుకు! ఫ్రెష్, రేటుకూడా తక్కువ, కె.జీ రెండురూపాయలే! కేజీ రెండ్రూపాయల్! రెండ్రూపాయల్! రెండ్రూపా. ..."

"లేదమ్మా కిట్టదు! పది రూపాయలకు ఒక్క పైసా తగ్గదు"

"అయిదు రూపాయలకైతే యిచ్చేయ్!"

"లేదమ్మా! కిట్టదని చెపుతున్నానుగా!"

"పోనీ ఆరు చేసుకుంటావా?"

"ఏడిచ్చి పట్టుకెళ్ళండి!"

"ఒసేవ్ రాణి! ఆ చీర చాలా బాగుంది కదే?"

"అబ్బా! మరీ అంత ముదురు రంగా? పోతుందేమోనే?"

"ఎంతో అడిగి చూద్దాంవేంటి?"

"కా కి నా డ కా జా లో య్! కాకినాడ కాజాలోయ్! .."

"నాన్నా! కాజాలు కొనవూ?"

అక్కడున్న వారందరూ నిశ్శబ్దాన్ని చెరచడమే పనిగా పెట్టుకున్నారు.

అరుపులు! కేకలు!! వ్యాపారప్రకటనలు!!

గోల! గోల!! సంతగోల!!

అవును సంతగోల!

అటు పట్టణానికి, ఇటు పల్లెకీ మధ్యస్తంగా వుండే ఆ వూళ్ళో ప్రతి మంగళవారం జరుగుతున్నట్లే, ఆ మంగళవారమూ సంత జరుగుతోంది.

నానా రణగొణ ధ్వని 'పని కట్టుకొని నిశ్శబ్దాన్ని చెరుస్తోంది!

అమ్మేవాళ్ళూ, కొనేవాళ్ళూ,

అమ్మే వాళ్ళనీ కొనే వాళ్ళనీ వూరికే చూసి పోయే వాళ్ళు!

ఆడపిల్లల వెంట పనిగట్టుకొని నడుస్తున్న ఏ పనీ లేని అబ్బాయిలూ—

నిజంగా సంత—సంతలా వుంది!

ఆ సంతలో—

ఆ చప్పుళ్ళను చీల్చుకుంటూ

అశాంతిని చెదరగొడుతూ

శాంతి దేవతలా

నిశ్శబ్దతరంగంలా

నెమ్మదిగా నడుస్తోంది రాజేశ్వరి!

నల్ల కలువపూలు కుప్పగా పోసి

అక్కడక్కడా తెల్ల కలువరేకలు అద్ది అలంకరించినట్లు ఇరవై అయిదేళ్ళ యవ్వనాన్ని ఓ తెల్ల చీరలో చుట్టుకుని నిశ్శబ్దంగా నడుస్తోంది రాజేశ్వరి!

ఓ చేతిలో సంచి, సంచి నిండా సామాన్లు, ఇంకో చేతి చిటికిన వేలు పట్టుకుని అమ్మతో పాటు నడుస్తున్న అయిదేళ్ళ పాప గౌరి!

ఎవరెవరు ఏమేం సామాన్లు చెప్పారో, అన్నీ కొన్నదో లేదోనని, గుర్తు చేసుకుంటూ నడుస్తోంది రాజేశ్వరి!

పువ్వుల గౌనుతో రబ్బరు బొమ్మలా దుబ్బుగా మెరిసిపోతూ, దారికిరువైపులా వున్న దుకాణాల్ని, మెరిసే కళ్ళతో ఆసక్తిగా చూస్తూ తల్లి చెయ్యిపట్టుకుని నడుస్తోంది పాప గౌరి!

"పాపం.! అడవి కాచిన వెన్నెల!"

తన ప్రక్కనుండి పోతున్న ఇద్దరు జులపాల జుత్తు అబ్బాయిల్లో ఒకడు విసిరిన కామెంటుకి వెనుదిరిగి చూసింది రాజేశ్వరి.

మాట విసిరిన మనిషి వెనుదిరిగి చూడకుండా పోతున్నాడు.

రాజేశ్వరి యవ్వనం యిపుడు అడవికాచిన వెన్నెలే! కానీ, అయిదేళ్ళ క్రితం మాత్రం, అది 'నాగులుగాడి' కోసం కాచిన వెన్నెల!

నాగులుగాడు ఆ వూళ్ళో చిన్న సైజు రౌడీ!

రాజేశ్వరి నాగులిగాడి ఇల్లాలు!

రెండేళ్ళ క్రితం ఓ రాత్రి —

రెండో ఆట సినిమా చూసి, తనూ, పాప ముందు నడుస్తోంటే, చిన్న పనివుందని నాగులుగాడు కొంత వెనకబడి వస్తోంటే —

రాత్రులు ఊరిని దొంగలబారినుండి కాపలా కాస్తోన్న ఇద్దరు పోలీసులు, వెన్నెల్లో రాజేశ్వరి అందాన్ని చూసి ఆమె యవ్వనాన్ని కొల్లగొట్టా లనుకున్నారు.

ఒకడు రెండు చేతుల్నీ వెనక్కి విరిచి పట్టుకుంటే — రెండోవాడు ఆమె ఎత్తు గుండెల మెత్తదనాన్ని ... ప్రయత్నం చెయ్యసాగాడు!

ఇంతలో వెనుకబడిన నాగులుగాడు అక్కడ వూడిపడ్డాడు.

సహజంగా రౌడీలకు పోలీసుల్ని చూస్తే కలిగే భయం వాడికి అపుడు కలగలేదు.

తన యిల్లాలి చేతులు వెనక్కి విరిచి పట్టుకున్న వాడి చేతులు విరగ్గొట్టి— తన భార్య గుండెలమీద చెయ్యేసిన దుర్మార్గుడి గుండెలు చీల్చేశాడు.

తరువాత ? —

సహజంగా కేసులనేది, పోలీసుల యిష్ట ప్రకారం బనాయించబడతాయని నిరూపిస్తూ నాగులిగాడిమీద ఓ కేసు బనాయించారు.

నాగులుగాడు దొంగసొమ్ముతో పారిపోతుంటే, ఇద్దరు పోలీసులు వెంటబడ్డారు. వెంటబడిన పోలీసులకీ నాగులిగాడికీ మధ్య చాలా తీవ్రంగా కొట్లాట జరిగింది. నాగులుగాడు, చాలా క్రూరంగా, దారుణంగా, అమానుషంగా ఒక పోలీసుని చంపేశాడు.

న్యాయ విచారణా! ఐపీసీ సెక్షన్లూ! నాగులిగాడికి కొన్ని సంవత్సరాల జైలుశిక్ష!

ప్రస్తుతం నాగులుగాడు జైల్లో వుండ బట్టి, ఊళ్ళో పదిళ్ళలో 'పనిమనిషి'గా బతుకుతున్న రాజేశ్వరి యవ్వనం అడవికాచిన వెన్నలే మరి!

"ఆఁ! గుర్తొచ్చింది! రమణమ్మగార్కి 'సవరం' కొనాలి!" మరచిపోయిన వస్తువొకటి గుర్తొచ్చింది రాజేశ్వరికి.

టార్పాలిన్ టెంట్స్‌తో అమర్చిన ఫాన్సీ షాపు వైపు నడిచింది. సవరాలడిగి చూస్తోంది.

## ఆత్మీయత

కాపరానికి వచ్చిన కొత్తల్లో
నా భార్యతో మాట్లాడేవాణ్ణి
కళ్లతో.
ఆమె నాతో మాట్లాడేది
సైగలతో.
తర్వాత మాట్లాడుకున్నాం
నోటి మాటలతో.

అలా మాట్లాడి మాట్లాడి
అలసి సొలసి, విసిగి వేసారి
ఒళ్లు కరిగి, ఓపిక తరిగి
తల నెరిసి, అనుభవం విరిసిన
ఈ వయస్సులో మాట్లాడుకుంటున్నాం
మనస్సులతో!

అప్పటి మాటలు మాటలకోసమైతే
ఇప్పటి మాటల్లో ఎంత ఆత్మీయత!

— చల్లా రాధాకృష్ణశర్మ

షాపులోని రకరకాల వస్తువుల్నీ, రంగు రంగుల బొమ్మల్నీ మెరిసే కళ్ళతో చూస్తోంది పాప.

సవరాల్లోంచి ఓ సవరం ఎంచుకుని బేరమాడసాగింది రాజేశ్వరి.

షాపంతా పరిశీలనగా చూస్తున్న పాప దృష్టి ఓ చోట ఆగిపోయింది!

"అబ్బ! ఎంత బాగుందో ఆ బొమ్మ!!" ధనవంతుల కార్లలో జుత్తుకి తాడుకట్టి వేలాడదీసుకునే ఓ చక్కటి బొమ్మను చూసి అనుకుంది పాప.

చాలా పెద్దదికూడాను! "అమ్మా! ఆ బొమ్మ కొనే!" అంది. అమ్మ చెయ్యిపట్టి గుంజుతూ.

సవరాల బేరంలోపడిన రాజేశ్వరి, పాపను పట్టించుకోలేదు. పాప మళ్ళీ రాజేశ్వరి చెయ్యి పట్టిలాగి "అమ్మా! ఆ బొమ్మ కావాలే!" అంది యింకొంచెం గట్టిగా.

సవరం బేరం కుదిరింది. డబ్బిచ్చి తీసుకుంది. పాప చెయ్యి పట్టుకుని ముందుకు నడవబోయింది రాజేశ్వరి.

పాప నిల్చున్న చోటి నుండి కదల్లేదు. ఏవిటన్నట్టు పాపవైపు చూసింది రాజేశ్వరి.

"ఆ బొమ్మ కావాలి!" చేత్తో అందమైన బొమ్మను చూపిస్తూ అంది పాప.

ఆ బొమ్మను చూస్తూనే తనలాంటి వాళ్ళు కొనుక్కోగలిగే బొమ్మ కాదని గ్రహించింది. "ఇంటి దగ్గర బోల్డున్నాయిగా, తరువాత చిన్నదింకోటి కొనిపెడతాన్లే!" అంటూ పాపను పట్టుకుని ముందుకి నడవబోయింది.

"అబ్బా! నాకిదే కావాలి!" ఏడుపు ప్రారంభించింది పాప. పాపను బలవంతంగా షాపునుండి లాక్కుపోసాగింది రాజేశ్వరి.

పాప ఏడుపు పెద్దదిచేస్తూ నడవకుండా మారాం చెయ్యసాగింది. ఎక్కడ పడితే అక్కడ ఆగిపోయి తల్లివెంట నడవకుండా ఏడవసాగింది బొమ్మకావాలంటూ;

వెనకబడి ఆగిపోతున్న పాపకు రెండు తగిలించి ఈడ్చుకుపోయింది రాజేశ్వరి.

* * *

"దండాలయ్యా! బాబయ్యా!"

"దండాలు! దండాలు!"

"నమస్కారమండీ మాధవరావుగారూ!"

"నమస్కారం! నమస్కారం!"

నమస్కార బాణాల్ని ఎదుర్కొంటూ ఆ సంతలోంచి నడుస్తున్నారు మాధవరావుగారు.

జమీలు పోయినా యింకా జమిందారుగా మిగిలిన చాలా మందిలో మాధవరావుగారొకరు. ఆ ఊళ్ళో అందరికీ 'పెద్దమనిషి'. గౌరవనీయులు.

"నమస్కారమండోయ్ మాధవరావు గారూ! ఎవరీ పాప?" ఎదురుపడుతూ అడిగా



# డాక్టర్ సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

## జి. కె. — రాయదుర్గం

మా అబ్బాయి వయస్సు 2½ సంవత్సరములు. సంవత్సరం క్రితం చెవి ప్రక్కన గ్లాండ్స్ వచ్చాయి. డాక్టర్ దగ్గర చూపించాము. ఎక్సరే తీసి టి. బి గ్లాండ్స్ కావన్నారు. మందులు వాడాము. అప్పుడు తగ్గాయి. కాని విపరీతంగా జలుబు చేసినపుడు మళ్ళీ కనపడతాయి. ఆ సమయంలో పిల్లాడు చాలా నీరసంగా కనిపిస్తాడు. తగ్గితే మళ్ళీ మామూలుగానే వుంటాడు.

★ గొంతు భాగాన్ని, ముక్కు భాగాన్ని, ఎ. ఎన్. టి. వైద్యులచేత పరీక్ష చేయించండి. అడినాయిడ్స్ గాని. టాన్సిల్స్ గాని వాచినప్పుడు ఇలా మెడమీద లింఫ్ గ్రంథులువాచే అవకాశం ఉంటుంది. టాన్సిల్స్ అడపాదడపా వాస్తున్నప్పుడు వాటిని శస్త్ర చికిత్సద్వారా తీసివేయటం మంచిది.

## పి జె. కె. — పులివెందుల

మాకు వివాహమై 9 సంవత్సరములు అయినది. వివాహమైన ఏడవ సంవత్సరం బాబు పుట్టాడు. పుట్టిన నెలకే కాలుకు కీలులోపల చీముకూడినది. అది ఆపరేషన్ చేశారు. అప్పుడు మరణించాడు. ఆ తరువాత మాకు పిల్లలు కలుగలేదు.

★ మీరు నిపుణులైన లేడీ డాక్టర్ల దగ్గరకు వెళ్ళి పరీక్ష చేయించుకోవటం అవసరం. గర్భ సంచీలోగాని, ఫెలోపియన్ ట్యూబులలో గాని అవరోధం ఏర్పడినా, మార్పులు వచ్చినా ఇలా జరిగే అవకాశం ఉంటుంది.

మీ బాబుకి సెప్టిక్ ఆర్త్రైటిస్ అనే రోగం వచ్చి, సెప్టిసీమియా వల్ల (రక్తంలో సూక్ష్మక్రిములు ఎక్కువ అవటం) మరణించి ఉంటాడు.

## కె. ఆర్. ఆర్. — రాజమండ్రి

ఇప్పుడు నాలుగు నెలలు బాలింతరాలిని. కాపర్ టి లూప్ వేయించుకొందామని అనుకొంటున్నాను. ఎప్పుడు వేసుకోవాలి? బహిష్టు అవకుండా పిల్లలు పుట్టే అవకాశం ఉందా?

★ బహిస్టు అయిన అయిదవ రోజునుంచి ఎప్పుడైనా లూప్ వేయించుకోవచ్చును.

పిల్లలు పుట్టినతర్వాత మళ్లీ బహిస్టు అవకుండానే మళ్ళీ గర్భధారణకి అవకాశం ఉంటుంది.

## కె.ఎస్.ఆర్. — భీమవరం

నాకు 17 సం॥ లయినా నత్తి తగ్గలేదు మీరు చెప్పిన ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్ అండ్ హియరింగ్ మైసూరులో ఎక్కడ ఉన్నదీ అడ్రసు తెలియజేయండి.

ఆ అడ్రసు క్రింద సూచిస్తున్నాను.

★ ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్ అండ్ హియరింగ్, మానస గంగోత్రి, మైసూరు, కర్నాటక రాష్ట్రం.

## ఎం. ఎల్. ఎల్. — మద్రాసు

సిఫిలిస్ అనే రోగం ఎందువల్ల వస్తుంది. లైంగిక కలయిక కాకుండా ఇతర మార్గాల ద్వారా వస్తుందా ?

★ సిఫిలిస్ అనేది ట్రిపోనీమా పాలిడం అనే క్రిమివల్ల వస్తుంది. ఈ క్రిమి మామూలుగా లైంగిక కలయిక ద్వారా వస్తుంది. వేళ్ళకి దెబ్బలు తగిలిగాని, ఇతర త్రాగాని పగుళ్ళు ఉండి, రోగగ్రస్తమైన భాగాన్ని ఆ వేళ్ళతో తాకినప్పుడు ఈ క్రిములు సంక్రమించే అవకాశం ఉంటుంది.



డింకో పెద్దమనిషి, మాధవరావుగారి చెయ్యి పట్టుకుని ఏడుస్తున్న 'గౌరి'ని చూసి.

"ఎవరి పాపోనండీ! తప్పిపోయి ఏడుస్తోంది. మన యింటికి తీసుకుపోయి, ఊళ్ళో తెలియజేస్తే వచ్చి తీసుకుపోతారని యింటికి తీసుకెళ్తున్నా" జవాబిచ్చారు మాధవరావుగారు.

"ఓహో ! అలాగా !" అంటూ ముందుకి సాగిపోయాడు ఆ పెద్దమనిషి.

"ఊరుకో పాపా ! నీకేం భయం లేదు ! నేనున్నానుగా !" అంటూ రెండువైపులా వున్న షాపుల్ని అందులోని బొమ్మల్ని చూపిస్తూ 'చూశావా ? అవెంత బావున్నాయో ! యివెంత బావున్నాయో' అంటూ పాపను మాటల్తో మరపించి ఏడుపు మాన్పించాలని ప్రయత్నిస్తున్నారు మాధవరావుగారు.

అయినా పాప ఏడుపు మానలేదు సరికదా

## అమ్మే కావాలి

యింకా తీవ్రస్థాయిలో ఏడుస్తూ అతనివెంట నడవసాగింది.

నడచి నడచి మాధవరావుగారు ఓ ఫాన్సీ షాపు ముందు ఆగారు. అక్కడున్న అన్ని వస్తువుల్నీ పాపకు చూపిస్తూ, "చూశావా ఎంత బావున్నాయో... ఏంవోయ్ ! ఆ పెద్ద బొమ్మ అందుకోవోయ్ !" అంటూ పాప,

> **అంకితం**
>
> నిజంగా 'అమ్మ' లేకపోవడం, తల్లి ప్రేమలో బ్రతకలేకపోవడం ఎంత దౌర్భాగ్యం !! అందుకే — అలాంటి, నాలాంటి దౌర్భాగ్యులకి ...
>
> — జ్యోత్స్న

ముందు కావాలనుకుని మారాంచేసి తల్లిని వేదించిన, ధనవంతులు కార్లలో పురి తీసుకునే బొమ్మను చూపించారు.

షాపువాడు ఆ బొమ్మను మాధవరావుగారికి అందించాడు.

"ఏమ్మా ! పాపా ! చూశావా ఈ బొమ్మ ఎంత బాగుందో ? ఈ బొమ్మ కావాలా నీకు ?" అన్నారు మాధవరావుగారు.

"నాకీ బొమ్మొద్దు... ఏంవొద్దు... అమ్మే కావాలీ..." అంటూ యింకా గట్టిగా ఏడ్వసాగింది పాప.

"అమ్మా ! గౌరీ !" తప్పిపోయిన పాప కోసం సంతంలా వెదుకుతున్న రాజేశ్వరి మాధవరావుగారి చెంతనున్న పాపను చూసి ఆనందంతో కేకేసింది.

తల్లి పిలుపు వినగానే మాధవరావుగారి చేతిలోంచి బలవంతంగా తన చేతిని లాక్కుని తల్లివైపు పరుగెత్తింది పాప !



# మారేడు దళం

జొన్నలగడ్డ లలితాదేవి

సీరియల్



**16**

( గతసంచిక తరువాయి )

సముద్రం హోరు మంటోంది. చిక్కని చీకటిని చీల్చుకుంటూ రంయ్‌ని దూసుకు పోతోంది లాంచీ.

అందులో సమత, అమలేశ్వర్ భయం భయంగా కూర్చుని వున్నారు. వాళ్ళ దగ్గర బంగారపు బిస్కట్లు, వాచీలు— ఇంకా ఏవేవో వున్నాయి.

వాళ్ళ దగ్గర అవి వున్నాయని కస్టమ్స్ అధికారులు పసిగట్టారు. వెంటాడుతున్నారు.

ఆ సంగతి గ్రహించి గజగజా వణికి పోతోంది సమత.

వద్దు వద్దంటే విన్నాడు కాదు. ముక్కూ ముఖం తెలియని వ్యక్తితో చేయి కలిపాడు.

అతనేమయిపోతాడు అని తను హడలిపోతూ అతన్ని అంటిపెట్టుకునే వుంది. ఆ లాంచి అనుకున్న స్థావరానికి చేరితే బాగానే వుండేది. కాని దురదృష్టం ఎక్కడ వెన్నంటి వుందోగాని ఆదిలోనే హంసపాదులా అయిపోయింది బతుకు.

ఇంకా తీరం చేరనేలేదు, గన్ పేల్చిన శబ్దం అయింది. ఆ మోతకు గజగజా వణికి పోయాడు అమలేశ్వర్.

"ఎందుకు బావా ! పట్టుబడితే పరువు తక్కువ. జైలు— జరిమానాలు— ఎందుకొచ్చిన అల్లరి, అవి ఆ సముద్రంలోకి గిరాటు వెయ్యి. పోతే పోతాయి" అంది.

ఈ స్మగ్లింగ్‌లో ఏపాటి ఓనమాలు రాని ఏ మెళకువలు తెలియని అమలేశ్వర్ తన దగ్గర వున్న మొత్తం అన్నీ సముద్రంలోకి గిరాటు వేశాడు అలా వేస్తుంటే అతని కళ్ళంబడి గిర్రున నీళ్ళుతిరిగాయి. తన దగ్గర—సమత దగ్గర దాచిన డబ్బంతా చివరకు ఈ విధంగా సముద్రం పాలై పోయింది.

"సమతా ! నువ్వు విజయవాడపో ! నేను కూడా ఆ వస్తువులతోపాటే సముద్రగర్భంలో కలిసిపోతాను" అన్నాడు రుద్ధకంఠంతో.

ఆ స్థితిలో బావని చూసేసరికి ఆ అపార పారావారం అంతగా ఆర్ద్రమైపోయింది సమత హృదయం. జాలి సముద్ర కెరటాల్లా పొంగుకు వచ్చింది. తన గుండెలకు హత్తుకుని ఓదార్చాలని పించింది.

"ఛా ! ఏం మాటలు బావా అవి. పోతే పోయిందిలే. అసలా పాపిష్ఠి డబ్బు పోవడమే మంచిది."

"అదేం అలా అంటున్నావు"

"అవును మరి— ఆ డబ్బు ఎలా వచ్చింది? కొంత తప్ప మిగిలిందంతా బెదిరించి గుంజిందేగా. ఎందుకొచ్చిన పాపిష్ఠి డబ్బు అది ?" అంది.

అమలేశ్వర్ మాట్లాడలేదు.

"మరి మనం బెజవాడపోయేదెట్లా ?"

"రైలు మీద."

"టిక్కట్లకి డబ్బేది ?"

"నా దగ్గర వుందిలే. ముందిక్కడినించి బయటపడనీ."

ఆ సమయంలో సమత అతనికి సాక్షాత్తు కోరికలు తీర్చే కల్పవల్లిగానే కనిపించింది.

ఆమెకున్న ముందు చూపు — వ్యవహార జ్ఞానంలో నూరోవంతు తనకి వున్నా 'తనిన్ని కష్టాలు పడేవాడు కాదు — ఆమె ఆదినించీ అంటూనే వుంది, ఇలాంటివి వద్దని.

తనే మూర్ఖంగా ప్రవర్తించాడు—చివరకి తనంత తనే తెలుసుకుంటాడు లెమ్మన్నట్టు అంగీకరించింది అన్నింటికీ—అనుకున్నాడు బాగా.

తీరం చేరిన లాంచీలో ఏం పట్టుకోవడానికి కనిపించక వదిలివేశారు అమలేశ్వర్‌ని—సమతని.

'బతుకుజీవుడా' అన్నట్టు బయటపడ్డారు అక్కడినించి.

తిన్నగా మరోవేపు దృష్టి సారించకుండా తిన్నగా రైల్వేస్టేషను చేరుకున్నారు. అక్కడి నించి విజయవాడ చేరడానికి రైలు ఎక్కాక ప్రాణం కుదుటపడింది ఇద్దరికీ.

వినోద్ ఏమయ్యాడో వారు పట్టించుకో లేదు— వాళ్ళేమయ్యారో వినోద్‌కూడా కనిపెట్ట లేకపోయాడు.

ఈ విధంగా బావామరదళ్ళ బొంబాయి ప్రయాణం మఖలో పుట్టి — పుబ్బలో మాడి పోయినట్లయింది.

సమత మనసు యింత ప్రశాంతంగా వుందో — అమలేశ్వర్ హృదయం అంత అల్లకల్లోలంగా వుంది. సిగ్గు — అవమానం అన్నీ కలబోసుకుని వున్నాయి. తను ఇన్ని తెలివి తక్కువ పన్లు చేసినా సమత అంత త్వరగా క్షమించేస్తుందేమిటి ?

స్త్రీని అందుకే క్షమయా ధరిత్రి అన్నారు. ఆ మాటకే అక్షరాలా రూపకల్పన సమత, అనుకున్నాడు చివరకి.

ఇంక అన్ని బులబాటాలు తీరి బావగారు ఇంటిపట్టున కుదురుగా వుంటాడని సంతోష పడుతోంది సమత.

**జరిగిన కథ — 9 :** సమత, అమలేశ్వర్ — జాలయ్య దగ్గరకు వచ్చి వెండి గ్లాసు తాకట్టుపెట్టి యాభై రూపాయలు తీసుకొని హరి దగ్గరకు వెళుతారు. జాలయ్య దగ్గరి వెండి సామానంతా దొంగలించుకు వస్తాడు హరి. దానిని సమత, అమలేశ్వర్, హరి మూడు బాగాలుగా చేసి అమ్మేసారు. సమత తన భాగం డబ్బు అమలేశ్వర్‌కు ఇచ్చేస్తుంది. హరి తన భాగం డబ్బుతో టీ షాపు పెడతాడు. సింహళ, నవీన్ మద్రాసులో కాపురం పెడతారు. నిర్మాత సినీ దర్శకులు అయిన చక్రధరరావు నవీన్ రాసిన కథను పిక్చరు తీయాలనుకుంటు న్నట్లు, ఆ సంగతి మాట్లాడను చక్రధరరావు నవీన్‌ను ఆహ్వానించినట్లు నవీన్‌తో చెపుతాడు సంజీవరావు. వినోద్ అమలేశ్వర్‌కు గుడిలో పూజారి ఉద్యోగం ఇచ్చాడు. నవీన్ తమ్ముడు ప్రవీణ్ కువైట్ నుంచి వచ్చాడు. రాత్రి బాగా తాగివచ్చిన నవీన్ తమ్ముడిని గుర్తించక ఎవరో అనుకొని సింహళను అనుమానిస్తాడు. సింహళకు పూలపానుపు అనుకున్న జీవితం నరకం అయ్యింది. అమలేశ్వర్, సమత కారులో పోతున్న దంపతుల దగ్గర నగలు దోచుకొని గుడిలో దాస్తారు. హిందీ చిత్రరంగంలో అప్పుడప్పుడే పైకివస్తున్న తార కాంతి నవీన్‌కు పరిచయమౌతుంది. దినదినానికి నరకతుల్యమవుతున్న తన జీవితాన్ని తలచుకొని కుమిలిపోతుంది సింహళ. సమతను తీసుకొని అమలేశ్వర్‌ను గుర్రం పందేలు ఆడను బొంబాయికి రమ్మంటాడు వినోద్. సమత అందుకు తన అంగీకారం తెలుపుతుంది. నవీన్‌తో సింహళ జీవితం దినదిన గండంగా తయా రయ్యింది. ఆ బాధలో ఆమెకు తల్లితండ్రులు గుర్తుకు రాసాగారు. సింహళ తండ్రి నుంచి వచ్చిన ఉత్తరం చూసుకొని, నవీన్ అనుమతితో కన్నవారిని చూడను వెళుతుంది. బొంబాయిలో గుర్రం పందేలలో వినోద్ చేసిన మోసం వల్ల డబ్బు నష్టపోతాడు అమలేశ్వర్. అమలేశ్వర్, సమత గోవాకు వెళ్లను నిశ్చయించుకుంటారు.

## 17

సింహాళ పుట్టింటికి వచ్చి నెలదాటిపోయింది. ప్రవీణ్ మళ్ళీ తన ఉద్యోగానికి కువైట్ వెళ్ళిపోయాడు. వెడుతూ సింహాళ దగ్గరకు వచ్చి తన అడ్రసు ఇచ్చి ''ఎప్పుడైనా అవసరం అయితే ఈ అడ్రసుకు ఉత్తరం రాయి నేను రెక్కలు కట్టుకుని ఇక్కడకి వచ్చి వాల్తాను. నేను మళ్ళీ తిరిగి సరిగ్గా ఆరునెలల్లో వచ్చేస్తామ''. అంటూ చెప్పి వెళ్ళాడు.

సింహాళ తల్లికి కూతుర్ని చూడగానే సగం బలం వచ్చింది. ఆమె సపర్యలతో పూర్తిగా కోలుకుంది.

తన సంగతి గుర్తు వుందో — మరిచిపోయాడో గాని నవీన్ మటుకు ఒకసారి కూడా ఉత్తరం రాయలేదు. అంతతీరుబడి లేని పన్లు ఆయన్ని వదలకుండా వున్నాయా ? అనుకుంది బాధగా

మరో పదిహేను రోజులు గడిచిపోయే సరికి అతనింక ఉత్తరం రాయడు, తనని రమ్మని పిలవడు అని నిర్ధారణకి వచ్చింది సింహాళ.

అతనితో గడిపిన రోజుల్లో ఆనందంగా గడిచిన రోజులు వ్రేళ్ళ మీద లెక్కించుకోవచ్చు. అతనంత సజ్జనుడు వేరే వుండరనుకుంది. దేవుడిగా భావించింది, పూజించింది కాని తమ్ముడి రాకతో అతనిలో రాక్షసప్రవృత్తి కూడా బయటపడింది.

నాణానికి ఒక్క పక్క బొమ్మ ఒక పక్క బొరుసు ఉన్నట్లే అతనిలో ద్వంద ప్రవృత్తులున్నాయి

ఆ ద్వంద్వ ప్రవృత్తుల మధ్య తను నరకాన్నే చవిచూసింది. తను ఎలా తిరిగి వచ్చినా తను భరించి ఉండవలసిందే. ఏమన్నా పడివుండవలసిందే ఎదురు తిరగడం, హక్కుల కోసం పోరాడటం వగైరా వగైరాలన్నీ పాత్రల వరకే—

అస్తమానం అనుమానం—అసహనంతో తన ప్రాణం తోడేశాడు. తను అతని జీవితంలో అడుగు పెట్టిన వేళావిశేషం, అతని కథలు, సినిమాల కెక్కడం— అతనికి మాటలు రాసే అవకాశాలు కలగడం— అంచెలంచెలుగా అభివృద్ధి సాధిస్తూ— డబ్బు రెండు చేతులా ఆర్జిస్తు—పేరు ప్రఖ్యాతులెప్పుడైతే ఎక్కువయి పోయాయో అతని మనసు తనపట్ల అంత ఇరుకయిపోయింది అది తన దురదృష్టం —

ఈ దురదృష్టం తను చేజేతులా వరించింది— కనుక అనుభవించవలసిందే — అతను ఏదో ఒకనాడు మారి తన దగ్గరకు వస్తాడన్న ఆశ పూర్తిగా అడుగంటిపోయింది

ఆ సినిమా తార ఎవరో గాని ఆమెతోనే అతనికి పూర్తిగా తెల్లవారుతూ—పొద్దుగూకుతూ వుంటోందని తను వింటూనే వుంది.

బాధగా నిట్టూర్చింది సింహాళ.



కూతురు పడుతున్న బాధ అర్థం చేసుకుంటూనే వుంది సరళ. కాని తను మాత్రం కల్పించుకోదల్చుకోలేదు. ప్రేమ మత్తు దిగిన నవీన్ సింహాళకు విడాకుల కాగితం పంపినా నేనేం ఆశ్చర్యపడనక్కర్లేదు, అనుకుంది. పోనీ ఒకసారి తనే వెళ్ళి పరిస్థితి ఎలా వుందో తెలుసుకుందాం అనిపించినా ధైర్యం చాలలేదు సరిగదా. తల్లికి సుస్తీగా వుంది అని సింహాళ బయలుదేరిందని తెలిసినా ఎలా వుంది? అంటూ ఒక్క ఉత్తరంముక్క రాయనందుకు మనసులో ఓ మూల కోపం ఎగదోసింది అంచేత మౌనంగా వుండిపోయింది.

* * *

అమలేశ్వర్ ఆ రోజు ఎక్కడికో ఉద్యోగాన్వేషణలో తిరిగి తిరిగి రెండు గంటలకి ఇంటికి వచ్చాడు.

గుమ్మంలోనే ఎదురైంది సమత.

"బావా! నీకేదో రిజిస్టర్ వుందిట. పోస్ట్‌మాన్ వచ్చి పోస్టాఫీసులో కలుసుకోమని ఇప్పటిదాకా చూచి వెళ్ళిపోయాడు. వెళ్ళిరా" అంది సమత.

"నాకు రిజిస్టర్ పంపే నరాధములుకూడా వున్నారా ?" అన్నాడు నవ్వుతూ.

"వుండే వుంటారు" అంటూ లోపల్నించి గ్లాసెడు చల్లని నీళ్ళు అందించింది.

# మారేడు దళం

అవి అందుకుని త్రాగుతూ "బతికినవాడెవడూ పంపడు" అన్నాడు

"ఆ పద్ధతిలో చచ్చినవాడే పంపాడనుకో ముందీ పిచ్చివాగుడెందుకు గాని వెళ్ళి చూసిరా!" అంది.

ఆ గ్లాసు అక్కడ వుంచి పోస్టాఫీసుకు బయలుదేరాడు.

దారి పొడుగునా ఆలోచిస్తూనే వున్నాడు ఆ రిజిష్టరు ఏమయి వుంటుందాని. పోస్టాఫీసుకు వెళ్లి కవరు తీసుకున్నాడు.

ఆదుర్దా పట్టలేక అక్కడే విప్పి చదివాడు.

చిరంజీవి అమలేశ్వర్‌ని మీ పినతండ్రి శ్రీనివాసరావు ఆశీర్వదించి వ్రాయునది ఈ ఉత్తరం అందిన వెంటనే ఏలూరు దగ్గిర అడ్రసుకువచ్చి కలుసుకోవలెను. నేను సుస్తీతో బాధపడుతూ నా అయిదు లక్షల ఆస్తిని నీ పేరున వ్రాశాను. ఇంకోగంటో రెండు గంటలో అన్నట్టు వుంటున్న నా పరిస్థితి దృష్ట్యా నువ్వు ఎంత త్వరగావస్తే అంత మంచిది

ఇట్లు

నీ చిన్నాన్న శ్రీనివాసరావు

ఆ ఉత్తరం చదివేసరికి తల గిర్రున తిరిగినట్లయింది అమలేశ్వరికి.

చిన్నతనంలో తమ దగ్గరే వుండి బి. ఇ. చదివాడు. తన దగ్గరికి, అతనికి మాట పట్టించు[illegible] వచ్చి ఇంట్లోంచి అతను వెళ్లిపోవడం తనకి గుర్తు. ఆ తర్వాత తన తండ్రి పోయాక [illegible] వాళ్లచేత కబురు చేయించింది తల్లి. అతని అడ్రసు తెలియక, [illegible] నెలకి ఒక వందరూపాయలు పంపించాడు. మనియార్డరు ఫారం మీద ఉన్న అడ్రసు తను వ్రాసుకున్నాడు.

తన తల్లి పోయినప్పుడు అతనికా అడ్రసుతో [illegible] వెళ్ళిపోతున్నా[illegible] అడ్రసు రాసి పోస్టు చేశాడు. దానికి జవాబుగా [illegible] ఒక కార్డు వచ్చింది.

ఆ తర్వాత అతనూ మర్చిపోయాడు బాబాయి విషయం. [illegible] అన్న కొడుకుని అవసాన దశలో ఆహ్వానిస్తున్నాడు — మరి [illegible] వున్న బాబాయి పెళ్ళి చేసుకోలేదా ? పెళ్ళి చేసుకుని పిల్లాజెల్లా [illegible] రాస్తాడు ఆస్తి. అంటే [illegible] కాదు. అయిదులక్షలు. ముందు ఏమయినా [illegible] వార్త చెప్పాలి సమతకి. అనుకుంటూ [illegible] గులు వేసేసరికి "హలో [illegible]! ఎక్కడా దర్శనాలు లేవేం ?" అంటూ [illegible] ఎవరాని వెనుదిరిగి చూశాడు. స్వప్న.

ఆమెని చూడగానే అతని ముఖం [illegible] కృష్ణవేణిలా ఉప్పొంగిపోయింది.

స్వప్నగారా! బాగున్నారా?'' అంటూ పలకరించాడు.

''ఏమిటి ఇక్కడ వున్నారు?'' అంది నవ్వుతూ.

''నాకు అనుకోకుండా అయిదు లక్షల ఆస్తి కలిసివచ్చింది. వినోద్ కనిపిస్తే చెప్పండి'' అన్నాడు సంతోషంగా.

ఆ మాటకి ఒక్కక్షణం నోటమాట రాని దయింది స్వప్న.

''వినోదా? వినోద్ ఏమయ్యాడో ఏమో! నాకు కనిపించి చాలా కాలమయింది'' అంది ముఖం అదో మాదిరిగాపెట్టి.

''అలాగా! ఆ సంగతి నాకు తెలియదు లెండి'' అంటూ జవాబిచ్చి—

''వస్తాను'' అంటూ ఇవతలకి రాబో తుంటే —

''మరి అయిదు లక్షల ఆస్తి సంపాదించి కనీసం పార్టీ అయినా ఇవ్వవా?'' అని అడిగింది స్వప్న.

''ఇస్తాను. పూర్తించి వచ్చాక'' అన్నాడు.

స్వప్న అలాగేనన్నట్లు తల ఆడించింది

అమలేశ్వర్ యింటికి ఉరకలు పరుగులతో వచ్చాడు.

''సమతా! సమతా!'' అంటూ అతను పెట్టిన కేకలకి అంతా పరుగెత్తుకుంటూ వచ్చారు ఏమయిందోనని హడలిపోయి.

''సమతా! ఇది చదువు'' అంటూ ఆ ఉత్తరం చేతబెట్టాడు

''కంగ్రాట్యులేషన్స్ బావా! తొందరగా బయలుదేరు. అరగంటలో నాన్‌స్టాప్ వుంది ఏలూరు బస్సు.'' అంది ఉత్సాహంగా.

''ఏమిటే ఆ కంగారు?'' అని అడిగింది తల్లి.

బావకి అప్పనంగా ఆస్తి కలిసి వచ్చింది.

## తేలిగ్గా మెదడు ఆపరేషన్లు!

సులభంగానూ, ప్రమాదరహితంగానూ మెదడు ఆపరేషన్లను నిర్వహించే పద్ధతిని రూపొందించినట్లు ప్రముఖ జపాను డాక్టరు నోర్‌హికో కోమై తెలియచేశారు. మామూలు ఆపరేషన్లలో మెదడు పై భాగంలో పది సెంటీమీటర్ల పొడవును తెరువవల్సి ఉంటుంది. ఈ కొత్త విధానంలో ఒక రంధ్రాన్ని చేసి, ఒక సన్నటి గొట్టాన్ని అమరుస్తారు. దీనిద్వారా మందును మెదడులోకి పంపిస్తారు. మెదడులో గడ్డకట్టిన రక్తాన్ని ద్రవ రూపంలోకి మార్చి ఈ గొట్టం ద్వారా వెలుపలకు తీస్తారు. ఈ గడ్డకట్టిన భాగాలను ఒక స్కానర్ ద్వారా గుర్తిస్తారు. దీనివలన రక్తస్రావం ఇతర దుష్ఫలితాలు ఉండవు. దీనికి మత్తు మందులను కూడా ఎక్కువగా ఉపయోగించరు!

అంటూ మరోసారి ఆ ఉత్తరం గట్టిగా చదివి చెప్పింది.

ఆ ఉత్తరం చదివేసరికి ప్రసన్నలక్ష్మి ముఖం మతాబాలా వెలిగిపోయింది. ''వెళ్ళవయ్యా!'' అంటూ ప్రోత్సహించింది.

''మామయ్యకి చెప్పి—'' అని అత్తయ్యతో చెప్పి, ''పద మరదలా'' అన్నాడు

''నేనెందుకు?'' అంది ఆశ్చర్యంగా

''నువ్వు లేకపోతే అసలు పని జరగదు — ముందు బయలుదేరు.'' అంటూ ఊదరగొట్ట సాగాడు.

ఇంక తప్పదన్నట్టు ''వెళ్ళమంటావామ్మా'' అని అడిగింది.

''వెళ్ళు.'' అన్నాక బయలుదేరింది గబగబా

ఆ సాయంత్రానికే ఏలూరు చేరడం — అన్నకొడుకు కోసమేనన్నట్టు ప్రాణం ఇంకా కొట్టుకుంటున్న శ్రీనివాసరావును చూడటం — అతని చేతుల మీదుగా దస్తావేజులు అన్నీ తీసు కోవడం జరిగిపోయాయి.

ఆ మర్నాడే శ్రీనివాసరావు పోయాడు. మేనమామ పరాత్పరరావుకు టెలిగ్రాం ఇచ్చాడు. అంతా వచ్చారు— పినతండ్రి దహనకాండలన్నీ ముగించి ఇంటికి వచ్చారు అమలేశ్వర్, సమత —

కాలం మరో నెల గడిచిపోయింది.

''సమతా ఇంకా మన పెళ్ళికి నీకు మనసు పుట్టడం లేదా?'' అని అడిగాడు ఒంటరిగా దొరకబుచ్చుకుని.

ఆ మాటకి సిగ్గుతో మల్లెమొగ్గ అయింది సమత.

''పెద్దవాళ్ళని అడుగు బావా!'' అంటూ అక్కడినించి పారిపోయింది.

అదే రోజు పోస్టులో వచ్చింది అతని పేర ఒక ఉత్తరం

డియర్ అమల్,

నీకు నేనంటే ఎంత ప్రేమో — నాకోసం ఎంత తపించేవాడివో నాకు తెలుసు — నీ ప్రేమని చూశాక నాకు నిన్నే పెళ్ళాడాలనిపించింది — నీకూ అంగీకారం అని నాకు ముందే తెలుసు — నువ్వు ఒకసారి మా యింటికి వస్తే మా నాన్న గారికి పరిచయం చేస్తాను — వస్తావుగా!

నీ స్వప్న.

ఆ ఉత్తరం చదివి వెంటనే జవాబు రాశాడు అమలేశ్వర్.





# మారేడు దళం

డియర్ స్వప్నా!

ఒకప్పుడు నువ్వంటే నేను భ్రమపడిన మాట వాస్తవమే — కాని ఇప్పుడు లేదు. నాకోసం అష్టకష్టాలుపడుతూ — నాకోసం ఏమైనా చేస్తూ ప్రాణాధికంగా ప్రేమించే నా సమత వుండగా ఈ ప్రపంచంలో నాకు ఏదీ అవసరంలేదు — నేను ఈనాడు లక్షాధికారిని కనక అంతా అభిమానాలు వర్షంలా కురిపిస్తున్నారు — కాని తిండికి ఠికానా లేక రోడ్లంబడి తిరిగే రోజుల్లో పిలిచి ఎవరూ టీనీళ్ళు కూడా పోసినవారు లేరు — బెల్లంచుట్టూ ఈగలు మూగడం సహజం అయినట్టే డబ్బుంటే అంతా చుట్టుముడతారు — డబ్బుతో వచ్చే ప్రేమలు డబ్బుతోనే పోతాయి — లక్ష్మీదేవి చంచల. ఈరోజు ఇక్కడ వుంటే రేపు మరోచోట వుంటుంది. అలా లక్ష్మీదేవి వెనకాలే వుండే ప్రేమలంటే నాకిష్టం వుండదు — పట్టెడు బిల్వం — పిడికెడు విభూతి దాల్చే పరమేశ్వరునికి ఇల్లూ వాకిలీ లేకపోయినా — బిచ్చం ఎత్తుకు తిరిగే జంగందేవర అయినా మనసారా వలచిన పార్వతీదేవే నా ఆరాధ్యదేవత అలాగే కష్టసుఖాలన్నిటినీ సమభావంతో చూడగలిగిన మహోత్తమజీవి సమత వుండగా కరిగిపోయే కలలు నాకు వద్దు — నీ మనసు నొప్పిస్తే మన్నించు —

అమల్.

ఆ ఉత్తరం చదివి స్వప్న భగ్గున మండి పడినా చేసేదేంలేకపోయింది. మరో పదిరోజులకు శుభలేఖలు పంచుతూ కనిపించారు అమలేశ్వర్. సమతలు.

ఆ పెళ్ళికి సింహాళ— స్వప్న— వినోద్— హరి— అంతా హాజరయ్యారు— తన బతుకు అస్తవ్యస్తంగా ఏడ్చినా కనీసం సమత జీవితం అన్నా సుఖంగా గడవాలని మనసారా ఆశీర్వదించింది సింహాళ.

*(అయిపోయింది)* ★

## అంకితం

వాయులింగంగా ఖ్యాతి గడించి కరి, పురుగు, పాము, బోయలకు ముక్తి నిచ్చి భక్తికి తరతమ భేదాలు లేవంటూ చాటి చెప్పిన శ్రీ కాళహస్తీశ్వరునికి భక్తి ప్రపత్తులతో సమర్పించిన నవలా బిల్వ పత్రం—

— లలిత




### కె. కె. వి. కె. — మదనపల్లి

చూడు అక్కయ్యా ఇది ప్రశ్నావళి. ఇది జోకు కాదు. మీరు చెప్పే జవాబులు ప్రజలకి జ్ఞానోదయం కల్గించాలి. సరదా, తమాషాగా కొట్టిపారేయకూడదు...

★ అలాగా ? మీరేం మనుషులండీ బాబ్బా, మీరు సరదా కేపనీ చెయ్యని రకంలా వున్నారే ! జ్ఞానోదయం యివ్వగల్గితే — ఇక్కడెందు కుంటాను — ఏ హిమాలయాల్లోనో చిన్న ధీరేంద్ర బ్రహ్మచారి/రజనిష్‌లాంటి ఆశ్రమం పెట్టి వుందును ! జ్ఞానోదయం ఎవరో యివ్వరు. సముపార్జించాలి. తెలియదా ?

### ఎమ్. ఎ. ఎస్. - మిర్యాలగూడ

ప్రశ్నలకి చురుకుగా సమాధానాలు యిస్తున్నందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది. కావున నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్తున్నాను ...

★ నిజమే తమ్ముడూ, మందకొడినైతే— నా శుభాకాంక్షలు ఎన్నాళ్లకు అందేవో! థాంక్స్యూ.

### పి. ఆర్. ఎల్. — పాతగాజువాక

ఉద్యోగాలలో స్త్రీలకు రిజర్వేషన్లు అవసరమా ?

★ ఒక్క ఉద్యోగాల్లోనే కాదు — ఎసెంబ్లీ సీట్లలో కూడా యివ్వాలి. అధికారం తమ చేత వుంచుకుని యిలా చిన్న చిన్న 'బిక్ష' ఎన్నాళ్లిస్తారు— సాటి మనిషికి?—జనాభాలో 50 శాతం దాటి వున్న మహిళలకీ రోజున ఏ రంగంలో సరైన ప్రాతినిధ్యం వుంది? చెప్పండి. నన్నడిగితే— మహిళలు ప్రత్యేకం ఓ రాజకీయపార్టీని గురించి ఆలోచించడం మంచిది. మహిళా జనం ఓట్లు లేకపోతే— ఎవరొస్తారో అధికారంలోకి— చూడవచ్చు.

### పి. జి. ఆర్. — తరకుదురు

ప్రేమించడానికి కల అర్హతలు ఏమిటి ?

★ ప్రేమించడానికీ, రాజకీయల్లో దిగడానికీ — ఏ ప్రత్యేక అర్హతలూ అక్కర్లేదు ! బోల్తా కొట్టించకల చాకచక్యం వుంటే — నెట్టుకురావచ్చు.

### గివారా — పెదనింద్రకొలను

కె. రా గారూ విప్లవానికి—యుద్ధానికి తేడా.

★ విప్లవం మనవాళ్లనే చంపడం ...! ! యుద్ధం పరాయివాళ్లని చంపడం ...! !

### కె. పి. — కాకినాడ

గేయనికీ కవితకీ తేడా ఏమిటి ?

★ నాకూ బాగా తెలియదు సోదరీ, కాని పాడడానికి తగినది గేయం, చదువడానికి కవిత అనుకుంటాను నేను. అంతేకాదు, గేయంలోనూ కవితలోనూ కవి హృదయం వుంటుంది.

### వై. ఎస్. డి. — వజ్రకారూరు

లక్ష్మి ఎప్పుడూ ధనవంతులనే వరిస్తుంది అంటారు నిజమేనా ?

★ కలికాలంలో నీచులనీ వరిస్తుందని వినికిడి !

మీది ప్రేమ వివాహమా ? పెద్దలు నిర్ణయించి చేసినదా ?

★ ప్రేమ వివాహం. పెద్దలు ఒప్పుకొన్నది.

### జి. ఎస్. ఆర్. — వండలంక

మీ ప్రశ్నావళి బైండు చేయించాలనుకుంటున్నా. మీ జవాబులు జీవితంలో ఉపయోగిస్తాయని కాదు, వినోదాన్నిస్తాయని.

★ ముఖం మీద చిన్న నవ్వు ఎంత అవసరమో — కూడా చెప్పనా ?! వినోదం లేకుంటే జీవితం ఎలా వుంటుందో ఆలోచించండి.

### కె. బి. — తిరుమల

నా స్నేహితులు నాతో బాగా మాట్లాడతారు. వెనుకవైపు ఒక మాదిరిగ మాట్లాడుతారు. వీరిని ఏమనాలి ?

★ స్నేహితులని అనకండి. తెలిసినవాళ్లనండి. తెలిసినవాళ్లలో కూడా కొన్నిరకాల మనుషులే — వెనుతిరగ్గానే — చెవులు కొరుక్కుంటారు.

### కె. వి. ఆర్. — భీమారావుపేట

మేడమ్, మీకు మంత్రి పదవి ఆఫర్‌చేస్తే ?

★ ఏది ? ఎక్కడ ? ఎప్పుడు ? రాష్ట్రంలోనా ? కేంద్రంలోనా అంటూ పిచ్చెత్తి జుట్టు పీక్కుంటూ పరుగులు పెట్టనా ?! (లేకపోతే నీళ్ళులేని నుయ్యి చూసి వురకనా ?! ... — ఎప్పుడు పోతుందోనన్న బెంగతో)

### కె. ఎన్. పి. — ఎమ్మిగనూరు

నేటి సినిమాలపై మీ అభిప్రాయం ఏమిటి ?

★ ఏవి ? ఆడుతున్న పాతవాటిమీదా ? ఆడిస్తున్న కొత్తవాటిమీదా ?

### ఆర్. ఎస్. — బదిజేపల్లి

నేను పదవ తరగతి చదువుతున్నాను. కధలు, కవితలు నాటకాలు—వ్యాసాలు జోకులు— ఏడు బైండ్లు అయ్యాయి. పత్రికకు పంపితే తిరిగి వచ్చేయి. నా ఫ్రెండ్సు హేళనచేస్తున్నారు. ఒక్కొక్కప్పుడు చనిపోదామనిపిస్తూంది ...

★ పదో తరగతి చదివేది ! యింతకీ వయస్సెంత తమ్ముడూ ?! అంత నిరాశ అలముకోడానికి. పంపిన ప్రతి రచనా వేసే పత్రికలు చాలా అరుదుగా వుంటాయి. తీయగా తీయగా రాగం అన్నట్టు — రాయగా రాయగా — అదే అచ్చు కావడం ప్రారంభిస్తాయి. తొలి రచనలు తిరిగి వస్తే — యిలా బెంబేలు పడిపోకూడదు. ఇలా పోస్టులో వేసి — అలా డబ్బా కొట్టడం మానాలి.

### కె. ఎమ్. — ఎమ్మిగనూరు

మనిషిని మనిషిని వేరు చేసేది ఏమిటి ?

★ ఈర్ష్య.

ప్రతి మనిషి జీవితంలో అతి విలువైనది ఏమిటి ?

★ స్వసుఖం.





# దగ్గరట దూరం - దూరట దగ్గర

కథారి రాఘవరావు




"రావే శాంతా—ఎప్పుడొచ్చావు వూరి నుంచి"

గుమ్మం దాటి లోనికొస్తున్న చెల్లెలు శాంతమ్మను చూసి, సాదరంగా, సంతోషంగా పలకరించింది పార్వతమ్మ.

"రెండురోజులయింది అక్కయ్యా...ఆ.. బావకెలా వుంది వంట్లో" ఎదురుగా మంచం పై పడుకుని, పై కప్పు కేసి చూస్తూ చుట్ట త్రాగుతూ, తన ధ్యాసలో తానున్న బావగారిని చూస్తూ తన స్థూలకాయాన్ని మంచం పై చేర్చింది శాంతమ్మ.

'ఎవరావచ్చింది' అనుకుంటూ పై కప్పు నుంచి దృష్టి ప్రక్కకు మరల్చి చూసాడు శాంతమ్మ బావ, పార్వతమ్మ భర్త అయిన ఆంజనేయులు.

"ఆ... రాత... అలాగే వుంది... కాకపోతే కొంచెం ఫర్వాలేదనుకో". కొద్దిగా గొంతు తగ్గించి "అప్పుడప్పుడు మతి తప్పిపోతుందే. తనలో తను మాట్లాడు కోవటం" అంటూ భర్తకు మతి స్థిమితం యెంతగా వుందో చెల్లెలు తెలుసుకోవడానికన్నట్లు.

ఆంజనేయులుకు కాస్తంత నత్తి కూడా వుంది. "మ...మరదలు,పిల్ల శాంత కదూ..." బావగారు సరసాన్ని మరదలుపై ప్రదర్శించాడు.

ఆడవాళ్లిద్దరూ నవ్వుకున్నారు.

"ఆ ఇంకా పిల్లనే.. అరవై ఏళ్ళొచ్చినాయి. అమ్మమ్మను, నాయనమ్మను కూడా అయ్యాను... అది సరే గాని.. ఎలా వుంది ఆరోగ్యం". సరసాన్ని తుంచేసి, టాపిక్ మారుస్తూ అంది శాంతమ్మ.

మౌనంగా వూరుకున్నాడు ఆంజనేయులు చుట్ట పొగ పీలుస్తూ. వృద్ధాప్యంలో, అనారోగ్యంతో, బక్కచిక్కి, ఎప్పుడూ మంచాన్నే ఆశ్రయించుకుని, చుట్ట త్రాగుతూ గడుపుతుంటాడు. గుడ్డలు మాసిపోయి, గడ్డం మాసిపోయి, గృహ సంబంధమైన దిగుళ్లతో, అసంతృప్తి నిండిన హృదయంతో, అప్పుడప్పుడూ స్థిరత్వాన్ని కోల్పోతున్న మనస్సుతో ఏవో లోకాల్లో విహరిస్తూ వుంటాడు.

"చూసావా, అదీ వరస.. నువ్వు అడిగిన దానికి సమాధానమిచ్చేలోగా, ఆయన మతి, మన ధ్యాసలో నుంచి వేరే ధ్యాస లోకి వెళ్ళిపోయింది". చెల్లెలుకు, తన భర్త సమాధానమివ్వని చేష్టకు సంజాయిషీ యిస్తున్నట్లుగా చెప్పిందిపార్వతమ్మ.

"వైద్యముచేయిస్తున్నావు కదా. మందులు అవీవాడుతున్నారా"

"పంజాగుట్టలో...ఆయన పేరేమిటో... సతీష్ అగర్వాల్ గామాలు, ఆయనకు చూపించారు విష్ణువర్ధన్‌గారు. ఆయనే పాపం నెలరోజులు సెలవుపెట్టి, హాస్పిటల్‌కు తిరిగి, వైద్యం చేయించారు. అందువల్లే, ఆ మాత్రమన్నా నయమయింది." పార్వతమ్మ చెప్పుకుపోతోంది.

మ్మనిర్ఘాంతపోయారు...

''అదేనే— అల్లుడుగారు. పేరు మర్చిపోయావా. అమ్మాయివాళ్ళు యిక్కడే మెహిదీపట్నంలో వుంటున్నారు కదా. అల్లుడు, అమ్మాయి 'మా యింటికి రండి, వుందురుగాని' అని వకటే యిదిగా చెబుతున్నారు. నాకూ వెళ్ళిపోవాలనే వుంది. కాని వక్కగానొక్క కొడుకు'' కళ్లమ్మట నీళ్లొచ్చాయి పార్వతమ్మకు. పైట చెంగుతో కళ్లొత్తుకుంది. ''వాడిని కళ్లెదురుగా చూసుకుందామని, వాడిని వదలలేక, కోడలి నిరాదరణను, ఆవిడా, ఆవిడ తల్లిదండ్రుల సూటిపోటి మాటలను భరిస్తూ, అవమానాలను అవహేళనలను సహిస్తూ గడుపుతున్నాను!'' దిగులుగా భర్తవంక చూసింది పార్వతమ్మ.

''ఏమి... మీరేమి వల్లెత్తు మాట అనే మనుషులు కాదు కదా... లేక పోట్లాడేవాళ్లా... ఎందుకటా'' పాయ్యిలో కట్టెలను, ఎట్లా యెగదోస్తే మంట వస్తుందో, శాంతమ్మకు బాగా తెలుసు.

''ఏమిటంటే ఏమని చెబుతానే... అంతా మా ఖర్మ... అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాలనాడు కాదుకదా. పెళ్లాం మాటకు యెదురు చెప్పలేని కొడుకు. అత్త పొడ, ఆడబిడ్డల పొడంటే గిట్టనిది కోడలు. మేము యేమాశిస్తున్నాము వాళ్లవద్ద నుంచి. కాస్తంత ఆదరణ, ఆప్యాయతలే కదా. ముసలివాళ్లం మాకేం కావాలి. నాతో మాట్లాడదు. పిల్లల్ని మాట్లాడనివ్వదు. ఆవిడే అలా వుంటే, ఆవిడ తల్లిదండ్రులు యింకెలా వుంటారు. మేము తింటున్నామో... తినటంలేదో... బాగున్నామో... బాగులేదో వాళ్లకక్కరలేదు. ఈగదిలో మమ్మల్నుంచాడు వంటిల్లోనే చావండని. నెలకో మాటయినా మా మొహాన కొడుతున్నాడు. ఎప్పుడో తీరినప్పుడొచ్చి కాసేపు మాట్లాడి వెళ్లిపోతాడు... ఆ వుండు... కాఫీ కాచుకొస్తాను'' అంటూ లేవబోయింది పార్వతమ్మ.

''కాఫీ వద్దు. ఏమీ వద్దుగాని కూర్చో. ఇప్పుడే త్రాగి వచ్చానులే'' అక్క పరిస్థితి చూసి సానుభూతిగా అంది శాంతమ్మ.

'గిరి చిన్నప్పుడు యెంత బుద్ధిమంతుడిలా వుండేవాడు. అలాంటి వాడు యెలా తయారయ్యాడు'' స్వగతంలా అనుకునే మాటనే పైకి అనేసింది శాంతమ్మ.

''వాడిదేముంది పిచ్చినాయాన... ఆ కోడలు దెయ్యం పట్టి పీడిస్తోంటేను. దానికుండొద్దు బుద్ధి. ఆవిడ తల్లిదండ్రుల అంతస్తుకు మేము తగముట. అనాగరికులమట. పిల్లలను మేము పిలిస్తే సహించలేదు. ప్రేమగా దగ్గర కు తీసుకుంటే భరించలేదు. అందుకే పిలవను. నావాళ్లేరారు. రానివ్వరు... ఏమి టో లే... ఇలావున్నాం. చావకుండా... బ్రతకకుండాను... ఇప్పుడు మిడిసిపడితే అయిపోయిందా? రేపు తనకూ కోడళ్లు రారా. తనూ నాలాగే ఏడవదా'' మనిషి అశక్తురైనప్పుడు, ప్రతీకారాన్ని శాపనార్థాల ద్వారా తీర్చుకుంటాడు.

''ఉండు... కాస్త కాఫీ పెడతాను. చెల్లెలుకు కాఫీ యిచ్చే స్థితిలో లేననుకోకు.'' అంటూ జారిన కొప్పును సవరించుకుంటూ కిరోసిన్ స్టౌ వద్దకు వెళ్లింది పార్వతమ్మ.

కాఫీ చేస్తూనే చెల్లెలుతో మాట్లాడుతోంది పార్వతమ్మ.

''పొగాకు వ్యాపారము ఎలా వుంది. మరిది గారి హస్తవాసికి తిరుగులేదులే.'' చెల్లెలు చేతులకు నిండుగా ఆ చేతికో నాలుగు, యీ చేతికో నాలుగు బంగారు గాజులు, ఆ చెయ్యి వ్రేలికి, యీ చెయ్యి వ్రేలికి చెరో వుంగరము, మెళ్లో నెక్లెస్ తళతళా మెరిసిపోవటాన్ని చూస్తూ, చూడనట్లు అడిగింది.

''ఫర్వాలేదు... పట్టనకుండా రావటంలేదు కాని... ఫర్వాలేదు'' ఆహంభావాన్ని దర్పాన్ని చాటుతున్నాయి శాంతమ్మ మాటలు. తన స్థితిని చూసి, అక్క యెక్కడ కళ్లు కుట్టుకుంటుందో నని, కుట్టుకోవాలని, రెండు భావాలు ఆవిడ మాటల్లో ద్యోతకమవుతున్నాయి.

కాఫీ గ్లాసు చెల్లెలుకొకటి, భర్తకొకటి అందించి, తనొకటి తీసుకుంది పార్వతమ్మ.

పార్వతమ్మ, శాంతమ్మ యిద్దరూ అక్కాచెల్లెళ్లు. పార్వతమ్మకు వక కొడుకు, వక కూతురు. కొడుకు గిరిప్రసాద్, హైదరాబాద్‌లో, వక కాలేజీలో, లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. కోడలు కళ్యాణికూడా, వక స్కూల్లో బి. ఇడి. అసిస్టెంటుగా పనిచేస్తున్నది. గిరిప్రసాద్, ఇల్లరికం కాకపోయినా, రామ్‌నగర్‌లోవున్న అతని అత్తగారి యింట్లో, వక పోర్షన్‌లో అద్దెకుంటున్నాడు. అతని మామగారు, ఆర్. డి. వో. గా రిటైర్ అయ్యి, విశ్రాంతి తీసుకుంటున్నాడు. గిరికి అత్తగారి యింట్లో వుండటానికి యిష్టం లేకపోయినా, భార్య కళ్యాణి మాటను కాదనలేడు. వక పోర్షన్‌లో అత్తామామలు, వాళ్ల కుటుంబం. వేరొక పోర్షన్‌లో తను — తన కుటుంబమూ, తన తల్లిదండ్రులువుంటున్నారు. భార్య మాట ప్రకారమే, తల్లిదండ్రులను, ఆ పోర్షన్‌లోనే వేరేగా వక గదిలో వుంచాడు. [illegible] కెంత అని యిస్తూ, మీ బ్రతుకు మీరు బ్రతక[illegible] డని చెప్పాడు. వాళ్లకు వేరే స్థిర, చరాస్తులు లేవు. దాచుకున్న డబ్బు లేదు. [illegible] వుద్యోగం చేసిన అంజనేయులు ఆ [illegible] కొడుకును యమ్.ఏ. చదివించాడు. [illegible] యేమీ వెనకేసుకోనందుననే ఇలా కొడుకున్న ఆధారపడి బ్రతకవలసి వచ్చింది. పార్వతమ్మ కూతురు పేరుశ్యామల. శ్యామల భర్త విశ్వనాథ్ కూడా, హైదరాబాద్‌లోనే, ఒక ప్రయివేటు కంపెనీలో పని చేస్తున్నాడు. వాళ్ళు [illegible] పట్నంలో వుంటున్నారు.

శాంతమ్మ రెండో కొడుకు ఆనందమోహన్ కూడా, హైదరాబాద్‌లోనే, సెక్రటేరియట్‌లో జూనియర్ అసిస్టెంటుగా పని చేస్తున్నాడు. ఆనంద్‌నగర్‌లో వుంటున్నాడు. [illegible] వంట్లో బాగులేదని కొడుకు తెలుపగా [illegible] చూద్దామని తెనాలి నుంచి వచ్చింది శాంతమ్మ. శాంతమ్మ స్థితిమంతురాలే. [illegible] వెంకటరామయ్యకు మొదట్లో యేమీ లేకపోయినా, తరువాత, తరువాత పొగాకు వ్యాపారములో కలిసొచ్చి బాగా సంపాదించాడు. రెండు యిళ్లు కట్టించాడు. పదెకరాల భూమి సంపాదించాడు. ఇద్దరు కొడుకులు [illegible] వుద్యోగాలున్నాయి. వాళ్లకు, ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళిళ్లు చేశాడు. [illegible] ఒక కూతురు చదువుకుంటున్నారు.

''వస్తానక్కయ్యా... [illegible]'' అంటూ లేచింది శాంతమ్మ. మతిస్థిమితంగా వుండేమో ''[illegible]'' అంటూ అటువైపు నుంచి యిటు పొర్లాడు అంజనేయులు.

''ఒకరోజు వుండి, భోజనం చేసి వెళ్ళు శాంతా'' నెమ్మదిగా, బరువుగా అంది పార్వతమ్మ.

ఇటీవల నవజ్యోతి కళానిలయం (జడ్చర్ల) వారు మహబూబ్‌నగర్ జిల్లా స్థాయిలో నాటికలు, ఏకపాత్రాభినయం, లలితగాత సంగీత పోటీలు నిర్వహించినప్పుడు తీసిన చిత్రం.

శ్రీయుతులు గోపాలరెడ్డి, వెంకయ్య, కృష్ణారెడ్డి, దేవదాసు కనకాల, భానుప్రకాష్, ఎర్రమినేని చంద్రమౌళిగార్లను చిత్రంలో చూడవచ్చు.



బలవంతం చేస్తున్నట్లుగా ఆ మాటల్లో ధ్వనిం చటంలేదు.

''ఇంకోసారి వచ్చినప్పుడుంటానులే ... కళ్యాణిని పలకరించి వెళతాను'' అంటూ చీర చెంగు నిండుగా కప్పుకుంటూ, పార్వతమ్మ కోడలు కళ్యాణి వాళ్ళగదిలోకి వెళ్ళింది శాంతమ్మ.

గుమ్మందాక వచ్చిన పార్వతమ్మ, వెళుతున్న చెల్లెల్ను ఒకసారి చూసి, ఒక్కక్షణం. గుమ్మం లోనే ఆగిపోయి, ఆ తరువాత తన గదిలోకి వెళ్ళి పోయింది.

''రా ... అత్తయ్యా . చాన్నాళ్లకు...'' అంటూ సోఫామీదినుంచి లేచి సంతోషంతో, సాదరంగా ఆహ్వానించింది కళ్యాణి శాంతమ్మను.

''కూర్చోండత్తయ్యా ఎప్పుడు రావటం. అంతా బాగున్నారా?'' సోఫా చూపిస్తూ ఆప్యాయంగా పలకరించింది కళ్యాణి. ఎయిర్ కూలర్‌ను ఆన్‌చేసింది.

''రెండు రోజులయిందమ్మా. అబ్బాయేడి. కాలేజీకి వెళ్ళాడా. సెలవేకదా ?''

''అవునత్తయ్యా . సెలవే అయినా, ఏదో ఫంక్షన్ వుంది, అంటూ వెళ్లారు. ఈయనకు, సెలవు రోజుకూడా తీరికుండదు అత్తయ్యా. ఎప్పుడూ యేవో ఫంక్షన్లు, మీటింగులు, ఆ పోటీలు, ఈ పోటీలు. రాత్రి కాసేపే ఇల్లూ, పెళ్ళాం, పిల్లలూ నూ. ఆ కాసేపుకూడా అక్కడే గడిపేయకూడదా అని అంటూ వుంటాను నవ్వుతూ'' ఆత్మీయులను చూసినంత ఆనందంతో గబగబా మాట్లాడింది కళ్యాణి.

''మగవాడు కదా. మనలా ఇల్లూ, వాకిలి కనిపెట్టుక్కూర్చుంటానికి, వాడికెక్కడ కుదురు తుంది. అయినా నీలాంటి సమర్థురాలుంటే, వాడికేమిటమ్మా లోటు. చక్కగా చూసు కుంటున్నావు. యింటినీ, పిల్లల్నీ... అన్నట్టు పిల్లలేరి...?'' ఎంతవరకు పొగడాలో, అంతవరకే పొగడటంలో, ఔచిత్య మెరిగిన స్త్రీ శాంతమ్మ.

## దగ్గరలు దూరం–దూరాలు దగ్గర

''పిలుస్తానుండత్తయ్యా ... దొడ్లోనో, పక్కింటివాళ్ళ యింట్లోనో ఆడుకుంటూ వుంటారు.'' ఫెళఫెళలాడే చీరను సవరించు కుంటూ ''సుధా, శశి, క్రాంతి'' అంటూ హడావిడిగా పిలుస్తూ, దొడ్లోకి వెళ్ళింది కళ్యాణి.

శాంతమ్మ కూర్చున్న.మధ్య గదిలో గోడ ప్రక్కనున్న పెద్ద టేబిల్‌పై, చిన్న రేడియో, టెలివిజను వున్నాయి. పక్కపక్కన డబుల్‌కాట్ మెత్తని పరుపులతో నిగనిగలాడుతూ, ఠీమాగా కొట్టొచ్చినట్టు కనపడుతోంది. ఎదురుగ్గా ఎయిర్‌కూలర్, చల్లటి గాలిని విసురుతున్నది. ఇంకా యేమున్నాయో చూద్దామనుకుంటూ, లేచివెళ్ళి, ప్రక్కగదిలోకి తొంగి చూసింది శాంతమ్మ. గంభీరంగా నిల్చున్న ఫ్రిజ్ కనిపిం చింది. ''ఫర్వాలేదు... బాగానే వున్నారు ...'' స్వగతంలో అనుకుంటూ వచ్చి సోఫాలో చతికిల బడింది.

''రండర్రా ... నాయనమ్మ వచ్చింది ... నమస్కారాలు పెట్టండి.'' ఇద్దరు కొడుకులను, కూతురిని వెంటబెట్టుకుని వస్తూ అంది కళ్యాణి.

''నమస్కారం గ్రాండ్‌మదర్'' తల్లిమాట ప్రకారం వుత్సాహంగా పలికాయి పిల్ల చిలుకలు.

''రండిబాబూ... రండమ్మా... పాపిష్టి దాన్ని.. ఏమీ తీసుకురాలేదు. పరధ్యానంగా వచ్చాను'' అంటూ తను పిల్లలకు, తినేవస్తువు లేమీ తేనందుకు నొచ్చుకుంటూ, అందుకో అబద్దాన్ని చేర్చి, సంజాయిషీ యిచ్చింది శాంతమ్మ. పిల్లలు దగ్గరకొచ్చారు. మగపిల్లల నిద్దరినీ వకవైపు, ఆడపిల్ల నొకవైపు కూర్చో బెట్టుకుంది.

''ఫర్వాలేదత్తయ్యా. మీ రొచ్చారు. మాకంతేచాలు'' అంటూ వంటగదిలోకి వెళ్ళింది కళ్యాణి.




అయన బస్ కండక్టర్ లే! -సుసర్ల-

శాంతమ్మ పిల్లలను, వాళ్ల చదువు గురించి, బడి గురించి అడుగుతోంది. క్రాంతి, మగపిల్లలకన్నా వుత్సాహంగా గబగబా చెబు తున్నది— అడిగిన సంగతులు, అడగని సంగతులు అన్నిటినీ కలిపి.

ఒక ప్లేటులో పాలకోవా, మరో ప్లేటులో పకోడీలు పెట్టుకుని వచ్చి, వాటిని, శాంతమ్మ ముందున్న టీపాయ్ మీద వుంచింది కళ్యాణి.

''తీసుకోండత్తయ్యా .. పిల్లలూ మీకు డైనింగ్ టేబిల్‌పై పెట్టాను. గొడవ చేయ కుండా తినండి.'' అంటూ తన ప్లేటు తెచ్చుకుని శాంతమ్మ ప్రక్కన కూర్చుంది.

''ఎలా వుందత్తయ్యా పాలకోవా ?'' పాలకోవా సగం పూర్తిచేసిన శాంతమ్మను చూసి, అడిగింది కళ్యాణి.

''చాలా బాగుందమ్మా... నువ్వే చేసావా?'' ఎంత బాగుందోకాని, చాలా బాగుందనటమే బాగుంటుందని, అలా అన్నది శాంతమ్మ.

''అవునత్తయ్యా...'' అత్తగారి మెచ్చు కోలును స్వీకరిస్తూ చిరునవ్వుతో పలికింది కళ్యాణి.

''మా అక్కయ్యకూడా బాగానే చేస్తుంది. కాని యింత బాగా కుదరదు దానికి'' స్వంత అత్తగారి గురించి, స్వంత కోడలి కబుర్లు వినాలనే కోరికతో, పార్వతమ్మను రంగంలోకి లాక్కొచ్చింది శాంతమ్మ.

''ఆ... ఆవిడకు చేతగానిదేమిటి..., అన్నీ చేతనవును... అన్నీ వచ్చును. ఇతర్లకేమీ రాదు- ఇతర్లేమి చేసినా తనకు గిట్టదు. అన్నిట్లోనూ, తనదే పైచేయిగా వుండాలని అనుకుంటుంది'' శాంతమ్మ బాణం గురి తప్పలేదు. తగలవలసిన చోటే తగిలింది.

''అదో ఛాదస్తపుది. తన కాలం వేరు, నీ కాలం వేరు. మారిన కాలంతోపాటు మనమూ మారాలి. లేకపోతే యెలా'' రగులుకున్న అగ్నిలోకి, మరో పుడక వేసింది శాంతమ్మ.

''పెళ్లప్పుడే తెలిసింది ఆవిడ తత్వం. క్రొత్త డిజైన్‌లో, ఫాషన్‌బుల్‌గా నక్లెస్ చేయించుకుంటామంటే, 'యిదేమిటి, ఏం బాగుంటుంది, ఈ రాళ్లేమన్నా వుంటాయా ! శుభ్రంగా నా నక్లెస్‌లాంటిదే చేయిద్దామంటూ' తన పెత్తనం వెలిగించి, ఆ నక్లెసునలా నాశనం చేసింది. పల్చగా, రేకులా వుండే తాళిబొట్టు చేయించుకొచ్చింది. ఏం ! తన కూతురికి పనిగట్టుకునల్లా చెప్పి, మందంగా కుదుముల్లా వుండే మంగళసూత్రాలు చేయించుకోలేనిది,- కోడలి కెందుకలా చేయించలేదు. కూతురి లాంటిదే కోడలనే జ్ఞానం వుండొద్దూ. ఆ తరువాత మాత్రం, కొడుకును కష్టపడి చదివించాను. తినోతినకో చదివించాను అంటూ అందరిదగ్గరా డప్పు వాయించుకుంటోంది. ముచ్చటపడి నేను ఫలానా రంగు పట్టుచీర

# దాని పేరు ఖేతాన్

ఖేతాన్* ఫాన్‌లో చేరిన చిన్న చిన్న విషయాలే దాని ప్రత్యేకతకి కారణాలు గుండెకాయవంటి మోటార్‌ని చూడండి మిగిలిన వాటిలో 14 లేక 16 పోల్స్ వుంటే ఇందులో 18 పోల్స్ వుండడంతో లోపరహితంగా వుండి సమర్థత పెరుగుతుంది

రోటార్‌ని చూడండి, మిగిలిన వాటిలో ప్రెషర్ డై-కాస్ట్‌వి వుంటే ఇందులో సెంట్రీఫ్యూగల్ విధానంతో డై-కాస్‌వేయబడిన మోటార్ వుండి ఎక్కువ సమర్థతకి తోడ్పడుతుంది

ప్రీ-లోడింగ్ విధానంతో డబుల్-బాల్ బేరింగ్‌లు అదుగుదలని, శబ్దాన్ని అరికట్టాయి



అంతేకాక యంత్రసహాయంతో రాగితీగ చుట్టిన స్టేటర్, 127 మిమి వెడల్పయిన అల్యూమినియం బ్లేడ్ విడిభాగాలు కలసి 32% ఎక్కువ సమర్థతని, ISI వివరణలకన్నా 10% ఎక్కువ గాలిని యిస్తూ 30% తక్కువ విద్యుత్‌ని వినియోగిస్తాయి ఆకర్షణీయమైన రూపకల్పన, సరిగ్గా సరిపోయే రెగ్యులేటర్‌లతో సాటిలేని ఫాన్ ISI ముద్రతో 5 సంవత్సరాల గ్యారంటీ వున్న ఫాన్

* ఇచ్చిన వివరాలు ఖేతాన్ ప్రీమియమ్ 1200 మిమి (48") స్వీప్‌కి సంబంధించినవి

**ఖేతాన్** వాస్తవంగా సర్వశ్రేష్ఠమైన ఫాన్

తీసుకుంటానంటే, 'ఆ అదేం బాగుంటుంది... నీకేం తెలుసు' అంటూ నా మాట పడనివ్వక, నా కిష్టంలేని చీర కొనేటట్టుచేసింది కొడుకు చేత ఏం నాకామాత్రం స్వతంత్రం లేదా. ఇన్నాళ్ల జీతం సంపాదనలో మిగిల్చింది యేంజేసారు. కూతురికి దోచిపెట్టుకుంటూంది. ఆవిడ పెట్టేదిగాక, మేమూ యింకా పెట్టలేదని యేడుపు. మాకేం లక్షలు మూలిగివున్నాయా. కలసివున్నప్పుడు వక్క పని చేసేదిగాదు. ఇతర్ను చేసింది నచ్చేదికాదు. ఆవిడతో యెవరూ పడలేరు. నేనుగాబట్టి అమాత్రమన్నా సర్దుకున్నాను. నా వల్లగాకే, వాళ్ల తిప్పలేవో వాళ్లను పడ మన్నాను. మా తిప్పలు మేము పడుతున్నాము. అయినా యింకా యేడుపు. దేనికి! మేమేదో కాస్త బాగున్నామని తాను కూతురికి యింకా యింకా దోచిపెట్టలేకపోతున్నానని'' వాక్ప్రవాహం చాలా వుధృతంగా వుంది. చూపులు తీక్షణంగా వున్నాయి. ముఖంలో ఆవేశం తాండవిస్తోంది. సమరానికి సన్నద్ధమయిన వీరనారిలా వుంది, కళ్యాణి.

ప్రవాహం యింకా వుధృతమయితే, దుష్ఫలితాలు కలిగే సూచనలు కనింపిచాయి, శాంతమ్మకు. ''ఆ...ఎందుకు... దాని ఛాదస్తం కాకపోతే.. ఏదో యింత తిని వకమూలన పడి వుండక...బంగారం లాంటి కోడలుతో వైరం. పోనివ్వమమ్మా దాని యేడుపు దాన్నేడవనీ. నవ్వేవాళ్ల అదృష్టమేమని యేడ్చే వాళ్లను యేడవనీ అని సినిమా పాట కూడా వుంది గదా...''వాతావరణాన్ని తేలిక చేయటానిగ్గాను, తన మాటలకు తనే నవ్వుతూ, అక్క చర్యను నిరసించి, కోడలి మెప్పుకోసం, కోడలికే వోటు వేసింది శాంతమ్మ.

''వస్తానమ్మా టయిము అయిదవుతోంది'' అంటూ లేచింది శాంతమ్మ.

''ఉండత్తయ్యా ... రాత్రికి వుండి... రేపు వెళుదురుగాని'' తనూ సోఫాలోంచి లేచింది కళ్యాణి.

''వద్దులేమ్మా. ఈసారొచ్చినప్పుడు వుంటానులే''

''పోనీ రాత్రికి భోం చేసి 8.00 గంటలకు వెళ్ళొచ్చులే అతయ్యా సిటీ బస్సులు వుంటాయి కదా ..'' ఆప్యాయితతో కూడిన వత్తిడి కళ్యాణి మాటలలో కనిపించిందింది

''లేదులే అమ్మాయి'' అంటూ రెండడుగులు వేసింది శాంతమ్మ.

''పోనీ వుండండి...వుండమంటే వుండటం లేదు '' అంటూలోని కెళ్ళి వచ్చింది కళ్యాణి. శాంతమ్మకు బొట్టు పెట్టి, జాకెట్టు గుడ్డ శాంతమ్మ చేతిలో పెట్టింది.

''ఎందుకమ్మ...నీ ఆప్యాయతలే చాలు... వస్తానమ్మా'' అంటూ పిల్లలకు తలావక ముద్దిచ్చి బయటకు నడిచింది.

''ఏంటమ్మా ... ఇంతసేపయింది ... '' ఇటోకి వస్తున్న తల్లిని చూసి, పలకరింపుగా అన్నాడు ఆనందమోహన్.

''ఎక్కడరా.. మీపెద్దమ్మగారింటికి వెళ్ళానా ఆవిడతో కాసేపు మాట్లాడాక, నీ వదిన అదే గిరిప్రసాద్ భార్య కళ్యాణి, వొకటే బలవంతం 'వుండత్తయ్యా, వుండత్తయ్యా' అంటూ వకటే యిదయిపోయింది. ఈరాత్రికి వుండమని మరీ మరీ బలవంతం చేసింది. ''వద్దమ్మా వెళతాను, ఈసారొచ్చినప్పుడుంటానులే'' అని చెప్పి వొప్పించేటప్పటికి నా తాతలు దిగివచ్చారు ఏమి ఆప్యాయత, ఏమి అభిమానం...'' మంచం పై కూర్చుని అరచేతిని క్రిందకుపైకి ఆడిస్తూ చెబుతున్నది శాంతమ్మ. తన కోడలు సుమిత్ర కూడా అక్కడే వుంది. ఆవిడ వినాలనే వుద్దేశ్యం తోనే తన కోడలుకూడా అలాగేవుండాలని తెలియ జేస్తూ, అలా మాట్లాడింది శాంతమ్మ. అత్త చెబుతున్న మాటలకు మూతి మూడువంకర్లు త్రిప్పుకున్న కోడలు సుమిత్ర మొహం మాత్రం శాంతమ్మకు కనిపించలేదు.

కొడుకు వున్న యింటిని చూస్తున్న శాంతమ్మ, తన యింటిని, తన దర్జాను, స్థితిని తలచుకుని, కళ్యాణి యింటి స్థితిని, హోదాను గుర్తుకు తెచ్చుకుని, రాజును చూసిన కళ్లతో మొగుడ్ని చూస్తే మొత్తబుద్ధయిందన్న స్థితిలోకి వచ్చింది ఆనంద్‌మోహన్ తత్వం చాలా నిరాడంబరమైనది. ఖరీదయిన ఫర్నిచర్ వుండాలని గాని, దర్జాగా వెలగాలనిగాని వుండదు తన సంపాదనకు తగినస్థాయి యెంతో తెలుసుకుని అందుకుతగ్గట్టు బ్రతకడమే, అతనికి ఆనందం. నాలుగు కుర్చీలు, రెండు మంచాలు, వక రేడియో, వక ఫాన్. అతని కనీసావసరాలను తీర్చుతున్నాయి. ఒక గది, మరో అర్థ గదితో కూడిన యిల్లు చాలనుకున్నాడు. సరిపుచ్చుకున్నాడు. ఒక అమ్మాయి, వక అబ్బాయి చాలనుకున్నాడు. ఇక కనడం ఆపేశాడు. తండ్రి దగ్గర డబ్బున్నా, అడిగి, పొంది, అనుభవించాలనే అత్యాశలేదు అతనికి.

''ఈ చిన్న యిల్లేమి సరిపోతుందిరా— మరో గది వుంటే బాగుండేది—ఏంఅమ్మాయి?'' కొడుకును అడుగుతూ, కోడలి సమర్థింపు కోరుతూ అంది శాంతమ్మ.

''ఇదే యెక్కువయ్యిందంటున్నదే నీ కోడలు...'' నవ్వుతూ, అత్తా కోడళ్లకు అంటించాడు ఆనంద్ మోహన్.

''నాదేముంది. తీసుకోండి మరో పెద్ద యిల్లు. మీ అమ్మగారు చెబుతున్నారుగా'' మీ అమ్మ మాటే మీరు వింటారనే చిన్న నింద, ఆ మాటల్లో ధ్వనింపజేస్తూ అంది సుమిత్ర.

''చూద్దాములే. ఇవ్వాళే ఒక భాగ్యలక్ష్మిని కొన్నాను...'' నవ్వుతూ భార్య ముఖంలోకి చూశాడు ఆనందమోహన్.

''కొంటారు. ఎందుకు కొనరు అలాంటి వాటికి మాత్రమే తగలేస్తారు. నేనేదన్నా చెబితే మాత్రం, వంద చదువుతారు '' రుసరుసలాడింది- సుమిత్ర.

'వీళ్ల గొడవతో నాకేమిటి పని ' అనుకుంటూ వకచేతి బంగారం గాజులను, మరొక చేతితో తడుముకుని, లోలోపల మురిసిపోతోంది శాంతమ్మ. అత్తగారు గాజులు తడుముకోవడం చూసిన సుమిత్రకు, తన మట్టి గాజులను, భళ్లున బ్రద్దలుకొట్టాలన్నంత కోపం, అసూయ కలిగాయి.

''ఏమిటా దిక్కులు చూడటం. చదువు కోక. చదువుకుంటేనే కాస్త తిండి దొరుకు తుంది. లేకపోతే అడుక్కుతినాల్సిందే.'' తన అక్కసును, కోపాన్ని, పిల్లలపై చూపి, మనసులోని బరువును తగ్గించుకుంది సుమిత్ర.

నెమ్మదిగా, తీరుబడిగా, ఎదుటివాళ్లకు నొప్పి కలిగేటట్టుగానో, కలిగీ కలగనట్టుగానో మాట్లాడటం చేతనవునుగాని, రణరంగానికి తయారుకావటంమాత్రం చేతకాదు శాంతమ్మకు. అనువుగానిచోట అస్త్రసన్యాసం చేయటం, ఆవిడకు బాగా తెలుసు.

ఆ రాత్రి గడిచింది. తెల్లవారింది. సుమిత్ర అందరికీ కాఫీలు కాచి యిచ్చింది. శాంతమ్మ యింకా నిద్ర లేవలేదు అత్తగారికి కాఫీ విడిగా గ్లాసులోపోసి, మూతపెట్టి వుంచింది సుమిత్ర. శాంతమ్మ నిద్రలేచేటప్పటికి సుమారు ఏడు గంటలయింది. లేచి కాలకృత్యాలు తీర్చుకోవ టానికిగ్గాను దొడ్లోకెళ్లింది.

''సుమిత్రా అమ్మకు కాఫీ వేడిగా వుండాలే.

## అంధ న్యాయవాది!

జపానులో యోషిక్ టకెషిడా అనే అంధుడు న్యాయవాది కాబోతున్నాడు. ఈయన వయసు 32 సంవత్సరములు. ఈయన ఇటీవలె రెండు సంవత్సరాల న్యాయవాది శిక్షణని పూర్తి చేశాడు. ఈయన మైసూరులో చదువుకునే రోజుల్లో అంధత్వం వచ్చింది. 1982లో న్యాయశాస్త్ర పరీక్షలలో ఉత్తీర్ణుడైన మొదటి అంధ విద్యార్థి కూడా ఇతడే. టోక్యో సుప్రీంకోర్టులోని పరిశోధనా శిక్షణ సంస్థలో న్యాయ శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. క్యోటోలో శిక్షణ తరగతులను పూర్తి చేశాడు. అతని భార్య కూడా, పత్రాలని చదవటంలో బ్రెయిలీ భాషలోకి అనువదించటంలో తోడ్పడింది. వికలాంగుల కేసులని, సంక్షేమ పథకాల కేసులని చేపట్టాలని ఆయన అనుకుం టున్నాడు.

వేడిచెయ్యి.'' ఏదో వ్రాసుకుంటూ అన్నాడు ఆనంద్‌మోహన్.

చిరాగ్గా వుంది సుమిత్రకు. తన యెదుటే, తన అత్త వేరే యింటికోడలిని పొగడటం, ఆవిడి గారి దర్జా, పెద్ద యిల్లు తీసుకోమని ఆవిడ యిచ్చిన సలహా, ఆవిడ తన బంగారు గాజులను తడుముకోవటం, గుర్తుకొస్తున్నాయి.

''నేనేం కాయలేను. ఇప్పటికి రెండుసార్లు వెచ్చబెట్టాను. ఘడియ, ఘడియకు వక్కొక్కళ్లు వస్తుంటే, యెంతకని చేసేది. అందరితోపాటు లేస్తే బాగుంటుంది. కాని, యెప్పుడో తీరుబడిగా లేస్తే నేనెక్కడ చేయగలను'' చిరాకు, అత్తగారిమీద అలక్ష్యం, ఆ మాటల్లో కనిపిస్తున్నాయి. మాటల్లోనేగాక చేతల్లోనూ ఆ కోపాన్ని కసిని ప్రదర్శిస్తూ, నూనెలో వేగుతున్న కూర ముక్కలను, అటు యిటు పొడిచి, వాటి వళ్లు హూనం చేస్తోంది సుమిత్ర.

''సర్లే చిన్నగా... వింటుందన్న జ్ఞానం కూడా లేదు.'' రణరంగం కాకుండా జాగ్రత్త పడుతున్నాడు ఆనంద్‌మోహన్

వినినా లెక్కలేనట్లుగా వక్కచూపు చూసి, తల త్రిప్పకుంది సుమిత్ర. అత్తగారు తాననిన మాటలను, వినాలని అనుకున్న సుమిత్రకు, కోరిక నెరవేరింది. దొడ్డికెళ్లివస్తూ, కోడలి గొంతువిని, గోడదగ్గఱ ఆగి, మరీ విన్నాది శాంతమ్మ. తన గురించి యెవరేమి అనుకుంటారో వినాలనే కోరికతో, గోడచాటుగా వుండి వినటం, ఆవిడకు అలవాటే. కాసేపు ఆగి, ఏమీ విననట్లుగా, తెలియనట్లుగా వచ్చి మౌనంగా మంచంపై కూర్చుంది. 'ఎలాంటి కోడల్ని యిచ్చావురా దేముడా' అని మాత్రం ఎకసారో, రెండుసార్లో మనసులో అనుకుంది.

ఆ సాయంత్రం, దగ్గఱలోనేవున్న తెలిసిన వాళ్ల యింటికి, వెళ్లివస్తానని వెళ్లింది శాంతమ్మ. వక గంటసేపు కాలక్షేపం చేసి,తిరిగి తన కొడుకు యింటికివచ్చింది. వసారాలోకి వచ్చిన శాంతమ్మకు, లోపల గదినుంచి కోడలి గొంతు వినిపిస్తోంది. తన గురించే చెబుతుందేమో, విందామని చప్పుడు కాకుండా, వసారాలోనున్న కుర్చీలో కూర్చుని, చెవులప్పగించి వింటూ వున్నది.

''తీసుకోండత్తయ్యా... ఎప్పుడూ రారు మీరు. ఈ మైసూరుపాక్ నేనే చేసాను. ఎలా వుందత్తయ్యా ?'' తన కోడలు ఎవరినో అడుగుతోంది.

''చాలా బాగుందమ్మా . బాగాకుదిరింది'' లోపలున్న అత్త తన కోడల్ని పొగుడుతోంది ''ఎందుకు బాగుండదు'' మూతి విరుచుకుంది బయటనున్న అత్త.

''కారప్పూస తీసుకోలేదత్తయ్యా . . '' లోపలున్న అత్త తిననందుకు, సుమిత్ర బాధ పడుతోంది.

''చాలమ్మా ... ఎక్కువ తినలేను ...'' తినాలని వున్నా, తినలేని స్థితి తనకున్నందుకు బాధ పడుతున్నది లోపలున్న అత్త.

''ఏమి రోగమో ... తినలేదట'' మనసులోనే గొణుక్కుంది, బయటనున్న అత్త.

''మీ అత్తగారి స్థితి చాలా బాగున్నట్లుంది. రెండు చేతులకు, చెరి నాలుగు బంగారు గాజులు, మెళ్లోనగలు, ఆవిడ దర్జాయే చూసుకుంటుందా? మీకేమైనా పెట్టేది, చేసేది యేమైనావుందా'' ఎదుటి మనిషి బలహీనతను పట్టుకుని, దానిపై సుత్తిపెట్టి గట్టిగా కొట్టడం చేతనయిన మనిషిలా వుంది ఆ నకిలీ అత్తయ్యగారు.

''ఏమిటత్తయ్యగారూ ... మీకు తెలియనట్లే మాట్లాడతారు ఎంతసేపూ ఆవిడ చేతుల బంగారుగాజులు చూసుకుంటూ, తడుముకుంటూ 'నగలు చూడు నన్ను చూడు' అంటూ లేనివాళ్లను వూరించటమే ఆవిడపనిగాని, ఒక ముద్దూ, ముచ్చటా? కొడుకుమీదే ప్రేమలేదు. యింకా కోడలు, మనవలు, చట్టుబండలూను. వచ్చేటప్పుడు, చిన్నపిల్లలు యెదురొస్తారుకదా. ఏ పండో, ఫలమో తెద్దామన్నా జ్ఞానముందా! చేతులూపుకుంటూ వచ్చింది. ఏం చచ్చేటప్పుడు కట్టుకుపోతుందా. అంత ఆస్తివుంది. ఏం కాస్త యివ్వకూడదా. సాయం చేయకూడదా. ఆవిడ అలా చేస్తే, పిల్లాడ్ని శుభ్రంగా ఏ కాన్వెంటులోనో చదివించేవాళ్లంగామా. వాడికి కాన్వెంటు చదువు చెప్పించటానికి, మాకు స్తోమత లేకేగదా గవర్నమెంటు బడిలో చదివిస్తున్నాము. ఆ లక్ష్మిందేవమ్మగారు చూడండి. కొడుకు పిల్లల్ని, పెళ్లాల్ని సరిగ్గా చూడక పోయినా, ఎంచక్కా, మనవడ్ని పబ్లిక్ స్కూల్లో ఇంగ్లీషు మీడియం చదువు చెప్పిస్తోంది. మా అత్తగారూ వున్నారు ... అనకూడదుగాని ... '' కళ్లు వత్తుకుంటూ, ఈసడింపుగా, మనసులో అత్తగారిపై నున్న యేవగింపును బయటకు కక్కుతోంది సుమిత్ర.

''ఎంతసేపూ కూతుళ్లకు ముట్టజెప్పటం, అల్లుళ్లను అందల మెక్కించడమే పనిగాని, కొడుకులున్నారు. వాళ్లనీ చూద్దాము. వాళ్లూ నాకు సమానమేగదా అనే మాటేలేదు ఆవిడకు. ఈ కొడుకులూ వున్నారు. ఎందుకూ ! నోట్లో నాలికలు లేకుండా'' సుమిత్ర క్రోధానలము, నింగి కెగురుతోంది.

ఈ వేడిని యింకా రెచ్చగొట్టడం మంచిది కాదనుకుందేమో ''పోనివ్వమ్మా, ఎవళ్లపాపాన వాళ్లే పోతారు. నీకేం నువ్వు తెలివిగలదానివి. నీ సంసారాన్ని చక్కగా సరిదిద్దుకునే నేర్పు నీకుంది. మరి నేను వస్తానమ్మా, ప్రొద్దుపోయింది'' అంటూ లేచింది లోపలున్న అత్తగారు.

''కూర్చోండత్తయ్యా .. ఎప్పుడోగాని రారు ..'' ఆప్యాయతతో కూడిన బలవంత కనిపిస్తోంది సుమిత్ర మాటలలో.

''లేదమ్మా .. వస్తూవుంటాను కదా వస్తాను.''

''ఈ మైసూరుపాక్‌లు నా అల్లుడు వేణుకివ్వండత్తయ్యా...''

లోపలనుంచి, లోపలున్న అత్తగారు బయటకు వస్తున్న శబ్దం వినిపించి, బయటనున్న అత్తగారు, కుర్చీలోంచి లేచి, అప్పుడే బయటనుంచి వస్తున్నదానిలా, లోపలకు వెళ్తోంది

''ఏమిటత్తయ్యా.. ఇప్పుడేవస్తున్నారా...'' తన మాటలు విన్నదేమోననే సంశయంతో, పలకరించింది సుమిత్ర.

''ఔనమ్మా'' అంటూ బయటనున్న అత్తగారు లోపలకు, ''వస్తానమ్మా'' అంటూ, లోపలున్న అత్తగారు బయటకు వెళ్లిపోయారు. ●



కొత్త సీరియల్ ప్రారంభం

# ఈ దాగానికదే తా

చక్కిలం విజయలక్ష్మి




ఎనామిల్ పెయింట్ చేసిన గేట్ కిరువైపులా, గోడల్లో తాపిన తెల్లని పాలరాతి ఫలకాలమీద, బంగారు రంగులో 'ఎ. రఘునాథరావు. ఇండస్ట్రియలిస్ట్, హైదరాబాదు' అన్న అక్షరాలు తళతళా మెరిసి పోతున్నాయి.



**గేటు నుండి పోర్టికో వరకు వున్న సన్నటి సిమెంటు బాటకు ఇరువైపులా త్రికోణాకారంలోని తెల్లని రాళ్ల లైనింగ్‌తోపాటే పెరిగిన జినియాలు.**

**జినియాలతోపాటు అక్కడక్కడా రెండు వైపులా పెంచిన బోగన్ విలియాలు గుండ్రని ఆకారంలో కత్తిరించబడి పూల గుమ్మటాలన్న భ్రాంతిని కలిగిస్తున్నాయి.**

లోపలివైపు కాంపౌండ్ వాల్ పొడవునా హైబ్రిడ్ కొబ్బరి చెట్లు నాటబడి వున్నాయి ఇంటి ముందు భాగమంతా అందమైన క్రోటన్లు, పూల మొక్కలు చోటుచేసుకోగా, ఇంటి కిరు వైపులా ఫలవృక్షాలు, వెనుక భాగాన కాయగూరల మొక్కలు పెంచబడ్డాయి.

అక్కడక్కడా రౌండ్ షేప్‌లో లైనింగ్ వేసి పచ్చిక పెంచారు కత్తిరించబడిన పచ్చిక లాన్స్ పచ్చని తివాసీల్లా ఆహ్వానిస్తున్నట్లుగా వున్నాయి ఇంటికి వాయువ్య మూలకు కొంత గ్రౌండ్ చదునుచేసి ఆటలకోసం కోర్టు తయారుచేశారు మొత్తంమీద అభిరుచిగల ఇంటి యజమాని, అనుభవజ్ఞుడైన తోటమాలి మేలు కలయికకు చిహ్నంగా వుంది ఆ ప్రదేశమంతా.

సమయం దాదాపు ఒంటిగంట విరబూసిన నందనవనం మధ్య సేద తీర్చుకుంటున్న తెల్లని ఐరావతంలా ఎండకు కళ కళలాడిపోతున్న ఆ

భవనం గేట్లోంచి దూసుకు వచ్చి విశాలమైన పోర్టికోలో ఆగింది కారు.

డ్రైవర్ దిగి డోర్ తెరచి పట్టుకోగా, రఘునాథరావు గారు హుందాగా కారు దిగారు. ఏభై ఏళ్లు దాటినా నలభై ఏళ్ల వాడిలా దృఢంగా వున్న ఆయన కళ్లలో సంపన్నత్వంతో పాటు సాత్వికత కూడా వుట్టి పడ్తోంది. చెంపల దగ్గిర నెరిసిన జుట్టు, బంగారు ఫ్రేం కళ్లజోడు ఆయన ఆకారానికి తగిన గాంభీర్యాన్ని తెచ్చిపెట్టగా, పెదిమల మీద చెరగని చిరునవ్వు ఆ గాంభీర్యానికి వన్నె తెచ్చింది.

కొద్దిగా వంగి, కార్లోకి చూస్తూ మృదువుగా అన్నారు "రా, జయంతీ".

తెల్లగా, బక్క పల్చగా వున్న ఇరవై ఏళ్ల అమ్మాయి జాగ్రత్తగా కార్లోంచి దిగి, తల వంచుకుని నిలబడింది.

"ఇదే మన ఇల్లు"

తల ఎత్తి చూసింది జయంతి.

బ్రహ్మాండమైన బంగళా!

ఒక్క క్షణం గుండె జలదరించింది జయంతికి. కొంచెం అసంతృప్తిగా కూడా అనిపించింది.

తానొక చిన్ని మల్లెపూవు. ఈ పెద్ద గులాబీ తోటలో తన ఉనికి సాధ్యమా? ఏ గులాబీ ముల్లుకో గుచ్చుకుని......

అన్ని విరులనూ సమానంగా ఆదరించే వనమాలిలా చిరునవ్వు నవ్వుతూ "లోపలికి వెళ్దాం రా" అన్నారు రఘునాథరావుగారు.

ఇంటికి మూడు వైపులా వున్న వరండా పొడవునా పై నుంచి వేళ్లాడదీసిన జేగురు రంగు కుండల్లోంచి తొంగి చూస్తున్న టేబుల్ రోజాలు జయంతికి స్వాగతం పలికాయి.

# ఈ రాగానికదే తాళం

వరండా దిగువన మెట్లకు ఇరువైపులా పెరిగి, పైకి పాకి పై అంతస్తులో ఎక్కడో పెనవేసుకు పోయిన మల్లె మాలతులు పలకరింపుగా జయంతిని స్పృశించాయి.

పాదాలు జారిపోతాయేమో నన్నంత నున్నగా మెరిసిపోతూన్న మొజాయిక్ ఫ్లోరింగ్ మెట్లు ఎక్కి, రఘునాథరావుగారి వెనక వరండాలోకి వచ్చింది జయంతి.

తెల్లని దిండ్లు వేసిన ముదురు ఆకుపచ్చ రంగు పేము కుర్చీలు వరండాలో రెండువైపులా వేసి వున్నాయి. ఎదురుగా పెద్ద రోజ్ వుడ్ తలుపుకు మధ్యలో హృదయం ఆకారంలో పెద్ద గాజు పలక అమర్చారు. కెమెరా కన్నులోంచి కనిపిస్తూన్న సినిమా సెట్టింగులా ఆ అద్దం లోంచి హాలు అందంగా, ఆడంబరంగా కనిపిస్తోంది.

పనివాళ్లు వురుకులు పరుగులతో వచ్చి తలుపు తీశారు. జయంతిని వెళ్లమన్నట్లుగా సౌంజ్ఞ చేసి, వెనకే ఆయనా ఇంట్లోకి వచ్చారు.

హాలు మధ్య అమర్చిన సోఫాలో కూర్చుంటూ జయంతిని కూర్చొమ్మన్నట్లుగా చేయి చూపారు.

మరో సోఫాలో కూర్చుంది జయంతి.

వాచ్ చూసుకుంటూ అన్నారు "ఇప్పుడు ఒంటిగంట అయింది. మేత కోసం పక్షులన్నీ గూటికి వస్తాయి— కొన్ని రాకపోయినా ఆశ్చర్యం లేదు."

"పక్షులా!!" ఆశ్చర్యంగా అడిగింది జయంతి.

పదిహేను రోజుల్లో కొత్తపోయి కాస్త మాట్లాడే చనువు కుదిరింది జయంతికి.

బొబ్బిలి శ్రీ కళాభారతివారు త్యాగరాజ ఆరాధనోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేసిన నృత్య ప్రదర్శనలో ఒక దృశ్యం.



నవ్వుతూ "ఆ. పిల్ల పక్షులు. అదిగో తల్లి పక్షి" అన్నారు.

చటుక్కున ద్వారం కేసి చూసింది జయంతి.

ఓ నడి వయసు స్త్రీ కారుదిగి హుందాగా నడిచివస్తోంది. రఘునాథరావుగారిని చూడగానే "ఓహో! ఎక్కడికి వెళ్తే అక్కడ కాపురం పెట్టడమేనా!" అంది కోపంగా.

"నేను... ఇప్పుడే వచ్చాను" అన్నారు రఘునాథరావుగారు చిరునవ్వుతో.

ఆవిడా నవ్వి "మిమ్మల్ని చూడగానే కోపాన్ని ఆపుకోలేకపోయాను" అంది.

"ఆవిడ కోపం అంటే ఆవిడ ప్రేమ అని అర్థం" రహస్యంగా జయంతికి చెప్పారు రఘునాథరావుగారు.

అప్పుడు జయంతి కేసి చూసిన ఆవిడ "ఈ అమ్మాయి..." అంటూ ఆగిపోయింది.

'ఔను' అన్నట్లుగా తల వూపారు.

ఆమె ముఖంలో సంతోషం చిందులు వేసింది. జయంతి దగ్గరకు నడిచి ఆ అమ్మాయి తలమీద చేయి వేసింది. ఆమె స్పర్శలో ఏదో చల్లదనం తోచిన జయంతి చటుక్కున లేచి నిలబడి ఆవిడ కళ్లలోకి చూస్తూ చేతులు జోడించింది. ఆవిడ కళ్లను ఏవో జ్ఞాపకాల తెరలు అరమోడ్పులు చేశాయి. రెండు క్షణాల తర్వాత తేరుకుంటూ, జయంతి జోడించిన చేతులను పట్టుకుంటూ "లోపలికి వెళ్దాం రా. స్నానం చేసి భోంచేద్దువుగాని. మీ మామయ్యకు వచ్చిన పిల్లను కాస్త ఇంట్లోకి పంపాలని కూడా తెలీదు" అంది.

"సుమిత్రా! నీకింకా గుర్తుందా!?" అన్నారు రఘునాథరావుగారు.

"బాగుంది! కోడలు కోడలుగా గుర్తుండక కూతురుగా గుర్తుంటుందా?" అంది సుమిత్రమ్మ.

నిట్టూర్చారు రఘునాథరావుగారు.

"ఇక జయంతికి నీవు తల్లివి కూడా కావాలి."

"అంటే!" ఆశ్చర్యంగా, అనుమానంగా అడిగింది సుమిత్రమ్మ.

అప్పటికే జయంతి ముఖంలో నీలినీడలు వ్యాపించాయి. ఓర కంట అది గమనించిన రఘునాథరావుగారు "సరి. నీవు వెళ్లి ఏర్పాట్లు చూడు. పరిచయాలింకా పూర్తి కాలేదు. జయంతి ఇంకాస్సేపు ఇక్కడే వుంటుంది" అన్నారు నవ్వుతూ.

"అలాగే" అంటూ సుమిత్రమ్మ లోపలికి వెళ్లిపోయింది.

"కూర్చో. ఈవిడ మీ అత్తయ్య సుమిత్ర. చిటపటలు, చిరునవ్వుల కలపోత."

రఘునాథరావుగారితో పాటు జయంతి కూడా చిన్నగా నవ్వింది.

అంతలో జెట్ విమానంలా మరో కారు

వచ్చి పోర్టికోలో ఆగింది. షూటింగ్ నుంచి తిరిగి వచ్చిన సినిమా తారలా వున్న ఓ యువతి హైహీల్డ్ జోళ్ళు టకటక లాడించుకుంటూ లోపలికి వచ్చింది. అప్పుడే పనివాడు జయంతి తాలూకు సామాన్లు కార్లోంచి తెస్తున్నాడు. హాల్లో కూర్చున్న రఘునాధరావుగారిని, జయంతిని, లోపలకు వస్తూన్న జయంతి పాత ట్రంకు, పరుపు చుట్టను చూసి చిరాకుగా నుదురు చిట్లిస్తూ హాల్లోని మెట్ల మీదుగా చకచక పైకి ఎక్కిపోయింది!

ఆమె మొదటి మెట్టుమీద కాలుపెట్టినప్పటి నుండీ పైకి వెళ్లేదాకా ఆదుర్దాగా ఆమెనే చూస్తూ వుండిపోయారు రఘునాధరావుగారు. ఆ తర్వాత నిట్టూరుస్తూ, జయంతి కేసి తిరిగి "ఈ ఇంటి కోడలు, పద్మిని. లక్ష రూపాయలను ఇంపాలా కారులో తెచ్చుకున్న సంపన్నురాలు ప్రస్తుతం గర్భవతి" అన్నారు.

ఆశ్చర్యపోయింది జయంతి.

మామగారు పదిహేను రోజుల తర్వాత ఇంటికి రాగా పలకరించకుండా పోయినందుకో, గర్భవతియై వుండీ విడిమనిషిలా మెట్లమీది నుంచి పరిగెత్తిపోయినందుకో, లక్ష రూపాయలు, ఇంపాలా కారు కట్నం క్రింద తెచ్చుకున్నందుకో మరి!

జయంతి ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే రెక్కలులేని పక్షిలా వచ్చి ఆగింది స్కూటర్. వెనక సీట్‌లో కూర్చున్న ఓ టీనేజ్డ్ గర్ల్ చెంగున దూకి హాల్లోకి పరిగెత్తుకు వచ్చింది.

మాయా దర్పణంలో ఒకటి తర్వాత ఒకటి కనిపిస్తూన్న దృశ్యాల్లా తలుపుకున్న అద్దంలోంచి ప్రత్యక్షమౌతూన్న ఒకరొకర్నీ ఆశ్చర్యంగా చూస్తోంది జయంతి.

ఆ వచ్చిన అమ్మాయి హాల్లో కూర్చున్న ఇద్దర్నీ చూసింది. ఆశ్చర్యంతో కళ్లెగరేస్తూ "వాట్ ఎ స్ట్రేంజ్ బ్యూటీ! ఎవరు డాడీ ఈ అమ్మాయి?" అంటూ తండ్రి దగ్గరకు వచ్చింది.

"మీ అమ్మకు కోడలు" అన్నారు ఆయన.

కిల కిల నవ్వింది ఆ అమ్మాయి.

"అమ్మకు కోడలు. మరి మీకు . ?"

ఆయనా నవ్వుతూ "నాకేమోగానీ నీకు మాత్రం వదిన" అన్నారు.

జయంతి కేసి పరిశీలనగా చూసింది ఆ అమ్మాయి.

మామూలు నేత చీరె, ఒదులు జాకెట్టు, బిగువైన జడ, సోఫా ముఖం ఎరుగని దానిలా ఒదిగి కూర్చోవటం...

'నో డౌట్. ఎ సింబల్ ఆఫ్ బ్యూటీ. బట్— ఈ వేషం అదీ... ఉహూ.. నమ్మ శక్యంగా లేదు' అన్నట్టుగా ముఖం పెట్టింది.

"వెళ్లు. వెళ్లి భోంచెయ్" అన్నారు రఘునాధరావుగారు.

చెంగు చెంగున ఎగురుతూ ఇంట్లోకి వెళ్లిపోయింది.

కూతురు వెళ్లిపోయిన దెసకు ప్రసన్నంగా చూస్తూ "మా అమ్మాయి. గీత" అని పరిచయం చెప్పారు.

స్కూటర్ ఆఫ్ చేసి, పుస్తకాలు తీసుకుని స్కూటర్ తాళాలు వేళ్లతో తిప్పుతూ, ఈల వేస్తూ లోపలికి వచ్చాడు ఇరవై రెండేళ్ల యువకుడు. చాక్‌లెట్ కలర్ పాంటుతో అదే కలర్ గీతలున్న తెల్లని షర్ట్ ఇన్‌షర్ట్ చేసి, నీట్‌గా, కోల ముఖంతో సన్నగా, పొడుగ్గా చాలా అందంగా వున్నాడు.

హాల్లో కూర్చున్న రఘునాధరావుగారిని చూసి ఈల ఆపి వేశాడు పలకరింపుగా కనీ కనిపించని నవ్వు నవ్వి, పరిగెడుతున్నట్లుగా పైకి వెళ్లిపోయాడు. పక్కన కూర్చున్న జయంతి కేసి కళ్లు కూడా తిప్పలేదు.

"ఈ అబ్బాయి..." అంటూ చిన్నగా నవ్వారు రఘునాధరావుగారు.

'ఈ అబ్బాయి ?' ఆతృతతో గుండెలు వేగంగా కొట్టుకున్నాయి జయంతికి. కను రెప్పలు రెపరెపలాడుతూండగా రఘునాధరావుగారి కేసి చూసింది.

"వాడే... మన్‌మోహన్"

ఒక్క క్షణం గుండె ఆగినట్లయింది జయంతి. కను రెప్పలు బరువెక్కి కళ్లు వాలిపోయాయి. చూపులు వాటి కింద ఒదిగిపోయాయి. ఉద్వేగంతో గుండెలు ఎగిసిపడ్డాయి.

ఆ నవ మన్మధుడు .. ఆ నవ యువకుడు . మన్‌మోహన్! తన... తనకు .!

"ఎప్పుడొచ్చారు నాన్న ?"

ఉలికిపడింది జయంతి.

కళ్లెత్తి చూసింది. ఎప్పుడొచ్చాడో మండు టెండలో నిశ్శబ్దంగా వచ్చిన పిల్ల తెమ్మెరలా వారి ఎదుట నిలబడి వున్నాడు ఇరవై ఆరేళ్ల యువకుడు.

చామన ఛాయతో, బలిష్టంగా వున్నాడు. పైజమా, లాల్చీ, ఆకు చెప్పులు, చెదిరిన జుట్టు, అలసటతో నుదుట పట్టిన చెమట, చల్లని చిరునవ్వు!

"ఇప్పుడే వచ్చాము హరీ".

"ఈ అమ్మాయి..."

"మన బంధువులమ్మాయి. నీకు మరదల వుతుంది. పేరు జయంతి".

"అలాగా"

జయంతి లేచి నిలబడి నమస్కరించింది.

ప్రతి నమస్కారం చేశాడు హరి.

ఇంతలో పై నుండి కేకలు వినిపించాయి. ఎవరిదో స్త్రీ కంఠం. పని వాళ్ల మీద కేకలు వేస్తున్నట్లుంది.

"జయంతీ, నీవిక లోపలికి వెళ్లు" అన్నారు రఘునాధరావు గారు.

## 2

రాత్రిచాలా ప్రొద్దుపోయాక ఆఫీసుగదిలోంచి బయటపడి పడగ్గదిలోకి వచ్చారు రఘునాధరావు గారు.

గోడ గడియారం వంక మాటి మాటికీ చూస్తూ విసురుగా పచార్లుచేస్తున్న సుమిత్రమ్మ భర్తను చూడగానే మండి పడింది.

"ఊరికి వెళ్తే వచ్చినరోజు పెందలాడే పడగ్గదిలోకి రావాలని ఎన్నిసార్లు చెప్పాను మీకు ? " ఉరిమింది.

"మనమింకా పడుచు వాళ్లమే నంటావ్?"

"ఉష్! ఏమిటా మాటలు ? పిల్లలింకా మేలుకునే వున్నారు."

"ఏం ? నీవా మాటంటే లేని తప్పు నేను.. "

"నే నన్నది వేరు వుద్దేశం. ఊరి విశేషాలు



చెబుతాం మానన త్యంగా అబ్బుల్ని రమ్మంటాను.''

''నీవన్నది నిజమే. కానీ వూరికి వెళ్ళినన్నాళ్ళ పనీ పెండింగ్‌లోనే వుంటుంది కదా ? వచ్చాక అదంతా మళ్ళీ నేనే చూసుకోవాలి కదా ?''

''సర్లెండి. ఇది పాత పాటే. ఇంతకూ జ్యోతి...''

''కాదు. జయంతి'' సరిచేశాడు రఘునాథ రావుగారు.

*　　*　　*

జయంతికి ఎంతకూ నిద్ర పట్టలేదు. తన జీవితం హఠాత్తుగా తిరిగిన ఈ అనుకోని మలుపుకు ఆ అమ్మాయికి చాలా ఆశ్చర్యంగా వుంది. పక్షం రోజుల క్రితం వరకూ ఈ రఘునాధరావు, ఈ మన్‌మోహన్‌ల పేర్లు కూడా తనకు తెలీవు. కానీ ఈరోజు తన జీవితమే వాళ్ళ చేతుల్లో వుంది. తన సుఖమూ, సంతోషమూ వాళ్ళతో ముడిపడి వున్నాయి ! ఎంత విచిత్రం ! !

మామయ్య ... ఎంత మంచివారు ! ఆయన సాన్నిధ్యం వటవృక్షపు నీడలా హాయిగా, చల్లగా, ప్రశాంతంగా వుంటుంది.

'నేనున్నాను. నీవు గుండెమీద చేయి వేసుకు నిద్రపో' అన్నట్లుగా చిరునవ్వు !

అత్తయ్య... సుమిత్రమ్మ గుర్తు రాగానే ఆవిడ కనుబొమ్మల నడుమ ముల్లులాంటి ముడి, ఆ వెంటనే పెదిమల మీది పువ్వులాంటి నవ్వు. . నవ్వు వచ్చింది జయంతికి.

వాళ్ళ పిల్లలూ, కోడలూ ... ఊహూ, అంతుపట్టలేదు. మామయ్య కేవలం పేర్లను, వరుసలను మాత్రమే పరిచయం చేశారు. వాళ్ళేం చేస్తున్నారో ఎలాంటి వాళ్ళో, తానెలా వాళ్ళతో మెలగాలో ఏమీ చెప్పలేదు.

మన్ ... మోహన్ ! కనీసం తనకేసి చూడనైనా లేదు. తానెవరో తెలిస్తే అతని ప్రవర్తన ఎలా వుంటుంది ?

*　　*　　*

రఘునాధరావుగారు చెప్పిందంతా మౌనంగా వింది సుమిత్రమ్మ.

''జయంతి తెలివైందిలాగే వుంది. ముందుగా అందర్నీ పరిచయం చేసి, ఎవరెలాంటి తరహానో వివరించి వాళ్ళతో మెలగవలసిన విధానం చెప్పాలనుకున్నాను. కానీ శాశ్వతంగా ఈ ఇంట్లో వుండిపోవలసిన పిల్ల. తానై స్వయంగా వాళ్ళను తెలుసుకోనీ. ముందుగానే చెప్పి ఒక అభిప్రాయ మంటూ ఏర్పరచటం ఎందుకనిపించింది.''

''నిజమే'' అంది సుమిత్రమ్మ.

''సుమిత్రా ! అంతా విన్నావు కదా ? మరి నీ అభిప్రాయమేమిటి ?''

''ఇందులో కొత్తగా అభిప్రాయం వెలిబుచ్చ

## ఈ రాగాని కదె తాళం

వలసిన విషయం ఏముంది ? అయినా మీ అభిప్రాయాలను నేను ఎన్నడు కాదన్నానని ?''

''సుమిత్రా !''

*　　*　　*

బద్ధకంగా కళ్ళు తెరిచిన జయంతి ఫులికిపడి లేచి కూర్చుంది. 'ఛ ఛ ! కొత్తచోటు, కొత్త మనుషుల మధ్య ఇలా మొద్దులా నిద్ర పోయిందేం తను !' సిగ్గుపడిపోయింది జయంతి.

తల, బట్టలు సర్దుకుని నెమ్మదిగా గది లోంచి బయటపడి మెట్లు దిగివచ్చింది.

హాల్లోని సోఫాలో కూర్చుని సుమిత్రమ్మ పేపర్ చూస్తోంది. జయంతిని చూడగానే చిరునవ్వు నవ్వింది.

పేపర్ మడిచి పక్కన పెడ్తూ ''నీకు ఆలశ్యంగా నిద్ర లేవటం అలవాటా ?'' అని అడిగింది.

లేదన్నట్లుగా తల వూపింది జయంతి.

''కొత్త చోటు, ఆలశ్యంగా నిద్ర పట్టిం దేమో కదూ ?''






ఔనన్నట్లుగా మళ్ళీ తల వూపింది జయంతి.

సుమిత్రమ్మ నవ్వి ''ఆఁ, వెళ్ళి ముఖం కడుక్కుని కాఫీ తాగు. ఆ తర్వాత స్నానం చేసి టిఫిన్ తీసుకో. అందరూ వెళ్ళిపోయారు. నీ వొక్కదానివే మరి. నాకూ అర్జంటుగా వెళ్ళవలసిన పని వుండింది. కొత్త పిల్లను నిద్రలోనే వదలిపెట్టి వెళ్ళడం బాగుండదని ఆగాను. మధ్యాహ్నం మా కోసం ఎదురు చూడకు. నీకు ఆకలేసినపుడు భోంచేసెయ్'' అంటూనే లేచి బయటకు వెళ్ళిపోయింది.

ఉదయం వేళ అయినందుకేమో ఇల్లంతా చల్లగా, ప్రశాంతంగా, నిశ్శబ్దంగా వుంది

జయంతి ముఖం కడుక్కుని వంట వాడిచ్చిన కాఫీ తాగింది. స్నానంచేసి, లైట్‌గా టిఫిన్ తీసుకుని తాపీగా ఇల్లు చూడసాగింది. క్రింద వంటగది, డైనింగ్ హాల్, స్టోర్ రూం, బాత్ రూం, హాలుకాక రఘునాధరావుగారి ఆఫీసు గది, సుమిత్రమ్మ పూజగది వున్నాయి. ఇదివరకు వాళ్ళ పడగ్గది పైన వుండేది. ఇటీవలే సుమిత్రమ్మ అనారోగ్యం దృష్ట్యా అదికూడా క్రింది అంతస్తుకు మార్చబడింది.

జయంతి పైన తనకు కేటాయించిన గదిలోకి వచ్చింది. . ఇంకా ఆ గదిలో ఏర్పాట్లేమీ చేయలేదు. ''నీ కిష్టమైన రీతిలో అమర్చు కోమ్మ''ని చెప్పింది సుమిత్రమ్మ.

కిటికీలోంచి బయటికి చూడసాగింది జయంతి. పెద్ద ఇల్లు, విశాలమైన తోట అవడంవల్ల రోడ్డుగానీ, మిగతా ఇళ్ళుగానీ బాగా దూరంగా వున్నాయి. డొమెస్టిక్ ఏరియా కావడంవల్ల కాబోలు రోడ్డుమీద ట్రాఫిక్‌గానీ, వాహనాల రద్దీగానీ అంతగా లేదు, కాలేజీలకు, ఆఫీసులకు వెళ్ళే సమయం దాటిందేమో రోడ్డు మరీ నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వుంది.

ఎండ తీక్షణమవుతూన్నా ఇంటి చుట్టూ వున్న తోటవల్ల చల్లగానే వుంది. ఈ శీతల ప్రశాంత వాతావరణం ఎంతో నచ్చింది జయంతికి.

అలా చాలాసేపు నిలబడ్డ జయంతి కొంచెం విసుగురాగా ఇవతలకు వచ్చింది. ప్రకృతి, ప్రశాంతత అంటే ఎంత ఇష్టమైనా పూర్కే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవటమంత బోర్ మరోటి లేదు జయంతికి.

క్రిందకు దిగివచ్చి నెమ్మదిగా వంటగదిలోకి వెళ్ళింది. వంట పూర్తిచేసి, వంటవాడు వంట గది తుడుస్తున్నాడు. జయంతిని చూసి ''కాఫీ ఏమైనా కావాలా అమ్మాయిగారూ ?'' అని అడిగాడు వినయంగా.

''వద్దు'' అని మళ్ళీ పైకి వచ్చింది. మెట్లు ఎక్కి వచ్చాక క్రింది హాల్లోకి కనిపించేలా చిన్న కారిడార్ వుంది. దాని పక్కన వరుసగా గదులున్నాయి. ఏ గదికి తాళం వేసి లేదు. బహుశా తాళం వేసుకుని వెళ్ళే ఓపిక ఎవరికీ లేదు కాబోలు.




సప్త సంఖ్య అశుభప్రదమనీ, రోదన సంఖ్య అనీ చాలా మంది అభిప్రాయపడుతూ ఉంటారు కాని, సంఖ్యలన్నింటిలోనూ ఉత్తమ గుణాలున్నాయి. ఆయా స్థానాలను చేరిన గ్రహాదులనుబట్టి మంచి చెడ్డలు కలుగుతూ ఉంటాయి నిజానికి సప్త సంఖ్య చాలా ప్రశస్తమైనది. మనం నివసిస్తున్న భూమండలం సప్త ద్వీపాలతోకూడి ఉన్నది. ''సప్త ద్వీపా వసుంధరా'' అని చెప్పడం చాలా మందికి తెలుసును. ఆ భూమి చుట్టూ ఆవరించి లవణ సముద్రం మొదలైన సప్త సముద్రాలు ఉన్నవి భూమిపైన ఉండి దేశ విభాగాన్ని సూచించేవి మహేంద్ర పర్వతం మున్నగునవి సప్తకుల పర్వతాలు. ద్రవ్య, గుణ, కర్మాదులు సప్త పదార్థాలు సూర్య దేవుని రథాన్ని లాగుతున్నవి సప్తాశ్వాలు. అగ్నిదేవుడు సప్త జిహ్వుడు. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు మున్నగు ప్రసిద్ధ మహర్షులు సప్త సంఖ్యలోనే ఉన్నారు. మానవుని కీర్తిని స్థిరంగా నిలిపేవి కుమారుడు, తటాకం మొదలైనవి సప్త సంతానాలు. ఇలా ఎన్నో ఈ సప్త సంఖ్యలో ప్రసిద్ధాలయి ఉన్నవి.

పూర్వకాలంలో రాజులు రాజ్యాన్ని పాలించేటప్పుడు సప్త విషయాలను గురించి కట్టుదిట్టాలు ఉండేవి. అవి సప్తాంగాలని ప్రసిద్ధి ''సభా సప్తాంగి లక్షణా'' అని ప్రసిద్ధి — రాజు — మంత్రి — మిత్రుడు — కోశం — రాష్ట్రం — దుర్గం — సైన్యం— ఇవి రాజ్యానికి ఉండే సప్తాంగాలు. వీటిలో ఏది సరిగా లేకున్నా రాజ్యానికి స్థిరత్వం ఉండదు.

మరొక ముఖ్యమైన విషయం—స్నేహం సాప్తపదీనం అని చెప్తారు అంటే — ఇతరులతో ప్రియంగా ఏడు మాటలు మాటలాడినా, లేక — వారితో కలిసిమెలిసి ఏడు అడుగులు నడిచినా పొత్తు కలుగుతుందని దీనిఅభిప్రాయం భార్యాభర్తలకు పరస్పరం స్నేహభావం, ప్రేమ ముఖ్యం అవి లేనప్పుడు సంసారం సాఫీగా కొనసాగదు. మాటిమాటికీ ఏవో కలతలు ఏర్పడుతూనే ఉంటాయి వివాహ సమయంలోనే వధూవరులకు పరస్పరం స్నేహం కుదర్చే సంకల్పంతోనే సప్త పదాలు తొక్కిస్తారు - అంటే ఏడు అడుగులు వేయిస్తారు. వివాహం తంతులో ఏడడుగులు తొక్కించడంలోని ప్రధానోద్దేశం యిదే!

సప్త సంఖ్యకు ఇంత ప్రాధాన్యంఉన్నా అది అశుభసూచకం అనుకోవడం విచిత్రంగానే కానవస్తుంది ''సప్త'' అంటె — తెలుగులో ''ఏడు''. శబ్ద సామ్యాన్నిబట్టి అది యేడుపును సూచిస్తున్నదనీ, అందువల్లనే దానికి ''రోదన సంఖ్య'' అనే పేరు వచ్చినదనీ అనుకోవాలి. ఇలా అనుకోవడం తెలుగువారిలోనే కానవస్తున్నది. ★

ఓ గదిలో కెళ్ళింది జయంతి.

చూడగానే తెలిసిపోయింది అది గీత గది అని. ఖరీదైన పావడాలు, పైటలు స్టాండు మీద కుప్పలా పడి వున్నాయి. డ్రెసింగ్ టేబుల్ మీది ఖరీదైన కాస్మొటిక్స్ మూతలు తీసివున్నాయి. ఇంటర్మీడియేట్ పుస్తకాలు టేబుల్ మీద, మంచం మీద చిందర వందరగా పడేసి వున్నాయి. మంచం క్రింద ఒక జత, అటాచ్డ్ బాత్‌రూం ముందు ఒక జత, తలుపుకు అడ్డంగా ఒక జత జోళ్ళు అస్తవ్యస్తంగా పడివున్నాయి.

ఒక ఆడపిల్ల, అందునా చదువుకుంటూన్న ఆడపిల్ల గది ఇంత అశుభ్రంగా వుండటం ఆశ్చర్యం కలిగించింది జయంతికి. కంపరమెత్తినట్లుగా బయటకు వచ్చేసింది. రెండవ గదిలోకి వెళ్ళింది. ఖరీదైన దిబ్బలా వుందది. నిన్న పద్మిని కట్టుకున్న చీరె బాగా గుర్తుంది జయంతికి. తెరిచి పెట్టిన బాత్‌రూం లోంచి స్పష్టంగా కనిపిస్తోంది. గీత గదికంటే ఖరీదుగా అంతకంటే అధ్వాన్నంగా వున్న పద్మిని గదిని చూసి చిరాకు పడింది జయంతి. లోనికి...అడుగు పెట్టకుండానే ఇవతలకు వచ్చి మరో గదిలోకి నడిచింది.

ఆశ్చర్యంతో జయంతి నోరు తెరుచుకుంది.

గాంధీ, టాగూర్, రామకృష్ణ పరమహంసలతో, కొన్ని ప్రకృతి తైలవర్ణ చిత్రాలతో అలంకరింపబడిన ఆ గది సాదా ఫర్నిచర్‌తో శుభ్రంగా, నిరాడంబరంగా, ప్రశాంతంగా వుంది.

మంచం పక్కనున్న చిన్న రివాల్వింగ్ రాక్‌లో నీట్‌గా అమర్చిన పుస్తకాల్లోంచి ఒక పుస్తకం తీసుకుంది.

రవీంద్రుని గీతాంజలి!

మొదటి పేజీమీద శ్రీహరి అని అందంగా వ్రాయబడి వుంది.

ఆ గది శ్రీహరి బావగారిది కాబోలు!

అతనిలాగే ఎంత నిరాడంబరంగా వుంది!

చాలాసేపు పుస్తకాలు చూస్తూ ఆ గదిలో గడిపి మరో గదిలోకి వెళ్ళింది.

ఎదురుగా కనిపించిన ఫోటో చూసి జయంతికి కాళ్ళు తడబడ్డాయి.

మన్ మోహన్! ఎవరో స్నేహితుడితో కలిసి తీయించుకున్న ఫొటో!

అతని గదీ మామూలే ఉండవలసినంత చిందరగానూ వుంది అయితే అందరి గదుల్లా ఆ గదిని నిర్లిప్తంగా వదిలి రాలేకపోయింది జయంతి

దగ్గరగా వెళ్ళి అతని ఫొటోను తదేకంగా చూడ్డానికి ప్రయత్నించి కనురెప్పలు బరువుగా వాలిపోతూంటే ఓరగా చూసింది

ఎంత అందమైన రూపం! ఆ చిరునవ్వు పండు వెన్నెలలా వుంది!

''అమ్మాయిగారూ!''

ఉలికి పడింది జయంతి

వంటవాడు. గది బయట నిలబడి పిలుస్తున్నాడు.

''మీరు భోంచేస్తారా?''

అప్పుడే ఒంటిగంట అయిందా!

ఆకలిగా లేదు అయినా ''ఊ'' అంటూ వంటవాడి వెనక వచ్చింది.

**( ఇంకా వుంది )**

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## రచయితలకు గమనికలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ, యితర
రచనలు పంపదలచుకున్నవారు
సంపాదకుడు,
ఆంధ్రసచిత్ర వారపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-520 003
అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి — హామీపత్రం జతచెయ్యాలి

★ గేయాలు తిప్పి పంపబడవు వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం

★ కథలుగాని, యితర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు — వారి స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటి పై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని— తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు — రచన పేరు — అది పంపినతేదీ, నాటి గురించి పరిశీలించడం కష్టం

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్లలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్మ' వరికి తప్ప తతిమ్మా ఎందరికి] అవి పడ్డ "ప్రతు"లను — కాలక్రమంలో వాట పారితోషికాలను పంపుతాము కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు

సం॥



# సన్మానం వెనుక...

పాలకూర సీతాలత

పరమేశ్వర శాస్త్రి గారు స్టేజీ మీద నిలబడి హరికథ చెప్తుంటే ఎంతటివారైనా మంత్రముగ్ధులు కావల్సిందే. ఆ కంచు కంఠం, పురాణ విషయాలపై ఆయనకున్న జ్ఞానం, ఆ దబ్బనందు శరీరం, ముఖవర్చస్సు — అన్నీ భగవత్ప్రసాదాలే అని అనుకుంటూ వుంటారు. మధ్య పాపిడి తీసి, నుదుటను తిరునామం ధరించి, పట్టుశాలువా, పట్టుపంచెతో, చేతులో చిరుతలతో, కాళ్లకు మువ్వ పట్టెలతో— ఆయన్ని చూడగానే భక్తిభావం పుట్టక మానదు. సమయానుకూలంగా ఆయన తన కథలో మధ్య మధ్య పిట్టకథలు జోడించి, శ్రోతలను కూడా ఆకట్టుకుంటారు. వృత్తి రీత్యా రకరకాల ఊర్లు తిరగడం, అవసరం అయితే ఒక ఊర్లోనే నెలల తరబడి వుండిపోవడం ఆయనకు అలవాటే.

ప్రస్తుతం ధర్మపురంలో ఆయన పది రోజులుగా వుంటున్నారు. మహాభారత గాథను ప్రతిరోజూ హరికథగా చెప్తున్నారు. మరొక ఇరవై రోజులు పడుతుంది.

ఆ ఊరి ప్రజలు పాపభీతి, ధర్మచింతన కలవారు. గణపతి నవరాత్రులు, దుర్గాపూజ, శ్రీరామ నవమి ఉత్సవాలు ఉమ్మడిగా చేస్తారు. అందుకు ప్రతి ఒక్కరూ చందాలు వేసుకుని, మెయిన్ సెంటర్లో పెద్ద పందిరి వేసి, నిలువెత్తు విగ్రహాలు ప్రతిష్ఠించి తమ భక్తి చాటుకుంటారు. ఈసారి కూడా దసరాఉత్సవాలు జరిపి, పరమేశ్వర శాస్త్రి గారి చేత నెలరోజుల పాటు హరికథ పెట్టించారు. ఆయన వాగ్ధాటికి ముగ్ధులైపోయారు. ఆ నెల రోజులూ ఆయనకు ఉచితవసతి, ఉచిత భోజన ఏర్పాట్లు గావించారు. హరికథకు విడిగా సొమ్ము ముట్టచెప్తారు. ప్రతిరోజూ కథ నడుస్తుండగా ఏర్పాట్లు చేసిన మంగళహారతి పళ్లెం ప్రేక్షకులందరిదగ్గరకూ వెళ్తుంది. అందులో వారు తమ సంతోషం కొద్దీ చిల్లరో, నోట్లో వేస్తారు... ఆ సొమ్ము ఆయనకే చెందుతుంది. ఆ పళ్లెంలో డబ్బులు దండిగా వెయ్యమని కోరేవారు.

"భక్తులారా... మంగళహారతి పళ్లెం మీ దగ్గరకు రాగానే తక్షణ మనసుకి తోచింది అందులో వెయ్యండి... అది ఐదుపైసలయినా సరే... పది పైసలయినాసరే... అంతేగాని తర్వాత చూద్దాం అని ఆలోచించకండి... తోచిన దానం వెంటనే వెయ్యాలి కానీ తర్వాత ఎప్పుడో చూద్దాం అనుకోవద్దు... మంచి పనులు వెంటనే చెయ్యాలి... మహాదాత కర్ణుడే ఆలస్యం చెయ్య కూడదన్నాడు దానం విషయంలో... ఆ సందర్భంలో ఒక చిన్న కథ వినండి..." అంటూ ఒక పిట్టకథ చెప్పారు.

"మహాదాతగా పేరు పొందిన కర్ణుడు ఒకరోజు అభ్యంగన స్నానానికి తయారయ్యాడు. పరివారంలోని భృత్యులు బంగారు గిన్నెలతో నూనె తెచ్చి అతని శరీరానికి పూస్తున్నారు.

ఇంతలో ఒక పేద బ్రాహ్మణుడు కర్ణుని దర్శనార్థం రావడంతో తను అదేస్థితిలో వుండి బ్రాహ్మణుడిని ప్రవేశపెట్టమన్నాడు. అతను దానం కోరివచ్చిన విప్రుడు.

భూసురా !... "తీసుకోండి..." అంటూ తన ఎడంవైపువున్న బంగారు పాత్రను అదే చేతితో దానం ఇచ్చేశాడు.

ఆ బ్రాహ్మణుడు సంతోషించి —

"ప్రభూ ! ... ఆ ఇచ్చిన దానం కుడిచేత్తో ఇస్తే దానఫలం దక్కేది కద... ఎడంచేత్తో ఏది ఇచ్చినా అది దానం కాబోదు అన్న విషయం తమరు ఎరుగనిదికాదు ..." అన్నాడు.

చిరునవ్వు నవ్వాడు కర్ణుడు.

"విప్రోత్తమా ! ఆ విషయం నాకు తెలియకకాదు ... పడివున్న బంగారు పాత్రలన్నీ నా ఎడంవైపే ఉన్నాయి. దాన్ని ఎడంచేత్తో తీసుకుని ఆ తర్వాత కుడిచేతిలోకి మార్చుకోవాలి ... అలా మార్చుకుందుకు పట్టే సమయంలో నా మనసు మారిపోవచ్చు ... దానం చెయ్యాలనుకున్న వెంటనే చేసెయ్యాలి తప్ప కాలయాపన చెయ్యరాదు..." అన్నాడు. ఇది ఆయన చెప్పిన కథ.

"కనుక భక్తులారా ! మహాదాత అయిన కర్ణుడే తన మనసు మారిపోతుందని భయపడ్డాడు. సాధారణ మానవులం ... మనం ఎంత ?" అన్నారు.

ఆ కథ అందరికీ నచ్చింది ... మంగళహారతి పళ్లెంలో దండిగా డబ్బులు పడ్డాయి.

"మంగళహారతి పళ్లెంలో డబ్బులువేస్తూ గలగలమన్పించండి ... దాన్ని నిండుగాచేసి కళకళలాడనియ్యండి" అన్నారు.

ఆయన హరికథా గానం ప్రతిరోజూ సాగుతూవేవుంది ... ప్రజలు ఆనందోత్సాహంతో చప్పట్లు కొడుతున్నారు. మంగళహారతి పళ్లెం నిండుతోంది. ఆయన జేబు నిండుతోంది. ఏ రోజూ పాతిక రూపాయలకు తక్కువ రావటం లేదు పళ్లెంలో. ఈ రకంగా చూస్తే కథ పూర్తయ్యేనాటికి ఏడెనిమిది వందలు కాకపోవు.

కథ పూర్తికావడానికి ఇక వారంరోజులే వుంది.

ప్రతిరోజూ భక్తి శ్రద్ధలతో కథ వింటూ, ఆయన వాక్చాతుర్యానికి మురిసిపోతూ. ఆయన్ని పొగుడుతున్న ఒకరు ... ఆమె పేరు శాంతమ్మ.

ఆ ఊరి జగన్నాథస్వామివారి కోవెల పూజారి రంగాచారిగారి చెల్లెలు ఆమె. ఆ ఊరికి చుట్టం చూపుగా వచ్చిన ఆవిడ ...

ఆమెకు ఆరోజు ఒక దివ్యమైన ఆలోచన వచ్చింది —

పరమేశ్వరశాస్త్రిగారు పురాణం చెప్పినందుకు కమిటీవారు డబ్బులియ్యడం వేరే సంగతి. ఆయన గొప్పతనానికి ముగ్ధులైన కొందరు పూనుకుని ఆయనకు సన్మానం చేసి ఒక 'పర్సు' బహూకరిస్తే ?...

ఆ ఆలోచన ఆమె ఒకరిద్దరికి చెప్పారు. పరమేశ్వరశాస్త్రిగారిపై గల గౌరవ మర్యాదల కారణంగా ఆమె మాటను తీసెయ్యలేకపోయారు.

"ఈ ఊరు నాకు కొత్త... అందర్నీ నేను ఎరుగను... కనుక ఈ సత్కార్యం ఫలించడంలో మీరంతా తోడు వుండాలి ... ఒక్కొక్క ఇంటికీ వెళ్లి అందర్నీ ఒప్పించే ప్రయత్నం చేద్దాం... ఇందులో బలవంతం లేదనీ...ఎంత తోస్తే అంత ఇయ్యవచ్చనీ చెప్తాం... నేను నా తరఫునుంచి... ఇదిగో...రెండువందలు ఇస్తున్నాను..." అంటూ అక్కడికక్కడే రెండువందలు తీసింది.

"ఈ ఉద్దేశ్యం కలిగింది మీకు ... సొమ్ము మీ దగ్గరే వుంచండి... మేం కూడా మాకు తోచినది ఇస్తాం... అందర్నీ కలిసి విషయం చెప్పి వారు ఇచ్చింది తీసుకుందాం..." అన్నారు ఆమెతో కొద్దిపాటి పరిచయం వున్నవారు.

ఇంకేం ?... సన్మానంలో బహూకరించే పర్సుకోసం ప్రయత్నాలు ప్రారంభం అయ్యాయి. ఒక్క నిముషం తీరిక లేకుండా ఇద్దరు ముగ్గుర్ని తీసుకుని ఇల్లిల్లూ తిరిగింది శాంతమ్మ. బయట నుంచి వచ్చిన ఆమె రెండువందలు ఇస్తే ఆ ఊరి వాళ్లయి పదిరూపాయలు ఇస్తే ఏం బాగుంటుం దనుకున్న ఆడవాళ్లు ఘనంగానే ఇచ్చారు సొమ్ము. చాలామంది ఆసక్తి చూపించారు.

"కమిటీ వాళ్లు ఎలాగూ ఇస్తున్నారు ... ఇక విడిగా ఎందుకు ?" అని ఒకరిద్దరు మగవాళ్లు అన్నారు . కానీ ఆడవాళ్లు వాళ్లని ఒప్పించేశారు.

# సన్మానం వెనుక

''అది మీ తరఫునుంచి... ఇది మా తరఫు నుంచి ...'' అన్నారు.

ఎంతయినా స్త్రీ శక్తి స్వరూపిణి కదా!

శాంతమ్మగారి శ్రమ ఊరికే పోలేదు. ఆ శ్రమకు తగ్గ ఫలితం లభించింది... మూడు వేల రూపాయలు పోగయ్యాయి. తృప్తిగా నిట్టూర్చింది ఆమె.

కమిటీవాళ్ళు పరమేశ్వరశాస్త్రిని కలిశారు.

''కథ పూర్తి అయిన మరుసటి రోజు మీకు సన్మానం చేసి 'పర్సు' బహూకరించాలని మేం నిర్ణయించుకున్నాం. మీరు అంగీకరించాలి'' అన్నారు.

ఆయన కళ్ళు ఆనందంతో మెరిశాయి.

''మీ అందరికీ నాయందు కల్గిన ఆదరాభిమానాలకు కృతజ్ఞుడిని. నేను సామాన్య మానవుడిని. నాకు ఇంత మర్యాద కల్పించడం కేవలం నా అదృష్టమేతప్ప నేను అందుకు అర్హుడిని కాను... నిజానికి నాకు ఈ సన్మానాలంటే ఇష్టంలేదు. కానీ... ఇంత ఉత్సాహంతో ముందుకు వచ్చిన మిమ్మల్ని కాదనడం నాకు ఇష్టంలేదు...'' అన్నారు ఎంతో వినయంతో. ఆ వినయానికి ముగ్ధులైపోయారు ఆయన ఒప్పుకున్నందుకు ఆనందించేరు.

అనుకున్నట్లుగానే సన్మానం జరిగింది. పర్సు బహూకరించబడింది. పరమేశ్వరశాస్త్రిగారు ఆనందంతో తలమునకలవుతున్నారు.

''నేను ఎన్నోచోట్లకు వెళ్లాను. కానీ ఇంత ఘనసన్మానం జరగలేదు. నిజంగా మీరందరూ దానకర్ణులు... మిమ్మల్ని నేను ఎక్కడ వున్నా మర్చిపోలేను... మీకందరకూ కృతజ్ఞతలు. కరుణామయుడైన భగవంతుడు మిమ్మల్ని, ఈ ఊరుని చల్లగా చూడుగాక...'' అన్నారు పరమేశ్వరశాస్త్రిగారు కృతజ్ఞతలు తెలుపుకుంటూ.

ఆ సన్మానానికి వెన్నెముకగా ఎవరో 'శాంతమ్మ'గారిని పేర్కొన్నారు

ఆమె వచ్చి ఆయనకు నమస్కరించింది. ఆయన చెయ్యి ఎత్తి దీవించారు...

''కలకాలం ముత్తయిదువుగా, సుఖసంతోషాలతో, భోగభాగ్యాలతో, ఆయురారోగ్యాలతో వర్థిల్లు తల్లీ...'' అంటూ దీవించి ఆమెకు-కల మంచిమనసును పొగిడేరు.

''క్షమించండి స్వామీ ... ఇదంతా కేవలం ఈ ఊరివారి సహకారం తప్ప ఇందులో నేను ప్రత్యేకంగా చేసింది ఏముంది? ఈ ఊరి ప్రజలందరూ ధర్మచింతన కలవారు కనుక నా పని మరింత తేలిక అయ్యింది. మీ మంచి ఆశీస్సులు అందుకోగల్గిన అదృష్టం కల్గినందుకు చాలాసంతోషిస్తున్నాను. మిమ్మల్ని గౌరవించడం అంటే ఆ దేవదేవుడిని గౌరవించినట్లే. ఆ భాగ్యం మాకు కలగజేసినందుకు మీకే మేము కృతజ్ఞులము. ఏ పూర్వజన్మ సుకృతమో లేకపోతే మీలో ఇంత వర్చస్సు, జ్ఞానసంపద కలుగుతాయా?... మీ దర్శన భాగ్యం కలిగి మేం ధన్యులం అయ్యాము...'' అంది శాంతమ్మగారు.

పరమేశ్వర శాస్త్రిగారు ఆనందాన్ని కళ్ల ద్వారా వ్యక్తంచేశారు.

ఆ మర్నాడే ఆయన ప్రయాణం.

కమిటీ వారు ఆయనకు ఇయ్యవల్సిన మొత్తాన్ని తాంబూలంలో పెట్టి ఇచ్చేసి ఒక నమస్కారం పెట్టారు.

ఆయన్ని బస్సు ఎక్కించడానికి వచ్చిన వారిలో ఒకరు—

''స్వామీ! ...ఇన్నిరోజులుగా మీరు ఒక్కరే వున్నారు... మీ శ్రీమతిని కూడా తీసుకుని వచ్చి వుంటే ఆమె దర్శనం కూడా చేసుకుని సంతోషించేవాళ్లం'' అన్నాడు.

ఆయన చిన్నగా నవ్వి —

''ఆమె ఎప్పుడూ అనారోగ్యంతో మంచం మీదే వుంటుంది ... ఏదో ఆ భగవంతుడి దయవల్ల రోజులు గడిచిపోతున్నాయి కానీ... ఒకరోజు విందు, మరొకరోజు మందు అవుతోంది.'' అన్నారు ఆయన.

అది విని కొద్దిగా చింతించేరు.

బస్సులో కూర్చున్న శాస్త్రిగారు కిటికీలోంచి అందరికీ నమస్కారం పెట్టారు.

సాగనంపడానికి వచ్చిన వాళ్ళు కూడా వినయంగా నమస్కరించారు.

ఆయన కళ్లు చెమ్మగిల్లాయి ... ఈ నెలలోనే ఈ ఊరితో అంత సత్సంబంధం పెంచుకున్నారు.

బస్సు కదిలింది

* * *

పరమేశ్వరశాస్త్రిగారు వెళ్లిపోయిన రెండు రోజుల తర్వాత శాంతమ్మ ప్రయాణం అయింది

''ఇప్పటికే నేను వచ్చి చాలా రోజులయ్యింది. ఆయన, పిల్లలు చెయ్యి కాల్చుకుంటూ అవస్థ పడుతుంటారు. ఇక నేను వెళ్లాలి...'' అని ఇరుగు పొరుగువారికి చెప్పి ప్రయాణం అయ్యారు.



గుమ్మంముందు రిక్షా ఆగడం, అందులోంచి శాంతమ్మ దిగడం చూసిన పరమేశ్వర శాస్త్రిగారు అరుగుమీదకు వచ్చి చిరునవ్వుతో భార్యను ఆహ్వానించారు.

''రా శాంతా. . రా...'' అన్నారు.

శాంతమ్మగారుకూడా చిరునవ్వు నవ్వి ఇంట్లోకి వచ్చింది.

మంచినీళ్ళు తాగింది..

భర్తతో నిష్ఠూరంగా ఉంది —

''మన అంతర్నాటకం కాదుగానీ... ఆ ఊళ్ళోవున్న నెల రోజుల్లో ఒక్కసారికూడా మీరు అన్నయ్య ఇంటికి రాలేదు... వాడు ఎంత బాధపడ్డాడో... మీరు ఒక్కరోజుకూడా ఆ ఇంట్లో ఎంగిలి పడలేదని..''

ప్రసన్నంగా నవ్వేరు శాస్త్రిగారు.

''అవును మరి... అనుకున్నది సాధించాలంటే ఇలాంటివి పట్టించుకోకూడదు. కమిటీ వారు ఉచితంగా భోజనం ఏర్పాటు చేశారు. కనుక నష్టపోయింది లేదు... మనిద్దరికీవున్న సంబంధం తెలిస్తే మూడువేల రూపాయలు పోగయ్యేవా?... నిన్నుకూడా కేవలం హరికథ చెప్పున్నంతసేపేగానీ ఆ తర్వాత చూశానా?.. వాళ్లకి ఏ రకమైన అనుమానం కలగకూడదు... అందుకే అలా ప్రవర్తించాను... నువ్వేదో పరాయి వ్యక్తిగా సహాయం చెయ్యడానికి ముందుకు రావడమే మిగతావాళ్లతో డబ్బులిచ్చేలా చేసింది'' అన్నారు పరమేశ్వరశాస్త్రిగారు.

''ఆ ఊరి ప్రజలు చాలా మంచివాళ్లండీ వాళ్లను మోసం చెయ్యడం పాపం అనిపిస్తుంది అప్పుడప్పుడు...'' అంది శాంతమ్మ.

''నమ్మారు కనుకనే వంచించగలిగాం కానీ నమ్మకపోతే ఏం చెయ్యగలం? అలాంటివి పట్టించుకోకూడదు. పురాణగాథల్లో మాత్రం మోసాలు లేవా?.. పురాణగాథలు హరికథలుగా చెప్పిచెప్పి ఆ మోసాలు నాకు వంటబట్టాయి... మొదటిసారిగా దాన్ని కార్యరూపంలోకి తెచ్చాం..'' అన్నారు శాస్త్రిగారు.

శాంతమ్మ హఠాత్తుగా అంది —

''ఆ డబ్బు ఏం చేద్దాం?''

''ఏం చెయ్యడమేమిటి?... ఖర్చు ముందు నుంచీ కాసుకుని కూర్చుంది కదా ... మన అబ్బాయికి మూడువేలు లంచం ఇస్తే ఉద్యోగం ఇస్తానని అన్నారు కదా... ఈ సొమ్ము అందుకే ఖర్చు పెడదాం... అన్యాయంగా సంపాదించిన సొమ్ము అన్యాయపు పనికే ఖర్చు పెడదాం అన్నారు పరమేశ్వరశాస్త్రిగారు విచారంగా కుళ్ళిపోయిన సంఘాన్ని తల్చుకుని ...

ఆ దంపతులిద్దరికీ కళ్లముందు ఆశలు —

తమ కొడుకు ఉద్యోగస్తుడవుతాడు ... తమని సుఖపెడతాడు ...

ఆ కోరిక చాలా సహజమైనది... ఆకలి వేసినపుడు అన్నం తింటే కడుపు నిండినంత సహజమైనది.



# ఫాలాక్షని ఫేరి

## తెనీటి మహిమ !

మహారాష్ట్రకు చెందిన ఉస్మానాబాద్ జిల్లాలో 22 ఏళ్ల చతురాబాయ్ తోబారే అనే వో అమ్మాయి పుట్టిన కొన్నేళ్ళ నుంచి ఆహారం మానేసి కేవలం రోజుకు నాలుగు లీటర్ల పాలు కలపని టీ నీరు త్రాగుతోందట. ఈ టీ నీళ్లలో ఆమె బెల్లం వేసుకుంటుందటంతే. ఆమె ఎంతో ఆరోగ్యంగానూ, చురుగ్గానూ కూడా వుందట!

## ముత్యం తెచ్చిన ఐశ్వర్యం !

ఆష్టిన్ టెక్సాస్‌కు చెందిన జి వైట్‌హెడ్ ఆయన నా సోదరుని అదృష్టమే అదృష్టం. ప్చ నాదేముంది అని తన నాలుక తానే చప్పరించుకున్నాడట ఇంతకీ ఆయన సోదరుడు [illegible] అనే చోట సముద్రస్నానం సరదాగా చేసి బయటికి వచ్చిన కొన్నాళ్ళకు అతని [illegible] ముందు భాగం వాచి, నొప్పెట్ట [illegible] డాక్టరుదగ్గరకు పరుగెట్టేసరికి వారు [illegible] ముందు చర్మాన్ని వెనక్కి తొలగించి చూస్తే అక్కడ మిలమిల్లాడుతూ వో ముత్యం వుందట. ఆ ముత్యం అతి ఖరీదైనదై అతన్ని ధనవంతుణ్ణి చేసిందట.

## కాపీచేస్తూ పట్టుబడ్డ టీచర్లు !

మధురై కామరాజ్ విశ్వవిద్యాలయం కరస్పాండెన్స్ కోర్సు డిగ్రీ పరిక్షలు వేలూరులో రాస్తూన్న ఉపాధ్యాయులలో వో ముగ్గురు ఆడ టీచర్లు, 22 మంది మగ టీచర్లు కాపీచేస్తూ పట్టుబడ్డారట— వోరి వీళ్లదుంపతెగ! కంచే చేను మేసినట్టుగా వుందే!




## బెడిసికొట్టిన పాచిక !

కేరళకు చెందిన సుకుమార కురూప్ అనే వో దుర్మార్గుడు చాలా ఏళ్ళుగా కేరళకూ గల్ఫ దేశాల మధ్యలో గోడ కొట్టిన బంతిలా తిరుగుతున్నాడట.. ఈతని భార్య సరసమ్మ "అబూదాబి" (గల్ఫ దేశం) అనే పట్టణంలోని వో ఆసుపత్రిలో నర్సు అట. ఇతను పని చేస్తూన్న అబూదాబి మేరైన్ ఏజన్సీ కంపెనీలో తన పేర ఎనిమిది లక్షలకు జీవితభీమా చేసుకున్నాట్ట ఈ డబ్బు తాను చస్తే మరొకళ్ళకు చేరేకన్నా, మరొకరు చస్తే తనకొస్తే ఎలా వుంటుందని యోచించాడట దానికో పథకం వేయడానికి కేరళ వచ్చి, తన బావమరది, కొందరు అనుయాయులతో వో ప్లాను రూపొందించాడట దానిబట్టి తన రూపు రేఖల్లాంటివీ, వొడ్డూ పొడుగూవున్న వో పొంథుణ్ణి పట్టుకుని చంపేసి, అది తనే అని చెప్పి తనవారు ఇన్సూరెన్సు కంపెనీకి వెళ్లి డబ్బు తీసుకోడమట ఈ పథకం జనవరి 21 లోగా చేయాలనుకుంటే ఆ రోజు వరకూ ఎవరూ దొరకలేదట. దాంతో అలెప్పి అనే వూరుకు అవతల వో ఎంబాసిడరుతో కాసిన కురూప్ బావమరది భాస్కరన్ పిళ్లయ్‌తో యీ కురూప్ అసహనంగా వూళ్లోంచి, బయటకు, బయట్నుంచి వూళ్ళోకి తచ్చాడాడట చివరికి ఛకో అనే వో సినిమా రిప్రజంటేటివ్ అలెప్పి పోడానికి కరువత్తాలో ప్రయత్నిస్తున్నాడట అతను తమ లెక్కలకు సరిపోయేసరికాతనికి కార్లో లిఫ్ట్ యిచ్చి, దారిలో చంపేసి, ముక్కూ మూతీ చెక్కేసి, అతని జేబులో కురూప్ పాస్‌పోర్టు వగైరాపెట్టి, అతన్ని కార్లోనేవదిలేసి, ఆ కారుకు నిప్పెట్టారట. పథకం ప్రకారం పోలీసులు చచ్చిపోయింది కురూప్ అనుకున్నారట. కానీ ఛకో కనపడక పోయేసరికి అతని తలిదండ్రులు, భార్యా పోలీసు రిపోర్టిస్తే అతను కరువత్తా అనే వూరినుంచి అర్జెంటుగా అలెప్పి వెళ్ళాలని చెప్పడం, ఆ సమయం అంతా కరువత్తాలోని వో సినిమాహాలువారు చెప్పారట దాంతో కథ కదిలి యీ శవం ఛకోదని తేలిందట. కురూప్ తప్ప అందరూ అరెస్టయి యీ ప్లాను విషయం, కురూప్ పథకం వివరించారట. కురూప్ దేశం వదలిపోకుండా కట్టుదిట్టాలుచేసినా, అతను దొరక్కపోడంవల్ల మరో పేరుతోనూ, వేషంతోనూ అబూదాబికో మరెచ్చటికో పోయివుంటాడేమోనని పోలీసు అనుమానిస్తున్నారట.

## అమాయకపు భర్తల సంఘం !

కాన్పూరులో "పతి మంచ్" అనే వో సంస్థ కొత్తగా ప్రారంభమయిందట ఈ మంచ్‌లో భార్యలచేత నానాపాట్లూ పడే, తిట్లూ కొండొకచో తన్నులూ తినే భర్తలు చేరారట. ఈ రకంగా అమాయక భర్తలను ఒక సమూహంగా చేర్చి వారి కష్టాలను విచారించి నివారణోపాయాల అన్వేషణదే "పతి మంచ్" లక్ష్యమని సెక్రటరీ [illegible] గోపాల్ పూరీ అన్నారట. ఈ మంచ్‌కు వో రిటైర్డ్ జడ్జి గారు, వో డాక్టరుగారు సలహాదారులుగా వుండ నంగీకరించారట. మెంబరయిన ప్రతి పతీ తన భార్యవల్ల తనకు కలుగుతున్న సమస్యాల్ని వారికి వెళ్ళగక్కచ్చుట— వోయా చదువరీ హవెబపుట్యా!




## ఫలించని పథకం !

బెంగళూరు గాంధీనగరుకు చెందిన వో పెద్ద కంపెనీలో పనిచేస్తూన్న భావర్‌సింగ్ అల్సూరు గేటు పోలీస్టేషనుకు పోయి తాను బ్యాంకు నుంచి 11 వేల రూపాయలు తెస్తుండగా కొందరు తనను దారికాసి, గాయపరచి, ఆ డబ్బు వూడలాక్కుపోయారని రిపోర్టు యిచ్చాడట. అతని వొంటిమీద బ్లేడుగాట్లూ వగైరా లున్నాయట తీరా పోలీసు విచారణలో సింగు ఖంగుతిని తానే అలా గాయాలు చేసుకుని, డబ్బు తన చెల్లెలింట్లో దాచినట్టు వొప్పుకున్నాట్ట. ★




## (గత సంచిక తరువాయి)

**జరిగిన కథ — 16 :** 'గోరంత దీపం' పత్రిక దినదినాభివృద్ధి చెందుతోంది. పరశురాం కట్టించిన బిల్డింగ్‌లోకి పరశురాం అండ్ కం., 'గోరంత దీపం' పత్రిక ఆఫీసు మారిపోయాయి. అనంతపురంలో తన స్నేహితుని కూతురి పెళ్లికి రమణని వెంటపెట్టుకొని వెళుతాడు విశ్వమూర్తి. విక్టోరియా నర్సింగ్‌హోమ్‌లో ఒక ఆస్తమా పేషంటు నర్సు మేరీ నిర్లక్ష్యానికి బలైపోయాడనే వార్త 'గోరంత దీపం' పత్రిక మొదటి పేజీలో ప్రచురిస్తాడు విశ్వమూర్తి, ఆ సిస్టర్‌ని ఆ వార్త చదివిన వారంతా యాగీ చేయగా ఆమె నిద్రమాత్రలు మింగి ఆత్మహత్య చేసుకుంది. ఈ సంగతి తెలిసి ఆమె మరణానికి పరోక్షంగా తనుకారణమయ్యానని కుమిలిపోతాడు విశ్వమూర్తి. ఏక్సిడెంట్‌లో కాళ్లుపోగొట్టుకున్న పార్థసారథి జీవితాన్ని కథగా 'గోరంత దీపం'లో ప్రచురిస్తాడు విశ్వమూర్తి. హరిప్రసాద్, రమణల పెళ్లికి వచ్చిన రావును అతని కోరికపై అరుణకు పరిచయం చేస్తాడు హరి. 'గోరంత దీపం' పత్రిక ఎడిటర్ పదవి హరిప్రసాద్ చేతుల్లోకి వచ్చింది. రావు 'గోరంత దీపం' బిజినెస్ మేనేజరుగా చేరుతాడు. గర్భంతో ఉన్న రమణ కోరికపై రమణ, హరి వూళ్లు తిరిగిరాను వెళుతారు. అరుణకి ఫోన్‌చేసి పార్కుకి రమ్మని కోరుతాడు రావు. అరుణ రావును పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకుంటుంది. కర్నూల్లో త్రీ స్టార్ హోటల్ ప్రారంభోత్సవ సందర్భంలో ఆ హోటల్ యజమానిని ఇంటర్వ్యూ చేస్తాడు హరి. విశ్వమూర్తికి గుండె పోటు వస్తే హాస్పిటల్లో చేరుస్తాడు హరి.

విశ్వమూర్తి హాస్పిటల్లో అడ్మిట్ అయి మూడు రోజులయింది స్పృహ మాత్రం ఇంకా రాలేదు. రమణ ఇంటి ముఖం చూడకుండా హాస్పిటల్లోనే ఉండిపోయింది. ఆమెకి బొత్తిగా విశ్రాంతిలేక తన ఆరోగ్యం ఎక్కడ పాడవుతుందో అని హరికి భయంగా వుంది. డాక్టర్ సుందరం కూడా చెప్పారు, "మీ నాన్నకేం ఫర్వాలేదు. మేం జాగ్రత్తగా చూసుకుంటాం. నువ్వు ఇంటికి వెళ్ళి కొంచం విశ్రాంతి తీసుకో అమ్మాయ్" అని. "పోనీ రాత్రిళ్లు అయినా నేనుంటాను ఇక్కడ. నువ్వింటికి వెళ్ళిపో" అని బతిమాలుకున్నాడు హరి. రమణ ఎవరి మాటలు చెవిన పెట్టలేదు.

"మీకు తెలీదండీ! ఆయనకి తనవారంటూ నేను తప్ప ఎవరూ మిగల్లేదు. తల్లీ, తండ్రీ తనే అయి, చిన్నప్పుడు ఆయన నా కోసం ఎన్ని కష్టాలు పడ్డారో, ఎంత ప్రేమగా పెంచి పెద్ద చేశారో నాకు తెలుసు. ఆయన నలుగుర్లో ఉండగా ఎంత కలుపుగోలుగా ఉంటారో అందరికీ కనిపిస్తుంది. ఎవరికీ కనిపించని ఒంటరితనం కొండంత వున్నది ఆయన మనసులో. అందుకే నాకు పెళ్ళిచేసినా నన్ను వదిలి ఆయనా, ఆయన్ని వదిలి నేనూ ఉండలేక పోయాం.

అయినా నే నెక్కడున్నా నా మనసు ఆయన దగ్గరే ఉంటుంది. అలాంటప్పుడు ఆయన్నిక్కడ వదిలి నేను ఇంట్లో ఏంచేయాలి? ఆయనకి ఏ క్షణంలో స్పృహ వచ్చినా, నేను ముందుగా ఆయనకి కన్పించాలి. అప్పుడే మా కిద్దరికీ తృప్తి."

మారు మాటాడలేక పోయాడు హరి

మూడవరోజుకి ఆఫీస్ స్టాఫ్ ఒక్కొక్కరికీ తెలుస్తోంది, విశ్వమూర్తి హాస్పిటల్లో ఉన్నాడన్న వార్త. ఒక్కొక్కరూ వచ్చి హరితో మాట్లాడు తున్నారీ విషయమే. వాళ్ళందరూ కలిసి ఆ సాయంత్రం హాస్పిటల్‌కి వెళదామని అనుకుం టున్నారు.

మధ్యాహ్నం ఒంటి గంటకి నర్సింగ్ హోమ్ నుండి ఫోన్ వచ్చింది హరికి. "ఏమిటి డాక్టర్ ఎలా ఉంది మా మామగారికి?" గాభరాగా అడిగాడు.

"అయామ్ సారీ మిస్టర్ హరిప్రసాద్. మీ శ్రీమతి టాయిలెట్‌కి వెళుతూ కళ్లు తిరిగి కింద పడిపోయారు..."

ఆయనేం చెబుతున్నదీ అర్థం అవగానే, "నేను వెంటనే వస్తున్నాను. ఇంకేంచెప్పొద్దండి" అంటూ ఫోన్ పెట్టేసి బయలుద్దేరాడు హరి. అతని వెంటే రామ్మూర్తి, సత్యం, మరో ఇద్దరు బయల్దేరారు.

హరి నర్సింగ్ హోమ్‌లో అడుగు పెట్టే సరికి అంతాఅయిపోయింది. షాక్‌వల్ల అయితేనేమి, ఎక్కువగా రక్తం పోవటం వల్ల అయితేనేం రమణ ప్రాణాలు దక్కలేదు.

రెండు కాళ్ళు విరిగిన వాడిలా ఎక్కడి వాడక్కడే కూలిపోయాడు హరి. నోటమాట రావటం లేదు. బుర్ర పనిచేయటం లేదు. "భగవాన్! నాకెందుకీ శిక్ష?" అని కుమిలిపోయాడు చేతుల్లో ముఖాన్ని దాచుకుని.

నిశ్శబ్దంగా రోదిస్తూ ఉన్న హరికి, డా॥ సుందరం తన భుజం తట్టి మెల్లగా అన్న మాటలు కూడా తలకెక్కనే లేదు. "అయామ్ రియల్లీ వెరీ సారీ మిస్టర్‌హరి. విశ్వం గారు కూడా పోయారు; చిత్రం ఏమిటంటే, సరిగ్గా కూతురు క్రింద పడిపోయిన క్షణంలోనే ఆయన ప్రాణం పోయింది... అదృష్టవంతులు... ఒకరి లోటు ఒకరికి కన్పించకుండా ఒకేసారి తప్పుకున్నారు... నాకు తెలుసు... ఇంత దుఃఖాన్ని భరించటం ఎంత కష్టమో... పోయిన ఇద్దరికీ కావలసిన వారు మీరొక్కరే... జరగాల్సింది చూడండి... పరశురాం గారి రోజు వస్తారను కుంటాను... కదూ?"

తర్వాత ఏం జరిగిందీ హరిప్రసాద్‌కి గుర్తు లేదు.

## 37

పరశురాం గుండెకి తగలరానిచోటే దెబ్బ తగిలింది. జబ్బుచేసి నెల రోజులు మంచాన పడ్డాడు. ఆ నెల రోజులూ కరుణ కంటికి రెప్పలాగా జాగ్రత్తగా చూసుకుంది.

ఆవేళ ఆదివారం. తండ్రి బలవంతంమీదనే అక్క వెంట సినిమాకి వెళ్ళిందా రోజు కరుణ. ఆయనకి జబ్బు చేసినప్పట్నించీ ఆమె ఇల్లు వదిలివెళ్ళటం ఇదే మొదలు.

పరశురాం మూడు రోజులుగా ఆఫీస్‌కి వెళ్ళి ఒక గంటసేపు మాత్రం ఉండి, అవసర మయిన పనులు చూసుకుని వచ్చేస్తున్నాడు.

ఈ మూడు రోజుల్లో హరిప్రసాదు మాత్రం అతనికి కనిపించలేదు.

మంచంమీద పడుకుని చుట్ట కాలుస్తూ ఆలోచిస్తున్నాడు పరశురాం. తన ప్రాణమిత్రుడు విశ్వం తనని వదిలేసి వెళ్ళిపోయాడన్న విషయాన్ని తలుచుకుంటే, గుండెలో బాధ సుడులు తిరుగుతుంది ఎంత దురదృష్టవంతుణ్ణి! అనుకుంటాడు పదే పదే.

ఆలోచనలు గతంలోకి వెళ్ళేయి.

విశ్వమూర్తి, రసుణ ఇద్దరూ మరణించిన రోజు అది. ఆవేళే సాయంత్రం తను ఢిల్లీ నుండి వచ్చాడు. స్టేషనుకి రావు వచ్చాడు రిసీవ్ చేసుకుందుకు. కార్లో కూచున్న వెంటనే చెప్పాడు రావు విషయాన్ని.

''అసలేం జరిగింది? నువ్ చెబుతున్నది ఏమిటో నా కర్థం కావటంలేదు'' అడిగాడు పరశురాం. అతడికి మతిపోయినట్లుగా వుంది.

''మూడు రోజులయి విశ్వానికి బాగులేక పోతే నాకెందుకు ట్రంకాల్ చేయలేదు?'' కోపంగా అడిగాడు

''ఢిల్లీ నుంచి వస్తున్న మీ పరిస్థితీ, ఊళ్ళోనే ఉన్న మా పరిస్థితీ ఒకటే. ఎవరికీ తెలియదీ విషయం. హరి చెప్పలేదు. ఈ రోజు ఆఫీస్‌కి డా. సుందరంగారు ఫోన్ చేస్తే తెలిసింది.'' తాపీగా చెప్పాడు రావు. ఇలా చెప్పే అవకాశం వచ్చినందుకు లోలోపల సంతోషంగా ఉంది రావుకి.

కారు నేరుగా వెళ్ళి విశ్వమూర్తి ఇంటి ముందు ఆగింది. అప్పటికే అక్కడ అరడజను దాకా కార్లు పార్క్‌చేసి ఉన్నాయి. గేటుదాటితే ఆవరణంతా జనం గుమిగూడి ఉన్నారు. వాళ్ళంతా విశ్వం అభిమానులు, 'గోరంత దీపం' పాఠకులు.

అందర్నీ తప్పించుకుని, లోపలికి అడుగు పెట్టిన పరశురాంకి హాల్లో రెండు మంచాల మీద శాశ్వత నిద్రలో ఉన్న తండ్రీ కూతుళ్ళని చూడగానే కడుపులో కెలినట్లయింది. కళ్ళు బైర్లు కమ్మినట్లవుతుంటే బలవంతంగా నిగ్రహించుకుని వెళ్ళి స్నేహితుడి ముఖం వైపు చూస్తూ ఉండిపోయాడు కొన్ని క్షణాలు. ఇదంతా అబద్దం. విశ్వం నిద్ర పోతున్నాడు ... కాస్సేపట్లో కళ్ళు తెరచి, 'ఏరా రామూ! ఎందుకలా ఏడుపు ముఖంతో కూర్చున్నావు?' అని అడిగితే ఎంత బాగుండు అనిపిస్తోంది.

పరశురాం రాగానే గదిలో ఉన్న మిగిలిన వారంతా నిశ్శబ్దంగా అయిపోయారు. కంపెనీలో పనిచేసే స్టాఫ్ అందరికీ తెలుసు ఆ స్నేహితుల మధ్య ఉన్న అనుబంధం ఎంత గట్టిదో. అంతా ఊపిరి పీల్చటం కూడా మరచిన వారిలా పరశురాం కేసి చూస్తూ వుండిపోయారు.

తల ఎత్తిన పరశురాంకి, అటువయిపు మరో కుర్చీలో కూర్చుని ఏదీ పట్టనివాడిలా శూన్యంలోకి చూస్తున్నట్లుగా ఉన్న హరిప్రసాద్ కనిపించాడు. అతనికి ఆ క్షణంలో, జరిగిన అనర్థానికి అంతా హరే కారణం అనిపించింది. కోపంతో ఒళ్ళు తెలియలేదు. బాధలో ఏం మాట్లాడుతున్నదీ ఆలోచించుకోలేదు.

''ఇంత ఘోరం జరగటానికి కారణం నువ్వే! విశ్వంకి ఎటాక్ రాగానే నాకు ట్రంకాల్ ఎందుకు చేయలేదు? ఒక్కమాట నాకు తెలిసి వుంటే. .హు చివరికి ఆఖరుగా ఒక మాటైనా మాట్లాడుకోలేకుండా అయింది ... నిండు నెలలయిన అమ్మాయిని ఒంటరిదాన్ని చేసి హింస పెట్టావు? ఇంతా నీకు తెలివి తక్కువయి చేశావా? వాళ్ళు నీకేం ద్రోహం చేశారు? హుం... నువ్విలాంటివాడివని ఏమాత్రం తెలిసి ఉన్నా నిన్ను మా దాపుకి కూడా రానిచ్చేవాణ్ణికాదు...'' ఆవేశంలో ఇంకా ఎన్నిమాటలు అని ఉండేవాడో కానీ, ఎక్కడి నుంచీ వచ్చిందో కరుణ బలవంతంగా తనని చేయిపట్టి లాక్కుని ఇంటికి తీసుకెళ్ళింది.

వారం రోజులు ఎవరితోనూ మాట్లాడలేదు పరశురాం.

ఇప్పుడాలోచిస్తే తానారోజు ఎంత మూర్ఖంగా ప్రవర్తించేనా అనిపించింది! అబ్బ! ఎంతేసి మాటలన్నాను? హరి ఎంత బాధపడి ఉంటాడో! తన స్నేహితుడు పోయాడన్న బాధలో ఏంచేయాలో తోచలేదు అప్పుడు. ఆ ఆవేశంలో తప్పంతా అతనిదే అన్పించింది.

నిజానికి భార్య, మామగారు ఇద్దరూ ఒకేసారిపోయి దుఃఖంలో ఉన్న ఆ అబ్బాయిని



ఓదార్చాల్సిన బాధ్యత తనకి ఉంది. కానీ తను చేసిందేమిటి? అయినా అతనిలో ఎంత సహనం ఉంది? తను అన్ని మాటలు మాట్లాడినా, తన బాధ అర్థం చేసుకున్నవాడిలా మౌనంగా ఉండిపోయాడు. తన తప్పు ఏమిటని నిలదీసి తనని ప్రశ్నించలేదు. ఆరోజు నుండీ తను మళ్లీ హరి ముఖం చూడనేలేదు. ఆఫీస్‌లో తన వర్క్ అంతా చాలామటుకు రావుకే వదిలి వేశాడు.

మొదట్లో రావు మాటలు, అతని తీరు తనకి అంతగా నచ్చకపోయినా, రాను రాను అతని సమయస్ఫూర్తి, నేర్పు తన నమ్మకాన్ని సంపాదిస్తున్నాయి.

ఆ మధ్య ఒకసారి, తమ కంపెనీకి ఏటా ఒక నవల రాసి ఇచ్చే ఒక ప్రఖ్యాత రచయిత్రికి ఎక్కువ ప్రతిఫలం కావాలని ఆశ కలిగింది. అప్పటికే, తాము, ఏ కంపెనీ, ఏ నవలా రచయిత్రికీ ఇవ్వనంత రెమ్యూనరేషన్ ఇస్తున్నారు. ఇంకా పెంచటం, అనవసరం దండుగా కూడాను.

కానీ ఆవిడ అడిగినంతా ముట్టజెప్పకపోతే, తనిక ముందు తమకేమీ రాసివ్వనని బెదిరించింది తన ఏజంటు ద్వారా.

తనకేం చేయాలో తోచలేదు. రావుని పిలిచి ఒక మాట చెప్పాడు. అతను వెంటనే, "ఈ డీల్‌కి, ఒప్పుకోవద్దండి సార్! మనకి నష్టం" అన్నాడు.

"ఆ మాత్రం నాకూ తెలుసోయ్. 'నో' అని చెప్పటం అతిసులభంగా చేయవచ్చు. కానీ తర్వాత ఏమయ్యేదీ చూసుకోవాలి గదా మరి! నిజంగానే మనకిక ముందు రాసివ్వకపోవచ్చు."

"ఎందుకివ్వదండీ! ఆవిడే వచ్చి మన కాళ్ళు పట్టుకోవాలి"

ఆ మాటలేం అర్థం కాలేదు పరశురాంకి.

"ఆవిడ ఇలాగే చాలా కంపెనీలతో డిమాండు చేస్తోంది. నేనా వివరాలన్నీ కనుక్కున్నాను. ఎవరికీ ఏమీ ఇవ్వకుండా అన్నీ తనే పబ్లిష్ చేసుకోవాలని ప్లాను వేసినట్లుంది. అంతకన్నా తెలివి తక్కువ పని మరోటి ఉండదు."

ఇవన్నీ ఇతనికెలా తెలుసా అని ఆశ్చర్యపోయాడు పరశురాం. "మీరు చూస్తూ ఉండండి. చేయాల్సిందేమిటో నాకు తెలుసు. ఆవిడ ఒక్క పుస్తకం పబ్లిష్ చేసి రిలీజ్ చెయ్యనివ్వండి. చూద్దాం" దృఢంగా అన్నాడు రావు.

అప్పుడింత పనీ చేసి చూపించాడు తర్వాత. తమ కంపెనీ పుస్తకాలు డిస్ట్రిబ్యూట్ చేసే సంస్థలు, వాటి బ్రాంచీలు పెద్ద టవున్లు అన్నింటిలో ఉన్నాయి.

ఒక ఉత్తరం డ్రాఫ్టు చేసి, తనకు చూపాడు. దాన్నే కాపీలు చేసి తన పేరుమీదుగా ఆయా ఆఫీసులన్నిటికీ పంపించాడు. స్థూలంగా, దాంట్లో విషయం, ఫలానా రచయిత్రికీ తమ కంపెనీకి ఎటువంటి సంబంధము ఉండబోదని మాటల్లోనూ, ఆవిడ స్వంతంగా ప్రచురించే పుస్తకాలు ఆయా సంస్థల ద్వారా మార్కెట్ అవటం, తమ ఇష్టానికి విరుద్ధం అని మాటల వెనుక అర్థంలోనూ ఉన్నది. దాంతో రావు ఏదయితే జరగాలనుకున్నాడో అదే జరిగింది. ఆ రచయిత్రి ఒకే పుస్తకాన్ని మొదటి ప్రచురణకి ఐదువేల కాపీలు ప్రింట్ చేస్తే, అందులో పదిశాతం కన్నా అమ్ముడు అవలేదని తెలిసింది. ఇప్పుడో అప్పుడో ఆమే తమ దగ్గరికొస్తుందని రావు ఎదురుచూస్తున్నాడు.

అప్పుడప్పుడూ ఇంటికి వచ్చి, ఆఫీసు కబుర్లు చెబుతూ వుంటాడు రావు.

హరి ప్రతీ రోజూ తప్పనిసరిగా ఆఫీసుకి రావటమే కాకుండా, భోజనమూ, విశ్రాంతి కూడా లేకుండా అర్థరాత్రి దాకా పని చేస్తున్నాడట. ఒక రోజు గదులు ఊడ్చేందుకు స్వీపర్ వచ్చేసరికి, ఉదయం ఆరు గంటల సమయంలో టేబిల్‌మీద తల పెట్టుకుని నిద్రపోతున్నాడట. ఈ ప్రవర్తనకి అర్థం ఏమిటో తనకి తెలుసు. కొందరు బాధని తలచుకుంటూ మరింత దుఃఖంతో ఏ పనీ చేయకుండా తమని తాము ఒక గదిలో బంధించుకుని గడుపుతారు. మరి కొందరు, జరిగిన విషయాలని తలచుకునేందుక్కూడా తీరిక దొరకనంతగా పని చేస్తారు, కల్పించుకుని అయినా. బాధని మరచిపోయేందుకు అది ఒక మార్గం వారికి. తనవల్ల ఒకరికి బాధ కలగకూడదు అని అనుకునేవారు ఇలాగే ప్రవర్తిస్తారు.

నిజానికి విశ్వం ఈ కోవకే చెందుతాడు. మీనాక్షి చనిపోయిన తర్వాత కొన్ని రోజులు అతను ఎలా టయిం గడుపుతూ ఉండేవాడో తనకి తెలుసు. ఆ సమయంలో ఎన్నో పుస్తకాలు చదివాడు. కొన్ని వ్యాసాలూ రాశాడు పత్రికలకి అప్పట్లో, ఆ రోజుల్లో. తనకింకా గుర్తే అదంతా!

## పుచ్చిపోని కొయ్య!

జపానులోని డైకన్ ట్రేడ్ ఉడ్ పుచ్చిపోని కొయ్యను తయారు చేయటానికి సన్నాహాలను ప్రారంభించారు. క్యోట్ విశ్వవిద్యాలయం ఈ రకం కొయ్యను తయారు చేయటంలో డైకన్ సంస్థతో సహకరించింది. ఎసిటిక్ ఎన్‌హై(డ్రే)డుకు ఉపయోగించటంవలన పుచ్చిపోవటానికి దోహదం చేసే తేమ కీటకాలు అదుపులో ఉంచబడతాయి. ఈ కొత్త పద్ధతివలన ఇళ్ళ నిర్మాణంలో లోహాలు, ప్లాస్టిక్కులకు బదులు కొయ్యను ఉపయోగించటానికి వీలవుతుంది!

తను ఇలా జబ్బుపడి, అవతల హరి కూడా డీలాపడిపోయి వుంటే న్యూస్ పేపర్ నడపటం కూడా కష్టం అయి ఉండేది. అతన్ని తలచుకుంటే జాలి వేస్తోంది. భార్యా వియోగం ఎంత బాధాకరమో తనకీ తెలుసు. కామేశ్వరి పోయేసరికి అరుణకి పదేళ్ళు, కరుణకి అయిదేళ్ళుంటాయేమో! విశ్వం లాంటి మిత్రుడి సాహచర్యమే లేకపోతే తానా రోజు ఏ సన్యాసుల్లో కలిసి వెళ్ళిపోయేవాడో. అతనికున్న మనస్థైర్యాన్ని, తనలోనూ కల్పించి మామూలు మనిషిగా చేశాడు. అలాంటి వాడిప్పుడు హాయిగా తన దారి చూసుకున్నాడు!

ఒకప్పుడు తను హరి మంచివాడు, బుద్ధిమంతుడని తన కూతుర్నిచ్చి పెళ్ళి చేయాలనుకున్నాడు. వాళ్ళిద్దరికి కళ్యాణం రాసిపెట్టి లేదు. విశ్వం అల్లుడయ్యాడు. అతను అతడు తన కేవిధంగానో బంధువు అయి వుంటే అతని దుఃఖాన్ని పంచుకుని ధైర్యం చెప్పేవాడు కాదూ? పరాయివాడు కాబట్టే ఉదాసీనంగా ఉండగలిగాడు.

హరి నొకసారి ఇంటికి రమ్మని పిలిపిస్తే బావుంటుంది అనిపించింది, పరశురాంకి. వెంటనే ఫోన్ చేశాడు.

"హలో..." హరి స్వరం వినిపించింది.

"హరీ! నువ్వేనా? నేను పరశురాంని. చాలా రోజులయింది మనం కలుసుకుని. ఒకసారి ఇంటికి వస్తావా?"

"తప్పకుండా సర్! మీరిప్పుడు ఫ్రీగా వున్నారా?"

"పూర్తిగా ఫ్రీ. అమ్మాయిలూ లేరు. పిక్చర్‌కి వెళ్ళారు."

"ఓకే. పావుగంటలో వస్తాను."

పరశురాం మనసు కొద్దిగా తేలిక పడినట్లయింది.

కాలింగ్ బజర్ శబ్దం వినిపించగానే, హరిని తన గదికి తీసుకురమ్మని చెప్పాడు వంటమనిషికి.

హరి ముఖంలో ఎప్పుడూ కన్పించే చిరునవ్వు స్థానే, సీరియస్‌నెస్ చోటు చేసుకుంది. కళ్ళు బాగా లోతుకుపోయి, దవడ ఎముకలు బయటికి కన్పిస్తున్నాయి. చెదిరిపోయిన క్రాపు, నలిగిన బట్టలు చెప్పక చెబుతున్నాయి, అతను తన డ్రెస్ విషయంలో ఏపాటి శ్రద్ధ చూపుతున్నదీ.

"ముఖం కడుక్కుని రావోయ్. కొంచెం రిలీఫ్‌గా వుంటుంది" అని గది నానుకుని ఉన్న బాత్‌రూమ్ చూపించాడు పరశురాం. ముఖం కడుక్కుని, తల దువ్వుకుని వచ్చాక, కొంచం తేటగా కనిపించింది హరి ముఖం.

వేడి ఉప్మా ప్లేట్లు, కాఫీలు వచ్చాయి. హరి సగం కన్నా తీసుకోలేకపోయాడు. కాఫీ తాగి చుట్ట అంటించుకుంటూ, "నామీద ఇంకా కోపం పోలేదా హరీ?" అని అడుగుతున్న పరశురాంకేసి ఆశ్చర్యంగా చూశాడు హరిప్రసాద్.

''ఛ! నాకెందుకు సార్ కోపం ?'' నొచ్చుకుంటూ అన్నారు హరి.

''ఆవేళ ఏం మాట్లాడానో ఏమో నాకు ఒళ్లు తెలియ లేదు. అదంతా మనసులో పెట్టుకోవద్దు. విశ్వంతో నాకున్న స్నేహాని కున్న వయసు తెలిస్తే నాబాధ నీకు అర్థం అవుతుంది. ముప్పయ్యేళ్ల నాడు విశ్వం సహాయమే లేక పోతే నేనేమయి ఉండే వాణ్నో నేనే ఊహించలేను. అలాంటి వాడు ఈ లోకాన్ని వదిలి వెళ్ళి పోయాడంటే నా గుండెలో సగభాగాన్ని కోసి తీసేసినట్లుగా అయింది నాకు''

ఆయన చెప్పే మాటలు మౌనంగా వింటున్నాడు. ''సార్! నేనేం పర్థాయి వాణ్ణి కాదు. మీరు నన్ను నాలుగు మాటలు అన్నంత మాత్రాన నాకేం కోపం రాదు'' అని నిజాన్ని చెప్పాలనిపించింది, ఆ క్షణంలో. కానీ అంతకంటే ముఖ్యమయిన ఒక విషయం ఆయనతో చెప్పాల్సి వుంది. అది ఎలా మొదలు పెట్టాలా అని ఆలోచిస్తున్నాడు హరి.

## 38

''కర్నూలు సాఫ్ట్ డ్రింక్స్ ఫాక్టరీ ఎన్నేళ్ల నుంచీ రన్ అవుతూ ఉందో చెప్పగలరా ?''

''నాకు బాగా గుర్తులేదు. కానీ పదిహేను సంవత్సరాలు అయి వుండచ్చు. ఏం ?'' కుతూహలంగా చూశాడు పరశురాం హరి వంక.

''వాళ్ళ తయారు చేస్తున్న ''జాలీకోలా'' రుచిమీద నాకు అనుమానంగాఉంది. ఈవూళ్ళోనే ఏమిటి ఈ ఏరియా అంతా పాప్యులర్ డ్రింక్ అనుకుంటాను అది.''

''నిజమే. ఆమాటకొస్తే 'జాలీకోలా' రుచి నాకూ ఇష్టమే. బాగా డైల్యూట్ చేసిన ఆల్కహాల్ ఫ్లేవర్ తెలుస్తుంది తాగుతూ వుంటే. కదూ ? ..మన ఆఫీసులో ఏ పార్టీ జరిగినా 'జాలీకోలా' నే ఆర్డర్ చేస్తుంటాను నేను''

''నిజంగా ఆల్కహాలే మిక్స్ చేస్తున్నారేమో అందులో''

''నో. అలా జరగటానికి వీల్లేదు. సాఫ్ట్ డ్రింక్ లైసెన్స్‌మీద, ఎంత తక్కువ అయినా ఆల్కహాల్ మిక్స్ చేయటం నేరం. తెలుసా ? ఏవో కెమికల్స్ ఉపయోగించి ఆ రుచిని కల్పిస్తారనుకుంటాను.''

''నా దృష్టికి వచ్చిన రెండు ఉదంతాలు మీకు చెబుతాను. అప్పుడు నాకొచ్చిన అనుమానమే మీకూ వస్తుంది.

డాక్టర్ సుధాకరం తెలుసుగా మీ కు. ఆమధ్య ఒకసారి యాభయి బాటిల్స్ 'జాలీకోలా' వరసగా తాగుతానని పందెం వేసాడు వాళ్ళ పెద్ద అబ్బాయి రాజా. నిజంగా అతను తాగగలిగితే స్నేహితులంతా కలిసి వంద రూపాయలు ఇచ్చేట్టు ఒప్పించుకున్నాడు. ఇరవయి బాటిల్స్ తాగిన తర్వాత కళ్ళు తిరిగి




నట్లుయి పడిపోయాడుట. స్నేహితులంతా భయపడి రిక్షాలో ఇంటికి తెచ్చారు.

డాక్టర్‌గారు కోప్పడి కొడుకును పరీక్ష చేసి అవసరమయిన ఇంజక్షన్ ఒకటి వేసి పడుకో బెట్టారు. ఆవేళ నేను ఆఫీసునుంచీ ఇంటికి వెళ్ళేసరికి ఇంటిముందు డజను సైకిళ్ళు, గుంపుగా అబ్బాయిలు కనిపిస్తే డాక్టర్ గారింట్లోకి వెళ్ళాను నేరుగా. విషయం ఏమిటో తెలిసింది. అంతవరకూ జరిగినదంతా, తమాషాగా కన్పిస్తుంది కానీ ఆ అబ్బాయి ఆల్కహాల్ తీసుకున్నవాడిలా ఆ రాత్రి, మరురోజు పగలు, పూర్తిగ నిద్రపోవటం, వింతగా తోస్తుంది. రెండో రోజు రాత్రి నిద్రలేచి, 'మా ఫ్రెండ్స్ అంతా ఏరీ ? వంద రూపాయలు ఇచ్చారా ? ఇవ్వకుండా చెక్కేశారా వెధవలు !' అని అడిగేడట. డాక్టర్‌గారికే ఆశ్చర్యం కలిగింది ఆ అబ్బాయి నిద్రపోవటం చూస్తే. ఇది చాలా చిన్న ఉదాహరణ.

ఇంకొకటి చెబుతాను. మన ప్రెస్ ఫొటోగ్రాఫర్ రామ్మూర్తి గురించి నాకన్నా మీకే బాగా తెలిసి ఉంటుంది. అతను లిక్కర్స్ తీసుకోడని తెలుసుకదూ మీకు ?

లిక్కర్సేమిటి ? అసలు స్మోక్ కూడా చెయ్యడు. అతను ఈమధ్య నెల రోజులయి కడుపులో నొప్పి, మంట అని బాధపడుతున్నాడు. డాక్టర్ దగ్గరికి వెళ్ళి చూపించుకోవయ్యా అంటే ససేమిరా అంటాడు. అతనికి డాక్టర్స్ అంటే అలర్జీ. అలా ఎన్నాళ్ళు బాధపడతాడు ! ఆ నొప్పి ఇంకా ఎక్కువయి, మరే ప్రమాదానికో దారితీస్తే ఎలా అని నేనే బలవంతం చేసి, డా. సుందరం గారి దగ్గరికి పంపించాను, మనకి తెలిసిన వారు కదా అని.''

''మంచిపని చేశావు. మన కంపెనీలో పని చేసేవారి సంక్షేమమూ, ఆరోగ్యమూ అన్నీ మన బాధ్యతగానే చూసుకోవాలి. డా. సుందరం ఏం చెప్పారట ?''

''డాక్టరు గార్ని తిడుతూ వచ్చాడు రామ్మూర్తి ఆఫీసుకి. ఏమిటయ్యా విషయం అని అడిగితే, ''నాకు అల్సర్స్ ఉన్నాయి అంటున్నాడా డాక్టరు. ఏం డాక్టరు దగ్గరికి పంపించావయ్యా స్వామీ. నేనేమయినా స్మోక్ చేస్తానా, ఆల్కహాలిక్‌నా నాకెందుకొస్తాయి

# గోరంత దీపం

అల్సర్స్. కడుపు నొప్పి అనగానే అల్సర్స్ అనెయ్యటం మామూలు అయిపోయిందీ రోజుల్లో. అంతా అయి ప్రిస్క్రిప్షన్ రాసిచ్చింతర్వాత, ఆయనగారేమన్నారో తెలుసా? నా శరీరానికి ఎంత కొంచమయినా ఆల్కహాల్ పడదట. అందుకని నేను పూర్తిగా లిక్కర్స్ తీసుకోవటం మానాలట. ఇంతకన్నా పెద్ద జోక్ ఎక్కడయినా విన్నావా ? అని నవ్వుతూ చెప్పాడు రామ్మూర్తి' 'ఇప్పుడేమంటారు ?' అన్నట్లు చూశాడు హరి, పరశురాం వంక.

''చిత్రంగా ఉందే. డా. సుందరమే పరీక్షించారా స్వయంగా లేక మరెవరయినా అసిస్టెంటు ...''

''నోనో ! నేను ముందుగా ఫోన్‌చేసి చెప్పేనని స్వయంగా ఎగ్జామిన్ చేసి, బ్లడ్, యూరిన్ టెస్ట్స్ కూడా చేయించారట.

రామ్మూర్తికి కాఫీకన్నా ఇష్టమయింది 'జాలీకోలా' ఏ పార్టీలోనయినా కొద్దిగా బీర్స్ తీసుకోవటం కూడా ఇష్టం ఉండదు అతనికి. 'జాలీకోలా' మాత్రం ఎన్ని బాటిల్స్ అయినా తాగుతాడు. వేసవికాలం, చలికాలం అనే తేడా లేకుండా, రోజుకి కనీసం నాలుగు 'జాలీకోలా' తాగుతాడు. అందుకని ...''

''అర్థం అయింది నీ అనుమానం... కానీ అందుకు మనమేంచేస్తే బావుంటుందని ... నువ్వీ విషయాలన్నీ ఎంత కేర్‌ఫుల్‌గా రిపోర్ట్ తయారుచేసి పబ్లిష్ చేసినా, నువు రాసిన మాటలనే కావలసిన అర్థం వచ్చేలా ఇంటర్‌ప్రెట్ చేసి, ఆ కంపెనీ వారు మన మీద డిఫమేషన్ కేస్ పెట్టవచ్చు. అదే జరిగితే జవాబు చెప్పకోగలమా ? మన అనుమానాలు ఒట్టివి కాదు ఆధారాలున్నాయని చూపించే వీలుందా ?...''

''అవన్నీ ఆలోచించే మీ దగ్గర విషయాన్ని ప్రస్తావించాను. నా అనుమానం నిజమో కాదో తేల్చుకునేందుకు కొన్ని మార్గాలున్నాయి ?''

''ఓకే ! నీకు తెలిసినవి నాకు చెప్పనక్కరలేదు. నీకు నమ్మకంగా వుంటే ఏం భయపడద్దు. గో ఎ హెడ్. నేను నీకే సహాయం కావాలన్నా అందజేస్తాను...''

ఆ మాటతో ధైర్యం కలిగింది హరిప్రసాద్‌కి. అసలు పరశురాం ఇంత సులభంగా ఒప్పుకుంటాడని అతను అనుకోలేదు, ఎందుకంటే, కర్నూలు సాఫ్ట్ డ్రింక్స్ కంపెనీ పార్ట్‌నర్స్ ముగ్గుర్లో, కె. జి. నాయుడు అనే ఆయన పరశురాంకి మంచి స్నేహితుడు.

(ఇంకా వుంది)

# ఒకమారు ఉపయోగించారంటే బిజ్ మీరు మరిమరి కొనే పని వుండదు ఇహ మీకు.

## ఎందుకంటారా?




సూపర్ బిజ్‌లోని ప్రత్యేకమైన ఫార్ములా అదనంగా శక్తివంతమైన ఒక డిటర్జెంట్ కల్గి వున్నది. ఇది జిడ్డు-జిగట, మచ్చలు-మరకలు, మురికి-మైలను చిటికెలో తొలగించేస్తుంది. తళతళలాడే మెరుపు ఇస్తుంది. మరి అందులోనే వుంది—సాధారణ తోమే పౌడర్లలో లేని సూపర్ బిజ్ ఉత్కృష్టత. సూపర్ బిజ్‌లోని ప్రత్యేకమైన డిటర్జెంట్ త్వరగా నురుగు నిస్తుంది. కనుక మీరు త్వరగా, చక్కగా శుభ్రం చేసుకోగలరు. అందుకే ఎంతో ఎక్కువ జిడ్డు అయినవి ఏవి శుభ్రం చేయాలన్నా సరే, చౌక తోమే పౌడర్ల కన్నా దీనిని ఎంతో తక్కువగా ఉపయోగించుకోవచ్చు. అందుచేతే మీరు బిజ్ వాడి నిజంగా ఎంతో ఆదా చేసుకోవచ్చు.

మేము చెప్పాముగా మరి....ఒకమారు ఉపయోగించారంటే బిజ్ మీరు మరి మరి కొనే పని వుండదు ఇహ మీకు. ఎందుకంటే....




**కాస్త బిజ్ ఎంతో ఎక్కువ తోముతుంది.**

గోద్రెజ్ ఉత్పాదన

CASGS-161-254 TEL



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## నరేష్ హీరోగా వి ఎన్ ఆర్. పిక్చర్స్ చిత్రం

''ఒకే షెడ్యూల్లో మార్చి 20కి షూటింగ్ పూర్తవుతుంది,' అన్నారు రాజశేఖర్ ఈయన దర్శకత్వంలో డి పృథ్వీధరరావు సమర్పించే వి ఎన్ ఆర్ పిక్చర్స్ చిత్రం ఫిబ్రవరి 19న సెట్స్‌కు వెళ్లింది నరేష్, బాలాజి, శ్యామలగౌరి, అనూరాధ, గోకిన రామారావు, పి ఎల్ నారాయణ ప్రభృతి నటవర్గం పుష్పానంద్ కథ, స్క్రీన్‌ప్లేకు ఆదుర్తి నరసింహమూర్తి సంభాషణలకర్త సత్యం సంగీతం, రామకృష్ణ ఛాయ, కె రామలింగేశ్వరరావు శిల్పంలో వి ఎస్ రామసుబ్బన్న సహ నిర్మాత కె ఎల్ మోహన్‌రాజ్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ ''ఇంకో కథానాయిక కూడా ఉంటుంది ఆదెవరో త్వరలో తెలియచేస్తాను,'' అన్నారు నిర్మాత వి ఎస్ లక్ష్మి

'ఉక్కు మనిషి' లో కృష్ణంరాజు, రాధిక





'అదిగో అల్లదిగో' సుహాసిని

## "రామాయణంలో భాగవతం"

''ఏప్రిల్ నుంచి షూటింగ్,'' అన్నారు తాతినేని ప్రసాద్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ''శుభ ముహూర్తం'' అనంతరం సి ఆర్ ఆర్ ప్రసాద్, సి కె ఆర్ ప్రసాద్ నిర్మించే సత్యశక్తి పిక్చర్స్ ''రామాయణంలో భాగవతం'' చిత్రంలో సుహాసిని, గొల్లపూడి, జగ్గయ్య ఆదిగాగల వారుంటారు

'నన్ను చూడు నా అందం చూడు' సిల్క్‌స్మిత,



'కోడె త్రాచు'లో శ్రీదేవి

## "ఉక్కు సంకెళ్ళు"

"నా మూడవ చిత్రంలో ఎక్కువ భాగాన్ని సేవార్ లో షూట్ చేస్తాం," అన్నారు చందన పిక్చర్స్ అబ్దుల్ ఖాదర్. ఈయన "ప్రళయ సింహం" అనంతరం ఎ. చంద్రశేఖరరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిర్మించే ధర్మవిజయ పిక్చర్స్ "ఉక్కు సంకెళ్ళు" చిత్రంలో కూడా సుమన్ హీరో. రాజ్ - కోటి సంగీతం, దాశరథరాం ఛాయలో షేక్ ఫజుల్లా హాక్ నిర్మాత ప్రదీప కుమార్, సి హెచ్ కృష్ణ కుమార్ నిర్మాణ సారధులు. పి రీల చంద్రశేఖర రావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్

## డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు నిర్మించే హిందీ చిత్రం

"ఫిబ్రవరి 24న బొంబాయిలో ఫస్ట్ సాంగ్ రికార్డ్ చేశాం," అన్నారు డైరెక్టర్ కె రాఘవేంద్రరావు. ఈయన "త్రిశూలం" చిత్రాన్ని హిందీలో నిర్మిస్తున్నారు. రాజేష్‌ఖన్నా, శ్రీదేవి, పద్మిని కొల్హాపురి వగైరా తారాగణం

## కృష్ణతో "కంచుకాగడా"

"ఏప్రిల్‌లో పాటలు రికార్డ్ చేస్తాం. మే 31న మా హీరో పుట్టినరోజున షూటింగ్ మొదలెడుతున్నాం," అన్నారు నందిగం రామలింగేశ్వరరావు. ఈయన రామ్‌ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో స్కోప్‌లో నిర్మించే "కంచుకాగడా" చిత్రంలో కృష్ణ సరసన శ్రీదేవి నాయిక. సత్యమూర్తి కథ, సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, వి ఎస్ ఆర్ స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, సలీమ్ నృత్యాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో ఎ కోదండరామిరెడ్డి దర్శకుడు

'మీ డైరెక్షన్ గొప్పగా వుంది! ఈ దెబ్బతో నిర్మాత దశ తిరుగుతుంది!'

'కాయ్ రాజా కాయ్' తులసి

## 'కళాసాగర్' ఆధ్వర్యంలో "వేట కుక్కలు"

దేశం నలుమూలలనుండి అత్యుత్తమమైన తెలుగు నాటకాలను ఎంపిక చేసి వాటిని మద్రాసులోని తెలుగువారు దర్శించే అవకాశం కల్పిస్తున్న 'కళాసాగర్' సాంస్కృతిక సంస్థ ఇటీవల విశాఖ 'బహురూప నట సమాఖ్య' వారి "వేట కుక్కలు" ఏర్పాటు చేసింది. మురళీమోహన్ సమర్పించిన ఈ నాటకానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన నిర్మాత వై వి రావ్ "ఉదాత్తమైన ఇతివృత్తం. ఎస్ కె మిశ్రో, కె విజయలక్ష్మి, ఎం భీమేశ్వరరావు, ఎం టి నాగేశ్వరరావు, పి జగన్నాధరావు, ఎం నారాయణ రావు, కె ప్రసాద్, ప్రతిమ, బేబీ కల్పన - అందరూ తమ పాత్రల్లో జీవించారు. మిశ్రో ప్రతిభావంతంగా డైరెక్ట్ చేశారు," అంటూ ప్రశంసించారు

కృష్ణ, జయప్రద 'నాయకులకు సవాల్'

# సినిమా

**మురళీమోహన్ 'నిర్దోషి'**



శ్రీ భ్రమరాంబికా ఫిలింస్ ప్రొడక్షన్ నెం 2 చిత్రంలో సుమలత

## "నిర్దోషి"లో పగ

కిరణ్ (మురళీమోహన్) కారులో మానస (సుహాసిని)ని ఇంటికి తీసుకొచ్చాడు మానసకు అంతా అయోమయంగా ఉంది కిరణ్ కారు దిగుతూ, "నా పగ అయినా, ప్రెస్టేజ్ అయినా నా భార్య నా చెప్పు చేతుల్లో ఉన్నంత కాలమే ఉంటుంది నా పర్మిషన్ లేకుండా ఇంకోసారి కాలు కదిపా వంటే, నీ కాళ్ళు విరగ్గొట్టి మరీఇంట్లో బెడతాను మైండ్‌దట్ !" అన్నాడు

ఎక్కనే ఉన్న రంగన్న (సాక్షి) "బాబు గారూ? పగసాధించడానికి పట్టువిడుపులున్నాయి తోడబుట్టిన అన్నయ్య అంత ప్రమాదంలో ఉంటే " అంటూ ప్రధేయపడ్డాడు

"షటప్ ! నా చెల్లెల్ని చంపి, నా జీవితాన్ని చిందరవందర చేసిన వారి జీవితాలు ఇలాగే ఒకరికొకరి దక్కకుండా పోవాలి అటు చావు రాక, ఇటు బ్రతకా లేక జీవచ్ఛవంలా ఇది బ్రతకాలి దీన్ని చూస్తూ వాళ్ళు ప్రతి క్షణం నెత్తురు బొట్లు రాల్చాలి" అంటూ కిరణ్ జేబులోంచి టెలిగ్రామ్ తీసి చించేస్తూ, "ఈ టెలిగ్రాం లాగే మీ అన్నయ్య జీవితం కూడా ముక్కలయిన రోజున నీకు ముక్తి లభిస్తుంది" అంటూ గబ గబా మేడ మీదకు వెళ్ళిపోయాడు.

మానసకు దుఃఖం ముంచుకొచ్చింది

రాజాచంద్ర దర్శకత్వంలో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించే జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "నిర్దోషి" చిత్రంలో చంద్రమోహన్, రాజ్యలక్ష్మి, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, పొట్టిబాబు, శుభ, అనురాధ ఇతర పాత్రధారులు. కాశీ విశ్వనాథ్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, కె ఎస్ హరి ఛాయ, డి రాజగోపాల్ కూర్పు, గోగినేని రాఘవరావు సహ దర్శకత్వంతో కిషోర్ నిర్మాణ సారధి

# సినిమా



"హీరో" చిరంజీవి

## "హీరో"లో పోటీ

కొండబాబు (రావుగోపాలరావు)కి ప్రతి విషయంలో పోటీ వస్తూంటాడు అంజనేయులు. (అల్లు రామలింగయ్య). "నీదంతా యిచిత్ర మైన వేదాంతంరా. చెపులెందుకున్నాయిరా సన్నాసి నా కొడకా — అని అడిగితే. చుట్ట ముక్కలు దోపుకోడానికంటావు. కాళ్ళెందుకున్నాయిరా కంత్రీ నా కొడకా—అంటే, సారా దుకాణానికి నడుచుకెళ్ళడానికే అంటావు తప్ప — ఒక పనీ సరిగ్గా తగలెట్టవు యికరం మకరం నా కొడకా!" అంటూ కొండబాబు మంచం మీద కూర్చున్నాడు. ఆయన పక్కన కూర్చోనున్న మిస్ జాయ్‌ని చూస్తూ అంజనేయులు "చూడు బుల్లీ! నా సంగతి నీకు తెలుసో-తెలీదో... ఆయన చేసే ప్రతి పనిలోనూ నా సహకారం ఉంటూ ఉంటుంది," అన్నాడు.

కొండబాబుకు చిర్రెత్తుకొచ్చింది. "ఇందులో నీ కోపరేషన్ నా కనవసరం. నేను తినే అన్నంలో ఓ ముద్దడుగు-పారేస్తాను. తాగే విస్కీలో ఓ పెగ్గడుగు—పోస్తాను. అంతేగాని, నా సరసంలో నీ తలకాయ అడ్డం పెట్టావా— నీ మెడకాయ కొరికేస్తాను. వెళ్ళు," అన్నాడు.

అంజనేయులు టేబుల్ మీదున్న విస్కీ బాటిల్‌ను చంకన పెట్టుకొని చల్లగా జారుకున్నాక మిస్ జాయ్ "నా ఒంట్లో హుషారు, కంట్లో నిషా ఉన్నప్పుడు నన్ను మీ చరణదాసిగా ఉంచేస్కోకూడదా?" అంది.

కొండబాబు ఖాళీ చేసిన గ్లాసును టీపాయ్ మీద పెడ్తూ, "చరణదాసీ, మసాలాదోసీ- అంటూ యెదవ డైలాగులు చెప్పకే. యీ మనసుంది చూసేవా—సినిమాహాలు తెరలాంటిది. దీనిమీదికి అనేక ఆడబొమ్మలొచ్చి ఆడిపోతుంటాయి. కొన్ని జత దినోత్సవాలు ఆడతాయి. కొన్ని వారాలపాటు ఆడతాయి. కొన్ని నెల్లపాటు ఆడుతాయి," అంటూ తూలి పడిపోయాడు.

విజయ బాపినీడు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అల్లు రామలింగయ్య సమర్పించే గీతా ఆర్ట్స్ "హీరో" చిత్రం మార్చి 16న విడుదల. చిరంజీవి, నూతన్‌ప్రసాద్, రంగనాథ్, ప్రసాద్‌బాబు, ఉదయకుమార్, రాధిక, సంగీత, కృష్ణవేణి, నిర్మల, పుష్పలత, జయమాలిని, జ్యోతిలక్ష్మి, సిల్క్ స్మిత పాల్గొన్నారు. కాశీ విశ్వనాథ్ మాటలు, ఆత్రేయ పాటలు, కృష్ణ—చక్ర సంగీతం, లోక్‌సింగ్ ఛాయ, కళాధర్ శిల్పం, గౌతంరాజు కూర్పు, బాబూరావు నిర్వహణతో అల్లు అరవింద్ నిర్మాత.

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు పుత్రుడు, నిర్మాత చి. నాగార్జున అక్కినేని కి ప్రముఖ నిర్మాత శ్రీ డి. రామానాయుడు పుత్రిక చి.ల.సౌ.లక్ష్మి తో ఫిబ్రవరి 18న వివాహ మహోత్సవం జరిగినప్పుడు వధూవరులకు ఆశీస్సులందచేస్తున్న ప్రముఖ తమిళ నటుడు శ్రీ శివాజీగణేశన్.



శరత్ బాబు, రాగిణి

'ప్రేమ దీపాలు'



# నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : 14 14 : 21. మల్లిఖార్జునరావు వీధి, విజయవాడ 520003

## ప్రజలనుంచి, వాటాదార్లనుంచి ఫిక్సెడ్ డిపాజిట్లు / ఋణములు అంగీకరించుట / పునరుద్ధరించుట జరుగును.

### షరతులు, నిబంధనలు :

1. కనీస మొత్తం రు. 2000లు లేదా ఆపై రు. 1000లో హెచ్చింపబడు మొత్తమునకు డిపాజిట్లు అంగీకరించడం/ పునరుద్ధరించడం జరుగుతుంది.
2. డిపాజిట్లు/ఋణములు కనీస పరిమితి 1 సంవత్సరమునకు గరిష్ఠ పరిమితి 3 సంవత్సరముల కాలమునకు అంగీకరించ బడును.
3. దరఖాస్తు ఫారములో పేర్కొన్నటువంటి షరతులు, నిబంధనలకు లోబడి డిపాజిట్లు, ఋణములు అంగీకరించడం జరుగుతుంది. దరఖాస్తు ఫారములు విజయవాడలోగల మా రిజిష్టర్డు కార్యాలయంలోనూ, హైదరాబాదు నెం.5—9—49, బషీర్‌బాగ్ లోని మా బ్రాంచి కార్యాలయం నందును లభ్యము కాగలవు.
4. డిపాజిట్లు/ఋణములు తిరిగి చెల్లింపులుగాని, వడ్డీ చెల్లింపులు గాని డిపాజిటు స్వీకరించిన ఆయా ప్రదేశములలోని కంపెనీ బ్యాంకర్లు, క్రాస్‌చేసిన చెక్కులద్వారా చెల్లించ బడుతుంది.
5. కొత్తగా దరఖాస్తు పెట్టుకొని, వున్నడిపాజిట్లు పునరుద్ధరించుకోవచ్చును.
6. తిరిగి చెల్లించే గడువు ముగియక మునుపే, డిపాజిటు మొత్తాలను తిరిగి చెల్లించే హక్కు కంపెనీ కలిగి యుంటుంది
7. వడ్డీని ప్రతి ఆరునెలలకు అంటే ఏప్రిల్ 30న మరియు అక్టోబరు 31న ఈ క్రింది రేట్లపై చెల్లించబడుతుంది.

| | |
|---|---|
| ఒక సంవత్సరానికి | సాలుకు 13% |
| రెండు సంవత్సరాలకు | సాలుకు 14% |
| మూడు సంవత్సరాలకు | సాలుకు 15% |
| (డైరెక్టర్ల నుండి | సాలుకు 12% |

1956 కంపెనీల చట్టంలోని సెక్షన్ 51 ఏ క్రింద సవరించిన 1975 కంపెనీల నిబంధనల ప్రకారం (డిపాజిట్లు అంగీకరించు విషయంలో) కంపెనీ యొక్క వివరాలు :

I. కంపెనీ పేరు . నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్,
14—14—21 మల్లిఖార్జునరావు వీధి, విజయవాడ—520 003.

II. స్థాపించిన తేది : 4 మే 1955.

III. వ్యాపారము . వార్తా పత్రికలు, తదితర పత్రికలు అనగా ఆంధ్రపత్రిక, (దిన పత్రిక), ఆంధ్ర సచిత్రవార పత్రిక, (వారపత్రిక) భారతి, (మాస పత్రికలను) విజయవాడ, హైదరాబాద్‌లలోని కంపెనీ స్వంత రోటరీ, మరియు ఆఫ్‌సెట్ ముద్రణ యంత్రములపై ప్రింటు చేసి ప్రచురిస్తున్నది.

IV. మేనేజిమెంటు : బోర్డు ఆఫ్ డైరెక్టర్ల కంట్రోలు, మరియు సూచనల మేరకు మేనేజింగ్ డైరెక్టరువే కంపెనీ నిర్వహించబడుచున్నది.

V. బోర్డుఆఫ్ డైరెక్టర్ల పేర్లు, చిరునామా, వృత్తి.

| | పేరు | చిరునామా | వృత్తి |
|---|---|---|---|
| 1. | శ్రీ ఎస్. రాధాకృష్ణ (మేనేజింగ్ డైరెక్టర్) | 14-14-21, మల్లిఖార్జునరావువీధి, గాంధీనగరం, విజయవాడ—3. | డైరెక్టర్. |
| 2. | శ్రీమతి ఎస్. కామాక్షమ్మ, | నెం. 1, లజ్ ఎవెన్యూ, మైలాపూరు, మద్రాసు—4. | డైరెక్టర్. |
| 3. | శ్రీ ఎస్. నాగేశ్వరరావు, | నెం. 1, లజ్ ఎవెన్యూ, మైలాపూరు, మద్రాసు—4. | డైరెక్టర్. |
| 4. | శ్రీ సి.హెచ్. పూర్ణచంద్రరావు, | కేరాఫ్ విజయాపిక్చర్స్, గాంధీనగరం, విజయవాడ—3. | డైరెక్టర్. |

VI గడచిన మూడు ఆర్థిక సంవత్సరములలోనూ పన్నులు డివిడెంట్లు, కేటాయింపులకు ముందు, తర్వాత కంపెనీ, లాభాలు (ఆడిట్‌కాబడిన బ్యాలెన్స్ షీట్లు నుండి అంకెలు)

| 30 ఏప్రిల్ నం అంతమునకు | పన్నుకు ముందు లాభము | పన్ను తర్వాత లాభము | ప్రకటించిన డివిడెంటు% |
|---|---|---|---|
| 1981 (నష్టము) | రు. 152005 (నష్టం) | రు. 152005 (నష్టం) | లేదు |
| 1982 | రు. 39721 | రు. 39721 | లేదు |
| 1983 (నష్టము) | రు. 238108 (నష్టం) | రు. 238108 (నష్టం) | లేదు |

**VII** ఆడిట్ కాబడిన గడచిన రెండు బ్యాలెన్స్‌షీట్లలో సూచించిన కంపెనీ ఆర్థికస్థితి గతుల సంగ్రహ రూపము.

| అప్పులు | 30.4.1983 నాటికి ఆడిట్ కాబడిన లెక్కల ప్రకారం లభించిన గత ఆర్థిక సంవత్సరానికి అంకెలు | రెండవకాలంలో సూచించిన ఆర్థిక సంవత్సరానికి ముందు సంవత్సరానికి 30.4.1982 నాటికి లభించిన అంకెలు | ఆస్తులు | 30.4.1983 నాటికి ఆడిట్ కాబడిన లెక్కల ప్రకారం లభించిన గత ఆర్థిక సంవత్సరానికి అంకెలు | రెండవకాలంలో సూచించిన ఆర్థిక సంవత్సరానికి ముందు సంవత్సరానికి 30.4.1982 నాటికి లభించిన అంకెలు |
|---|---|---|---|---|---|
| 1. 2. | 3. | 4. | 5. | 6. | 7. |
| షేర్‌కాపిటల్ | 3,71,000 | 2,55,000 | ఫిక్సెడ్ ఆస్సెట్స్ | 15,46,449 | 12,53,786 |
| రిజర్వులు సర్‌ప్లస్ | 3,51,802 | 5,91,356 | పెట్టుబడులు | 11,545 | 11,545 |
| సెక్యూర్‌డ్‌లోన్స్ | 19,55,228 | 13,99,931 | కరెంట ఆస్సెట్స్ | 51,91,342 | 48,22,867 |
| అన్‌సెక్యూర్‌డ్‌లోన్స్ అండ్ డిపాజిట్లు | 3,09,056 | 2,77,000 | లోన్స్ అండ్ అడ్వాన్సెస్. | 2,06,032 | 1,94,541 |
| | | | మిసలేనియస్ ఖర్చులు, | —— | —— |
| వర్తమానఅప్పులు కేటాయింపులు | 39,68,282 | 37,59,452 | లాభాలు, నష్టం అకవుంటు. | —— | —— |
| మొత్తం | 69,55,368 | 62,82,739 | మొత్తం | 69,55,368 | 62,82,739 |

**VIII** కరెంట్ లయబిలిటీ కేటాయించబడలేదు.

| | 30—4—19 నాటికి | 30—4—1982 నాటికి |
|---|---|---|
| లెటర్ ఆఫ్ క్రెడిట్ ద్వారా కొనుగోలుచేసిన ముడివస్తువులు | 11,51,873 | రు. 5,29,000 |

**IX** డిపాజిట్ల ద్వారా కంపెనీ సేకరించ గల మొత్తం — రు ,

**X** ఆర్థిక సంవత్సరమునకు ముందురోజున (30.4.1983) ఉన్నటువంటి నగటు డిపాజిట్లు. — రు. 1,83,000

**XI** ఈ ప్రకటన తేదీనాటికి, అన్‌క్లెయిమ్డ్ డిపాజిటు మినహా ఓవర్‌డ్యూ డిపాజిట్లు కంపెనీ కలిగియుండలేదని ఇందు మూలంగా కంపెనీ తెలియ జేస్తున్నది.

**XII** కంపెనీ ఇందు మూలంగా ప్రకటించు చున్నది.

1. 1975 నవరించిన కంపెనీ నిబంధనలను (డిపాజిట్లు అంగీకరించుట కంపెనీ గౌరవిస్తున్నదని, 31మార్చి 1984న ఆలోగా డిపాజిట్లు గడువు పూర్తయ్యేలోగా తిరిగి చెల్లించడానికి ఒక జాతీయ బ్యాంకులో అవసరమైన మొత్తం జమ చేయబడినది.
2. డిపాజిటు మొత్తాలం తిరిగి చెల్లించే విషయంలో కేంద్రప్రభుత్వం పూచి ఉంటుందనే నిబంధన ఇందులో లేదు.
3. కంపెనీ అంగీకరించిన డిపాజిట్లు అన్ సెక్యూర్‌డ్ లోన్స్, ఇవి ఇతర అన్ సెక్యూర్‌డ్ లయబిలిటీస్‌తో పాటు పరిగణించ బడతాయి.
4. డిపాజిట్లు ద్వారా పునరుద్ధరణ ద్వారా వచ్చిన మొత్తాన్ని కంపెనీ వర్కింగ్ కాపిటల్ క్రింద ఉపయోగించు కొనవచ్చును.

**XIII** (1). ఈ ప్రకటన, కంపెనీ బోర్డుఆఫ్ డైరెక్టర్ల ఆమోదము మేరకు ఇవ్వ బడుచున్నది.

(2) ప్రకటన అంశాలు, కంపెనీయొక్క బోర్డ్‌ఆఫ్‌డైరెక్టర్లచే 26 12.1983న జరిగిన సమావేశంలో ఆమోదించబడినది.

(3) బోర్డు ఆఫ్ డైరెక్టర్లచే ప్రకటన అంగీకరించు నపుడు మెజారిటీ సంఖ్యలో డైరెక్టర్ల సంతకంగల ఈ ప్రకటన కాపీ రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీస్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్ వారికి రిజిస్ట్రేషన్‌కోసం దాఖలు చేయబడినది.

బై ఆర్డర్ ఆఫ్‌ది బోర్డు.

వర నాగేశ్వరరావు ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్.

(ప్రొప్రయిటర్స్ ఆఫ్ ది ఆంధ్ర పత్రిక),

(సం) ఎస్. రాధాకృష్ణ,

మేనేజింగ్ డైరెక్టర్.

మద్రాసు.

తేది : 26.12.1983

# కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

సం॥

---



## సినిమా

# ఇరుగు - పొరుగు

★ "పైరేట్" ఆంగ్ల చిత్రంలో అడ్మండ్ మంత్రగాడుగా నటించాడు. మనిషి పుర్రె నుంచి తీసినముక్కలతో పొందగబడిన ఉంగరాలను అతను చేతులకు ధరించాడు. ఇప్పుడలాంటి ఉంగరాలకు కొన్ని దేశాలలో గిరాకీ ఏర్పడింది. స్టెర్లింగ్ సిల్వర్‌లో తయారు చేయబడే ఆ ఉంగరాలు ధరిస్తే అదృష్టదేవత వరిస్తుందనీ, కోరినవి లభిస్తాయనీ, వశీకరణశక్తి సిద్ధిస్తుందనీ కొందరి నమ్మిక.

★ బొంబాయివద్ద మఢ్ దీవిలో జి పి సిప్పీ తన "సాగర్" చిత్రంకోసం ఒక బుల్లి నగరాన్నే నిర్మించేశాడు. గొట్టపు బావులు, ఇళ్ళు, టెలిఫోన్ కనెక్షన్, మినీ రెస్టారెంట్ వగైరాలతో నిర్మించిన ఆ భారీ సెట్‌లో కమలహాసన్, డింపిల్ పాల్గొన్న ఎన్నో సన్నివేశాలు నిర్విరామంగా చిత్రీకరింపబడ్డాయి. ఈ మధ్య ఇంత పెద్ద సెట్‌ను ఔట్‌డోర్‌లో ఎవ్వరూ వేయలేదు

★ 1983 వరకు భారీ నిర్మాత చిత్రాలకు పని చేసిన లక్ష్మీకాంత్–ప్యారేలాల్ కాస్త వెనుకబడిపోతున్నారేమో ననిపిస్తోంది రాజ్ కపూర్, మన్‌మోహన్ దేశాయ్, మనోజ్‌కుమార్‌లు సైతం కొత్త సంగీత దర్శకులను నియమించుకుంటున్నారు ఇప్పుడు దక్షిణాది నిర్మాతలను ఆకర్షిస్తున్న సంగీత దర్శకుడు బప్పిలహరి.

★ మనదేశంలో ప్రతిరోజూ కోటి మందికిపైగా వీడియో ప్రదర్శనలు తిలకిస్తుంటారని అంచనా వేయబడింది. ఇందువల్ల చిత్ర పరిశ్రమకు దాదాపు పాతిక లక్షలు నష్టమట.

★ చాలా కాలం తర్వాత "నెవర్ సే నెవర్ అగైన్" చిత్రంలో జేమ్స్‌బాండ్ పాత్ర ధరిస్తున్న సీన్ కానరీ "ముమ్మాటికీ ఇదే నా చివరి 007 పాత్ర. ఇక కొద్ది కాలంలో నా వయసు 56 దాటుతుంది. షుమారు 35 ఏళ్ళున్నవాడే ఆ పాత్ర ధరించడానికి అర్హుడు. ఇక ఆ పాత్రను ధరించగల్గిన వ్యక్తి రోజర్‌మూర్ ఒక్కడే," అని లండన్‌లో తెలియజేశాడట.

★ "పూర్ణిమా జయరామ్ నా చిత్రాల్లో నటించేటప్పుడు ఆమెపట్ల నా కేవిధమైన అభిప్రాయమూ కల్గలేదు చాలా సెన్సిటివ్ టైప్ ఒకసారి షూటింగ్‌లో 'ఏమిటమ్మా నేనొక విధంగా చెప్తే నువ్వు మరొక విధంగా చేస్తున్నావ్?' అన్నందుకే ఆమె కంటతడి పెట్టింది ఒక ఆర్టిస్టుకి, డైరెక్టర్‌కి మధ్య నుండే సంబంధమే మా ఇద్దరి మధ్య ఉండేది. ప్రవీణ పోవడం నాకొక గొప్ప లోటు. నటించడం, చిత్రాలు తీసిపెట్టడం తప్ప మిగతా విషయాలేవీ నేను పట్టించుకునేవాడ్ని కాను డబ్బు విషయాలు, కాల్‌షీట్ల విషయాలు, ఇంటి విషయాలు, అన్నీ ప్రవీణే చూసుకునేది ఆ లోటు భర్తీ చేయగల అర్ధాంగి లభించకపోతే నా పర్సనల్ లైఫ్, నా పబ్లిక్ లైఫ్ ఏమైపోతాయోనన్న బెంగ పట్టుకుంది నాకు . ఒకసారి బొంబాయి వెళ్లినప్పుడు అక్కడు పూర్ణిమను అకస్మాత్తుగా నేను చూడడం జరిగింది. ఎందుకో అప్పడే ఆమె ప్రవర్తన నాకెంతో నచ్చినట్లనిపించింది వెంటనే నేనామెను పెళ్ళాడదల చానని చెప్పడం, ఆమె ఆలోచించి చెప్తాననడం, ఆ తర్వాత సరేనని చెప్పడం అంతా కొన్ని గంటలలో జరిగిపోయాయి తమాషా ఏమిటంటే – మా గురించి పత్రికల్లో ఊహాగానాలు రావడానికి మునుపే మేం పెళ్ళి చేసేసుకున్నాం," అన్నారు భాగ్యరాజా నవ్వుతూ. ★




# ఇంద్రనీలాలు

పాలకోడేటి వేణు

ఎందుకు శ్రీనివాసరావుకి ఆ కళ్ళంటే ఇష్టమో చెప్పలేడు. ఆ కళ్ళు మీనాల్లాంటివా? కావు. కొందరికి నీలి కళ్ళంటే యిష్టం. మరికొందరికి తేనె రంగు కంటి పాపలున్న కళ్ళంటే యిష్టం ఇవేమీ లేనివి శ్యామల కళ్ళు కాని అవే శ్రీనివాసరావుకి ప్రాణం. ఆ కళ్ళల్లో ఏదో తెలియని, ఇది ఫలానా అని నిర్వచించలేని అనుభూతి శ్రీనివాసరావుకి కలుగుతుందా? అంటే ఔనని సిగ్గుపడ్డాడు. తననేవో వింతలోకాలకి తీసుకుపోతున్నాయి ఆ కళ్ళు అంటాడు శ్రీనివాసరావు. తను ఎన్నేళ్ళయినా ఎన్ని యుగాలైనా ఆ కళ్ళల్లోకి చూస్తూ గడిపేయగలనంటాడు. ఆ కళ్ళని తన కళ్ళతో చూడమంటాడు. ఆ కళ్ళ గొప్పదనం మన దగ్గర వర్ణిస్తాడు. ఆ కళ్ళలాంటి కళ్ళు యీ భూప్రపంచంలో మరెవ్వరికీ లేవంటాడు

ఆ కళ్ళవోనరు రెండు పదులు దాటని శ్యామల. చామనఛాయ మనిషిని కట్టిపడేసేటంత అందం కాదామెది. కాని ఒకసారి చూస్తే మరోసారి చూడాలనిపిస్తుంది. అంతే! చదువు ఇంటర్మీడియట్ రెండుసార్లు తప్పి మూడోసారి అతికష్టంమీద అత్తెసరు మార్కులతో ఔననిపించుకొంది ప్రస్తుతం ఏం చెయ్యాలో తోచక, టైపు నేర్చుకుంటూంది.

బ్రతకలేక బడిపంతులన్నట్లు, గోవిందరావు గారు ఓ ఎలిమెంటరీ స్కూలికి హెడ్మాస్టరుగా పనిచేసి రిటైరయ్యారు — అదీ నిర్బంధంగా ఏభై అయిదు ఏళ్ళకే రిటైరు చేయించబట్టి.

మరో మూడేళ్ళు సర్వీసుందికదాని కూతురు శ్యామల పెళ్ళి వాయిదా వేసేరు. కాని హటాత్తుగా రిటైర్ కావడం ఆయనని మానసికంగా కృంగదీసింది. పైకి గంభీరంగావున్నా లోపల కుమిలిపోతున్నారు. ఇప్పుడెలా అమ్మాయికి సంబంధం కుదర్చడం? ఇంత హటాత్తుగా ఎక్కడ నుండి వేలకువేలు కట్నం తెచ్చి గుమ్మరించగలడు? అంతా అగమ్యగోచరంగా తయారైంది గోవిందరావుగారి పరిస్థితి.

పోనీ రిటైర్ అయిన వెంటనే పెన్షన్ వచ్చేటట్లు చేస్తామని ప్రభుత్వం హామీ యిచ్చినా ఆ హామీని ఇంతవరకు పట్టించుకొనే నాధుడే లేకపోయాడు. పెన్షన్ రాకపోతెమానె, కోర్టుకు వెళ్ళని వాళ్ళందరికీ మొదట రెండు నెలల జీతం తరువాత మూడు నెలల జీతం ఇమ్మని కోర్టు ఆదేశాలిచ్చినా, ఐదునెలల జీతం పదినెలల దాటేన్తరువాత వొచ్చింది.

జీతం రాళ్ళు తప్ప మరే ఇతర ఆదాయమూ లేని గోవిందరావుగారు తనకంటూ ఆస్తిగాని,



కళాసాగర్ (మదరాసు) ఆధ్వర్యంలో సినీనటుడు మురళీమోహన్ సమర్పించిన విశాఖ బహురూప నటసమాఖ్యవారి "వేట కుక్కలు" నాటక ప్రదర్శనానంతరం దర్శకుడు శ్రీ ఎస్. కె. మిశ్రోని అభినందిస్తున్న ప్రముఖ నిర్మాత శ్రీ వై. వి. రావుగారిని చిత్రంలో చూడవచ్చు.

# ఇంద్ర నీలాలు

చిన్నసైజు పెంకుటిల్లు గాని నిలబెట్టుకోలేక పోయారు. కాని, ఆయన ముప్ఫైఏళ్ళ సర్వీసు లోనూ తనకంటూ మిగుల్చుకోగలిగినది గుండె మీద కుంపటిలా వున్న పెద్దకూతురు శ్యామల, అక్క బరువు దిగేసరికి నా బరువు నీ గుండెల మీదకి ఎక్కిస్తానంటున్న యీ మధ్యనే రజస్వల అయిన రెండో కూతురు రజని, ఇక మూడోవాడు థెంత్‌క్లాస్ సెకండ్ క్లాస్‌లో పాసయి, ఇంటర్మీడియట్‌లో కావలసిన గ్రూపు దొరక్క దొరికిన గ్రూపుతో సరిపుచ్చుకొన్న బాబు అనబడే మోహన్.

గోవిందరావుగారు ఇన్ని బరువులతో యింకా బ్రతికి వుండగలుగుతున్నారంటే, నిశ్చింతగా వున్నట్టు పైకి కనపడగలుగుతున్నారంటే దానికి కారణం గోవిందరావుగారి భార్య మహాలక్ష్మిగారు.

ఏనాడైతే ఆమె ఆయన యింట్లో అడుగు పెట్టిందో, ఆనాటి నుంచి గోవిందరావుగారు బాధలు పడలేదని కాదుగాని, ఆమె మూలాన బాధలనుంచి ఆయనకు ఏదో తెలియని రిలీఫ్ కలిగేది. కష్టాలు ఎంత తీవ్రమయినవైనాసరే ఆమె వోదార్పు మాటలతో వుపశమించేవి అనిపించేదాయనకు.

తండ్రి మరణించిన రోజున, తనకు లోకం అంధకారబంధురంగా కనబడింది. అప్పుడు ఆవిడ మాటలను తను జీవితాంతం మర్చిపోలేననిపించి దాయనకు.

"ఏమండీ ! మీరలా బాధపడకూడదు. మీరే అలా దిగులు పడితే మీకంటే చిన్నవాళ్ళు మరీ బెంబేలెత్తిపోతారు. మీరు ఇంకా చెయ్యాల్సిన పనులు చాలావున్నాయి."

ఇవి అందరూ వుపయోగించే అతిసామాన్య మయిన వోదార్పు మాటలు. కాని అవే మాటలు చెప్పే తీరులో తనకేదో తెలియని వోదార్పు, నిశ్చింత లభించేయి ఆయనకు. అప్పుడామె ఆయనకు భార్యలా కనిపించలేదు. ఎవరో దేవత ఒడిలో పసిపాపలా వున్నట్టు, అతని దుఃఖం అంతా చేత్తో తీసి ఆమె అవతలపారవేసినట్లు అనిపించిందాయనకు.

ఇప్పుడు యీ పరిస్థితులలో, నెలనెలా వొచ్చే జీతం రాళ్ళు ఇక బంద్ అయినాయి. పచారీ షాపువాడు సరుకులు ఇవ్వడం తగ్గించాడు. వుద్యోగం వున్న రోజులలో అయితే, "పంతులుగారూ ! మీరు అంతగా చెప్పాలిటండీ, ఈ నెల్లో కాకపోతే వచ్చేనెల్లో మిగిలిన బాకీ తీర్చేద్దురుగాని" అనేవాడు. ఇప్పుడు బజార్లో ఎదురుపడితే మొహం చాటేస్తున్నాడు.

రంగాచారి, అదే పచారీ షాపువాడు, వ్యంగ్యంగా అంటున్న మాటలు తన చెవిన పడుతున్నాయి అప్పుడప్పుడు.

మొన్నటికి మొన్న, మోహన్ సరుకులకోసం వెడితే, చాలాసేపు నిలబెట్టి వుంచి, ఏదో సణుక్కుంటూ కేజీ అడిగితే అరకేజీ చొప్పున సరుకులు ఇచ్చాడట, ఇంతకు ముందు ఎంత కావాలంటే అంత పట్టుకెళ్లమనే రంగాచారి.

గోవిందరావుగారికి నవ్వొచ్చింది. ఇదీ ప్రస్తుత సమాజం. 'ధనమూల మిదం జగత్' అని పెద్దలు వూరికే అనలేదు. ఎన్ని ప్రణాళికలు వేసినా యీ భారతదేశంలో మధ్యతరగతి మనిషి స్థితి పెరిగేదెప్పుడు ? ఎప్పుడు మధ్యతరగతి మనిషి అటు ధనం ఎక్కువైపోయిన తరగతికి చెందక, ధనహీనులైన అట్టడుగు దరిద్ర నారాయణుల స్థితికి దిగజారలేక, మధ్యలో త్రిశంకు స్వర్గంలో వ్రేలాడుతున్న పరిస్థితి నుంచి బయట పడతాడు?

అయితే గోవిందరావుగారికి ఆస్తి ఎందుకు లేదూ, ఇల్లు ఎందుకు కట్టించలేదు ? ఈ ప్రశ్నలే మరోలా వేస్తే బాగుంటుంది. గోవిందరావుగారు ఆస్తి ఎందుకు సంపాదించుకోలేక పోయారు. ఇల్లు ఎందుకు కట్టించుకోలేక పోయారు. ఈ ప్రశ్నలకి సమాధానం గోవిందరావ్ గారి దగ్గర వున్నది. అది 'ఆదర్శం' నైతికవిలువలకి కట్టుబడి వుండడమనేది. అలా వుండడం వలన లభించిన ఆత్మ సంతృప్తి.

వాళ్ళబ్బాయి పదో క్లాసు పాసయేలా చేస్తే వెయ్యి రూపాయగా ఇస్తానన్న ఇన్‌కంటాక్సు ఇనస్పెక్టరు మాటల్ని ఖాతరు చెయ్యలేదు. వాళ్ల కూతురు కొడుకులకి ప్రైవేట్లు చెబితే నెలకి రెండు వందలిస్తానన్న తాహసిల్దారు గారి మాట కాదన్నారు ఎందుకు ?

ఈ రోజుల్లో కాలేజీలో సీటు రావాలన్నా హైస్కూల్లో సీటు రావాలన్నా, కనీసం కిండర్ గార్డెన్స్కూల్లో సీటు రావాలన్నా డబ్బుకావాలి— నైతిక విలువలు కావు.

ఈ సమాజంలో మనిషి జీవనానికి, డబ్బుకి అంత అవినాభావ సంబంధం వుంది. ఇద్దరు వ్యక్తులు ఒకేసారి వుద్యోగాల్లో జాయినై, ఓ పదేళ్లలో ఒకరు కారులో తిరిగే స్థితికి వస్తే, రెండో వాడు ఇంకా సైకిల్ కూడా కొనలేని స్థితిలో ఉంటే, అందుకు ఎవరిది తప్పు ?

ఎదుటి వాళ్ళ తప్పుల్ని లేదా బలహీనతల్ని కాష్ చేసుకుంటూ పైకి ఎదిగిన, యీ సంఘలో ఒక ముఖ్య వ్యక్తిగా మొదటి వ్యక్తి గుర్తించబడితే, రెండో వ్యక్తి కేవలం ఆత్మ సంతృప్తి, నైతిక విలువలు లాంటి ఆదర్శ భావాలతో ఎప్పుడు ఈ సమాజంలో పైకి ఎదగ గలడు ?

అందుకే గోవిందరావుగారు మామ్మూలు గోవిందరావుగారిలా మిగిలిపోయారు. ఆయనకు మిగిలినవి ఆయన ఆదర్శభావాలు, ప్లస్ రెండు గుండెలమీద కుంపట్లు.

రామారావుగారు పక్క వూళ్ళో ఎలిమెంటరీ స్కూలికి హెడ్మాస్టరుగా చేస్తూ ఆయన కూడా కంపల్సరీ రిటైర్మెంట్ క్రింద రిటైర్ చెయ్యబడ్డారు.

ఆయన రెటైరైన మరుచటి నెలలోనే ఇరవైవేలు కట్నం యిచ్చి కూతురికి ఓ యింజనీర్ని కొనుక్కొచ్చేరు. కొడుకుని ఎం. బి. బి. యస్ చదవడానికి విశాఖపట్నం ఓ పదిహేనురోజుల క్రితం పంపించేరు.

రామారావుగారు జ్ఞానం వొచ్చిన దగ్గర్నుండి నైతిక విలువలు, ఆదర్శాల్లాంటి బరువైన పదార్థాల్ని తాకట్టు పెట్టేసి, యీ సమాజంలో ఉన్నత స్థితికి చేరుకొని, ఇప్పుడు ఎదుటివాళ్ళ నైతిక విలువల్ని, ఆదర్శాల్ని తన దగ్గర తాకట్టు పెట్టించుకొంటున్నారు.

గోవిందరావుగారు ఆ పని చేతకాక మామ్మూలు బడిపంతులుగా మిగిలిపోయేరు.

* * *

''నమస్కారం మాష్టారూ.''

''ఎవరూ ...'' కళ్ళజోడు సవరించుకొంటూ ఎదుటి వ్యక్తిని గుర్తుపట్టడానికి ప్రయత్నించేరు.

''నేను మాస్టారూ ! శ్రీనివాసరావుని ... వాసుని ... ''

''ఓ నువ్వటోయ్ వాసూ ! రారా ... ఏమిటి, ఎలా వున్నావ్ ? ఏం చేస్తున్నావ్ ? ఈ వూరు ఎప్పుడొచ్చేవ్ ... మీ అమ్మగారు, నాన్నగారు బావున్నారా ... '' కుశల ప్రశ్నలు వేసేరు.

''నేనీ వూరువచ్చి అయిదు నెలలయిందండి. మా అన్నయ్య ఇక్కడ ఇన్కంటాక్సు ఆఫీసులో పనిచేస్తున్నాడు. అమ్మావాళ్ళు బాగానేవున్నారు. క్రిందటి సంవత్సరం బి.కాం. పూర్తయింది. ఇప్పుడు వుద్యోగ ప్రయత్నాలు చేస్తూ ఎం.కాం. ప్రైవేట్‌గా చదువుతున్నాను ... ''

''అమ్మాయ్ శ్యామలా! కొంచెం మంచినీళ్ళు పట్టామ్మా ... '' లోపలికి కేకవేసేరు.

శ్రీనివాసరావు హైస్కూలు చదువంతా గోవిందరావుగారి దగ్గరే గడిచింది. తర్వాత శ్రీనివాసరావు నాన్నగారికి శ్రీకాకుళం బదిలీ కావడంతో అక్కడ మిగతా చదువు పూర్తి చేశాడు.

ఆదేటైమ్‌లో ఆడుకోవడం, చదివే టైమ్‌లో చదువుకోవడం ఇవి శ్రీనివాసరావుకి గోవిందరావుగారు నేర్పినవి. క్రమశిక్షణకు ప్రాణం ఇచ్చేవారాయన.

ప్రక్క ప్రక్క ఇళ్ళు కావడంతో శ్రీనివాసరావు ఎప్పుడూ గోవిందరావుగారింట్లోనే తిరుగుతూ వుండేవాడు.

''మన వాసు ... '' మంచినీళ్ళు తెచ్చిన శ్యామలతో అన్నారు.

''అన్నట్టు అమ్మతో చెప్పు వాసు వొచ్చేడని.. ఆ చేత్తోనే కాఫీ కూడా పట్టమ్మను ...''

శ్రీనివాసరావు కళ్ళముందు మెరుపు మెరిసినట్లయింది.

''ఈ అమ్మాయినే నేను రోజూ ఆరాధించేది ? ఈ అమ్మాయికోసము ప్రత్యేకంగా టైపు నేర్చుకుంటున్నది...''

''న...న... నమస్కారం.''

''మీలో మీరు గౌరవించుకోడాలేమిటోయ్'' మృదువుగా మందలించేరు శ్యామలకు నమస్కారం పెడుతున్న శ్రీనివాసరావుని చూసి.

''ఏం చేస్తున్నానో తెలియడంలేదండి'' అనబోయి తమాయించుకొన్నాడు.

''నమస్కారమండి...''

''నమస్కారం... ఏంవోయ్ వాసూ ! బాగున్నావా అమ్మా నాన్నా అంతా కులాసాయేగా'' కుశల ప్రశ్నలు వేశేరు మహలక్ష్మిగారు.

''ఆ... అంతా బాగానే వున్నారండి ..'' సమాధానమిచ్చేడు శ్రీనివాసరావు.

అది మొదలు శ్రీనివాసరావు రాకపోక లెక్కువయ్యేయి. గోవిందరావు మాస్టారు ఎప్పుడో ఇంట్లో ఉండకుండావుంటే బాగుంటుందనిపిస్తోంది శ్రీనివాసరావుకి. శ్యామలతో మాటలు పెరిగేయి. చనువుగా జోకులెయ్యడం లాంటివి చేస్తున్నాడు శ్రీనివాసరావు. మహాలక్ష్మిగారుగాని, గోవిందరావుగారుగాని శ్యామలతో శ్రీనివాసరావు చనువుగా మాట్లాడినా పట్టించుకోవడంలేదు — చిన్నప్పటినుంచి తెలిసినవాడవడంచేత.

మైనా గోరింకకు మాటలు నేర్పుతున్నట్లు శ్రీనివాసరావు శ్యామలకు ఆమెకు తెలియని ప్రపంచం చూపించే ప్రయత్నాలు చేస్తున్నాడు.

రోజులు గడుస్తున్నాయి. గోవిందరావుగారి ఆర్థిక పరిస్థితిలో పెద్దగా మార్పులేదు. మరో రెండు మూడు నెలలలో పెన్షన్ ఫిక్సయి రావచ్చునని ఆశిస్తున్నారు గోవిందరావు గారు.

* * *

''మాస్టారూ ! నాకు ఉద్యోగం వొచ్చింది'' అన్నాడు శ్రీనివాసరావు ఆనందంగా...

''చాలా సంతోషం నాయనా... ఎక్కడ, దేంట్లో వొచ్చింది ... ఎప్పుడు జాయినవ్వాలి'' ప్రశ్నలువేసేరు.

సమాధానంగా శ్రీనివాసరావు జేబులోంచి ఒక ఇన్‌లాండ్ కవరు తీశాడు.

శ్రీనివాసరావు నాన్నగారి చేత వుపకారం పొంది పై చదువులు చదువుకొని ఇప్పుడు అతి పెద్ద వుద్యోగంలో ఉన్న వెంకట్రావుగారు ఇప్పుడు తన కంపెనీలో ఉద్యోగాల కోసం పంప



# ప్రయివేట్, వ్యక్తిగత విషయాలకు సంబంధించిన టెలిగ్రాములు వేగంగా చేరతాయి

ఏవిధమైన అదనపు ఛార్జీలు లేకుండా, తక్కువ టెలిగ్రాములకంటె ప్రయివేట్ వ్యక్తిగత సంబంధిత టెలిగ్రాములను పంపుటలో ప్రాధాన్యత ఉంటుందని మీకు తెలుసా? వీటిలో దిగువ నుదహరించిన విషయాలు ఉండవచ్చును :

1. రైల్వేస్టేషన్లు, విమానాశ్రయాలు. తదితర ప్రజావాహన స్థానాలకు చేరుకోవటం, అక్కడనుండి వెడలటం గూర్చిన సమాచారము
2. బంధువుల అవసరాన్ని గూర్చిన అభ్యర్థనలతో సహితముగా వ్యాధులు. ప్రమాదాలను గూర్చి తెలియపరచుట
3. ఇంటర్వ్యూ పిలుపులతో సహా ఉద్యోగాలకై పెట్టే దరఖాస్తులు ఉద్యోగాల నిస్తూన్నట్లుగా పంపే వర్తమానాలు
4. పరీక్షా ఫలితాలను తెలియజేయుట.

ప్రయివేట్, వ్యక్తిగత విషయాలకు సంబంధించిన టెలిగ్రాములు "ఎక్స్‌ప్రెస్" (ఎక్స్ ఎస్) లేదా "ఆర్డినరీ" (ఒ ఎస్)గా బుక్ చేసుకోబడతాయి.

టెలిగ్రాఫ్ ఆఫీసులలో లభించే నీలి రంగు ఫారాలను తేలికగా గుర్తించడానికి ఉపయోగించండి.

ఈ టెలిగ్రాములలో రిప్లయి-పైడ్ అనేక అడ్రసులు ఉపయోగించడం మున్నగు అన్ని ప్రత్యేక సేవలకు అనుమతి లభిస్తుంది

"ఎక్స్‌ప్రెస్" లెక "ఆర్డీనరీ" రేట్లు. ఏదైతే అది. ఛార్జీలు తప్ప అదనపు ఛార్జీలు వసూలుచేయబడవు

**రేయింబవళ్లు చేరవేత**

24 గంటలు పనిచేసే కార్యాలయాలలో, చేరుకోవడం/వెడుతూన్నట్లుగా పంపే ప్రయివేటు,వ్యక్తిగత సంబంధాలకు చెందిన లేదా వ్యాధులు/ప్రమాదాలగూర్చి తెలియపరచే టెలిగ్రాములు రేయింబవళ్లు అందింపబడతాయి తక్కువ కార్యాలయాలలో పని-చేసే సమయాలలోనే అందించడమవుతుంది.

రాత్రి 10, ఉదయం 6 గంటల మధ్య సమయంలో చేరిన ఈ తరగతికి చెందిన టెలిగ్రాములు ఉదయం 6 గంటల తర్వాత అందజేయడమవుతుంది.

రాత్రి 10 ఉదయం 6 గంటల మధ్యగా అందజేయడాన్ని టెలిగ్రాము పంపేవారు కోరుతున్నప్పుడు, సేవా గుర్తుగా "నైట్" అనే పదాన్ని వ్రాయాలి. టెలిగ్రామ తరగతిని బట్టి ఎక్స్‌ప్రెస్, ఆర్డినరీ రే ప్రకారం, ఆ పదానికి ఛార్జీ అదనం వసూలు చేయబడుతుంది.

ఎల్లప్పుడూ దేశ సేవలో నిమగ్నులైన



**భారత తంతి తపాలాశాఖ**

# భారతి

సాహిత్య
మాసపత్రిక



తెనుగువారి
సంస్కృతికి
ప్రతిబింబం



విడి పత్రిక: రూ. 4-00

బడ్డ దరఖాస్తులలో శ్రీనివాసరావు అప్లికేషన్ గుర్తుపట్టి ప్రత్యేకంగా వుత్తరం వ్రాస్తూ ఇంటర్వ్యూ ముందు రోజు తనను కలవమని చెప్పి, ఆ వుద్యోగం శ్రీనివాసరావుకు వచ్చేలా చేస్తానని వుత్తరం వ్రాసేరు.

ఇది ఆ వుత్తరం ముందు వెనకల కథ. శ్రీనివాసరావు ఆనందంగా వున్నాడు ...

* * *

మనిషి అనుకున్నవి జరిగితే యీ లోకంలో మనిషికి అడ్డు వుండదు. అప్పుడప్పుడు తగిలే ఎదురు దెబ్బలు మనిషిని నిలువుగా కృంగ దీస్తుంటాయి.

గోవిందరావుగారు గుండెపోటుతో మరణించారు ఈ లోకంలో తన పాత్రకు పూర్తి న్యాయం చెయ్యకుండానే తనువు చాలించేరు. వచ్చిన బంధువులు సానుభూతి వాక్యాలు పలికి వెళ్లిపోయారు.

ఆ సంసారం బాధ్యత మహాలక్ష్మిగారి మీద పడింది భర్త పిఎఫ్, గ్రాట్యుటీ ఇంకా రాలేదు. ఎప్పుడు వస్తాయో తెలియదు. ఆ పరిస్థితులలో శ్రీనివాసరావు దగ్గరుండి చెయ్యవలసిన సాయం చేసేడు.

''రేపు కంపెనీకి వెళుతున్నానండి ... ఎల్లుండి నా యింటర్వ్యూ... రేపు వెంకట్రావు గారిని కలవాలి'' శ్రీనివాసరావు అన్నాడు.

'ఆ వుద్యోగమే కదా వాసూ ... నీకు వస్తుందన్నావు ...'' ఏదో చెప్పబోయి ఆగిపోయారు.

'అవును...' ప్రశ్నార్థకంగా చూశాడు.

''నీకు మా పరిస్థితులు తెలుసు ... ఈ పరిస్థితులలో...'' మళ్లీ ఆగిపోయారు.

# ఇంద్ర నీలాలు

''చెప్పండి ఫరవాలేదు...'' ఆవిడ ఏం చెప్పదలచుకున్నారో అర్థం కాలేదు శ్రీనివాస రావుకి.

ఒక నిశ్చయానికి వొచ్చినట్లు దీర్ఘంగా నిట్టూర్చారు మహాలక్ష్మిగారు.

''నేను చెయ్యమంటున్న యీ సహాయం నీకు విపరీతంగా అనిపించవచ్చు. ఇంత స్వార్థం పనికిరాదనవచ్చు. కాని రేపట్నుంచి మేము కనీసం ఒక పూటయినా తిండి తినగలగాలంటే ... మా శ్యామల ఉద్యోగం చెయ్యడం అవసరం... వాసూ ! నీకు రాబోయే వుద్యోగాన్ని మా శ్యామలకు వచ్చేలా చేశావంటే ...'' ఆగి పోయారు. చెప్పవలసినదింకేమీ లేనట్టు శ్రీనివాసరావు మొహంలోకి చూడడానికి ధైర్యం చాలక మొహం ప్రక్కకి తిప్పుకున్నారు.

షాక్ కొట్టినట్లయింది శ్రీనివాసరావుకు... తేరుకొని :

'ఇప్పుడు మీకేమీ చెప్పలేను...రేపు ప్రొద్దున్న మీకే విషయమూ చెప్తాను...' గబగబా వెళ్ళి పోయాడు.

* * *

రాత్రి పడుకున్నాడే గాని శ్రీనివాసరావుకి నిద్ర పట్టలేదు ఏం చెయ్యాలి. నిజమే యీ పరిస్థితులలో శ్యామల ఉద్యోగం చెయ్యడం ఎంతో అవసరం. శ్యామల ఉద్యోగం చెయ్యకపోతే ఆ యింట్లో పూట గడవడం కష్టం. ఒకర్ని దేహీ అని చెయ్యిచాచని ఆ కుటుంబం రేపు నడిరోడ్డు మీద నిలబడవలసి రావచ్చు ...

'అమ్మా ! ధర్మం చెయ్యండమ్మా' అని మోహన్ అడుక్కుంటున్నట్లనిపించి, ఆ వూహే భయంకరంగా తోచి గట్టిగా కళ్ళు మూసు కున్నాడు.

మరో విషయం, తను ఇప్పుడు శ్యామలకు సహాయం చేస్తే ఆ వుద్యోగం శ్యామలకు ఇస్తారా ? ఇస్తారు. ఎందుకంటే ఆ వుద్యోగానికి కావలసిన కనీసార్హత ఇంటర్మీడియట్ మాత్రమే. ఈ సహాయం చెయ్యకపోతే శ్యామలకు వుద్యోగం వస్తుంది. ఎందుకు రాదు. వస్తే ఎంతకాలం పడుతుంది. రికమండేషన్, డబ్బులతో నడిచే యీ లోకంలో శ్యామల లాంటి వాళ్ళకు, అందులో అగ్రజాతి వాళ్ళకు ఉద్యోగం వొచ్చే దెప్పుడు ... ?

మరి తన పరిస్థితి ... తనలాంటివాళ్ళు ఈ దేశంలో కోట్లమంది వున్నారు. తనకు మాత్రం యీ వుద్యోగం రాకపోతే మరో వుద్యోగం వొస్తుందన్న నమ్మకంగాని, గ్యారంటీ గాని లేదు ...

తను వుద్యోగం చెయ్యవలసిన పరిస్థితి ఎంతవుంది ? తను వుద్యోగం చెయ్యకపోతే గడవని పరిస్థితులేమీకావు. ఈ అన్నయ్య దగ్గర ఓ ఆరునెలలు, మరో అన్నయ్య దగ్గర మరో ఆర్నెలు గడపవచ్చు.

కాని ... శ్యామల తప్పకుండా వుద్యోగం చేసి తీరాలి.

శ్రీనివాసరావుకి ఏదో ఫ్లాష్‌లా వెలిగింది. దృఢనిశ్చయానికి వచ్చినవాడిలా నిశ్చింతగా నిద్రపోయేడు.

* * *

తెల్లవారింది. ఫ్రెష్‌గా తయారయేడు. తను తీసుకొన్న నిర్ణయాన్ని ముందుగా వదిన గారికి చెప్పాడు. ఆవిడ ముందు కోపగించుకొంది నచ్చచెప్పిన తరువాత ఈ కాలం యువకులు ఎంత ముందుకు పోయేరు అని ఆశ్చర్యపోయింది తరువాత అభినందించింది. మీ అన్నయ్యకు నేను నచ్చచెపుతాన్లే అంది ... ధైర్యంగా అడుగులు వేసేడు శ్రీనివాసరావు.

టైమ్ ఏడుగంటలయింది.

వాకిట్లో ముగ్గులేస్తున్న శ్యామల అతని కళ్ళకి రోజూ కంటే అందంగా కనబడింది.

''శ్యామలా ... మీ అమ్మగారు లేరా ... ''

''ఓ నువ్వా ... ఏమిటి ఇంత పొద్దున్నే దర్శనం.''

''దేవిగారికోసం...''

సిగ్గుపడింది శ్యామల.

''మహాలక్ష్మిగారితో మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి'' అని గొంతు సవరించు కొన్నాడు.

''నిన్న మీరు చెప్పిన విషయాన్ని ఆలోచించి నేను తీసుకొన్న నిర్ణయమేమిటంటే'' ఆగాడు.

''శ్యామలా ! కొంచం మంచినీళ్ళు తెచ్చి పెట్టు'' శ్యామలవైపు తిరిగి అన్నాడు.

''అలాగే...'' లోపలికి వెళ్ళింది

''చెప్పు వాసూ. .'' ఆవిడ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

గబగబా కిటికీదగ్గరకు వెళ్ళాడు.

కిటికీలోంచి బయటకు చూస్తూ...

''ఈ విషయం మా యింట్లో చెప్పాను. ఈ పరిస్థితులలో నాకు వచ్చిన యీ వుద్యోగాన్ని మీ అమ్మాయికి వచ్చేలా చెయ్యడంకంటే...'' క్షణం ఆగి...

''మీకు అభ్యంతరం లేకపోతే ఆ వుద్యోగం నేనే చేస్తూ మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుందా మనుకొంటున్నాను...'' ఎవరో తరుముకు వొస్తున్నట్లు గబగబా చెప్పేశాడు.

మంచీనీళ్ళు తెస్తున్న శ్యామల అక్కడే ఆగిపోయింది... కొంత సిగ్గుతోనూ, ఎక్కువ భాగం ఆశ్చర్యంతోనూ.

మహాలక్ష్మికి సమాధానం ఏం చెప్పాలో తోచలేదు. తన కళ్ళముందు నిక్కర్లు వేసుకొని తిరిగిన వాసు... ఎంతో ఎత్తుకి ఎదిగి పోయినట్లనిపించింది. ఆనందంతో ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. గొంతు పూడుకుపోయింది. ★

# చచ్చిన పిల్లి - మురారి సుబ్బారావు

చీకటిపడుతోంది. వెలుగును వెతుక్కుంటూ దీపాలు వెలుగుతున్నాయి.

ఒక ఇంటిముందు నిలబడివున్నాడు వెంకటేశం. అతను వుండుండి భళ్ళున దగ్గుతున్నాడు. మాసిపోయిన బట్టల్లోంచి వస్తున్న మురికి కంపుతో అసహ్యంగా వున్నాడు. ఊరంతా తిరిగాడు. చివరికి ఇక్కడికి వచ్చాడు. ఇవాళ రేపట్లో ప్రాణం పోయేలావుంది తరుచు వస్తున్న దగ్గు అతని గుండెల్ని తినేస్తోంది. పదిహేను రోజుల క్రితంవరకూ ఒక హోటల్లో పని చేసేవాడు ఈ మధ్య దగ్గు మరీ ఎక్కువ కావడంతో హోటల్‌వాళ్ళు బయిటకు తరిమేశారు. ఎక్కడా పని దొరకలేదు. చేసే ఓపికాలేదు. వున్న డబ్బులో ఎలాగో గడిపాడు. మూడు నాలుగు రోజులుగా తిండానికి డబ్బులు లేవు. దగ్గు అతనికి పనిచేసే శక్తి ఇవ్వడంలేదు. ఆకలి అతని వంటిని పట్టి పీడిస్తున్నట్లుగా వుంది, తగ్గని దగ్గులాగే.

వెంకటేశం ఆ ఇంటిముందు నిలబడ్డాడు. ఇంటిని పరిశీలనగా చూసాడు. చాలా పాత ఇల్లు. మట్టి, పచ్చి ఇటుకతో కట్టిన ఏ ముప్పై ఏళ్ళనాటి ఇల్లో మరి. చాలా శిధిలావస్థలో వుంది.

ఇంతలో ఆ ఇంట్లోంచి ఎవరో ముసలమ్మ బయటకు వచ్చింది. వెంకటేశం ఆ ఇంటి కెదురుగావున్న చెట్టుకింద నిలబడి వున్నాడు. ఎంతసేపట్నుంచీ గమనిస్తోందో మరి "ఇదిగో ఇలారా" అని పిలిచింది వెంకటేశాన్ని.

వెంకటేశం ఆమె దగ్గరికి వెళ్ళాడు.

"నువ్వేం చేస్తుంటావు" అడిగింది ముసలమ్మ.

"ఇప్పుడేం చెయ్యట్లేదు. పనిచేసే ఓపిక లేదు. ఆకలేస్తోంది" అన్నాడు వెంకటేశం.

"ఒక పని చేస్తావా" అడిగింది ముసలమ్మ

తలూపాడు వెంకటేశం.

"లోపలికిరా" పిలిచింది ముసలమ్మ. వెనకాలే వెళ్ళాడు వెంకటేశం ముందు రెండు గదులుదాటి వంటింట్లోకి తీసుకు వెళ్ళింది వంటింట్లోకి వెళ్ళగానే ఏదో భరింపరాని కంపు కొడుతోంది.



"ఇగో ఈ అటకమీద పిల్లి చచ్చిపోయింది. ఎప్పుడు చచ్చిందో ఏమో. మేం చూడలేదు. పొద్దుట్నుంచీ కొద్దిగా వాసనొస్తోంది. ఇప్పుడా కంపు మరీ భరించలేకపోతున్నాం. కొంచెం ఆ చచ్చిన పిల్లిని తీసి ఈ వీధి చివర వున్న పెంట కుప్పమీద పడేద్దూ! నీకు పుణ్యం వుంటుంది. నీకు అన్నం పెట్టి డబ్బులిస్తాలే" అంది ముసలమ్మ ముక్కుకి అడ్డంగా చీరకొంగు పెట్టుకుంటూ.

వంటింట్లోంచి వస్తున్న ఆ వాసనకి వెంకటేశానికి దగ్గుతెర ముంచుకొచ్చింది. కడుపు లోంచి వికారంగా వుంది.

"ఎలా చచ్చిందా పిల్లి" అడిగాడు వెంకటేశం

"ఏముంది నాయనా! నాలాగే ఇది బొక్కిపోయిన ఇల్లే, చూస్తున్నావుగా. ఎక్కడికక్కడ అన్నీ జీర్ణావస్తలో వున్నాయి. ముప్పై ఏళ్ళకు పైగా అయింది ఈ ఇల్లుకొని. కరెంటు వైర్లు చూడు అవీ పాడైపోయున్నాయి. ఆ పిల్లి అటక ఎక్కినప్పుడు ఏ కరెంటువైరు చెడిపోయి వుందో

ఏమో. లేదా ఏ ఎలుకనో వేటాడుతూ సామాన్ల మధ్య ఇరుక్కుందో. మొన్న మధ్యాహ్నం అటక ఎక్కింది. తిరిగి దిగడం మేం చూళ్లేదు. అది చచ్చూరుకుంది. ఇప్పుడు వాసనొస్తోంది. ఇలా అవస్థ పడుతున్నాను. నీకు పుణ్యం వుంటుంది. ఆ పిల్లిని తీసి అవతల పారెయ్యి బాబూ'' అంది ముసలమ్మ.

సరేనన్నాడు వెంకటేశం. ఈ పని చేస్తే ఈ రాత్రికి తృప్తిగా భోజనం దొరుకుతుంది. రేపటికి కాస్త వంట్లో సత్తువ వస్తుంది. రేపు ఊరంతా తిరిగెయ్యాలి. కడుపులో బాధతో తను ఇప్పుడే చచ్చిపోయేలా వున్నాడు. తను అడుక్కు తినలేడు. ఈ పని చేస్తే ! ముసలమ్మ అన్నం పెడుతుంది. అడుక్కు తినడం కన్నా ఇది నయయే అనుకున్నాడు వెంకటేశం.

చచ్చినపిల్లి యొక్క కుళ్ళుకంపు విరగడవు తున్నదనేసరికి కాస్త నవ్వు ముఖం వచ్చింది ముసలమ్మకి. గబగబా మరో గదిలోకి వెళ్ళి పెద్ద బల్ల తీసుకువచ్చి ఇచ్చింది. దానిమీంచి అటక మీదకి ఎక్కి పిల్లి శవాన్ని కిందకు దించాడు వెంకటేశం. దానిని ఒక తాడుతో కట్టి బయటకు తీసుకువచ్చాడు.

''త్వరగా తీసుకెళ్ళు నాయనా ! వచ్చేక అన్నం పెడతాను. ఈలోగా వంటిల్లంతా శుభ్రంగా కడగాలి. కొడుకు, కోడలు వచ్చే వేళయింది'' అంటూ అడ్డం పెట్టుకున్న చీరకొంగుతోనే మాట్లాడింది ముసలమ్మ.

*　　*　　*

వెంకటేశం పిల్లి శవాన్ని ఈడ్చుకుంటూ వీధిలో నడుస్తున్నాడు. శవంలోంచి వచ్చే కంపు ముక్కుని బద్దలుకొడుతోంది. రోడ్డుమీద నడుస్తున్న వాళ్ళంతా ఇది చూసి దూరం దూరంగా నడవసాగారు. వీధి చివరికొచ్చి అక్కడున్న చెత్తకుండీలో పిల్లిని పడెయ్య బోయాడు వెంకటేశం.

''ఏయ్ ! ఒరేయ్. కంపు కొడుతున్నదాన్ని ఇక్కడ పడేస్తావా. మేమంతా బ్రతికివున్నా మనుకోవట్లేదా నువ్వు. తీసుకెళ్ళి మరోచోట పడెయ్యి.'' నలుగురైదుగురు అడ్డగించారు. మరోచోటుకి తీసుకువెళ్ళాడు. అక్కడా అంతే. వేరొకచోటుకి .. ఇదే అవాంతరం. చివరికి పిల్లి శవాన్ని లాక్కుంటూ ఊరంతా తిరగక తప్పలేదు ఊరు చివరికి తీసుకువెళ్ళి వదిలేశాడు పిల్లిని.

అప్పటికే కాళ్ళు తేలిపోతున్నాయి. విపరీత మైన దాహంగా వుంది. ఆకలిగా వుంది. ఎలాగో నెమ్మదిగా అడుగు వేస్తూ ముసలమ్మ ఇంటి వైపు నడిచాడు

అప్పటికి చీకటి ముసురుకొని చాలా సేపయింది. అక్కడక్కడా తలుపులు మగతగా మూసుకొంటున్నాయి

# చచ్చిన పిల్లి

కాళ్ళీడ్చుకుంటూ ముసలమ్మ ఇంటి దగ్గరకు వచ్చేసరికి ఆ యింటి తలుపులు మత్తుగా కళ్ళు మూసుకొనివున్నాయి

నిలబడే ఓపిక లేదు. గోడ అసరాగా చేసుకుని కూర్చున్నాడు వెంకటేశం. పావుగంట... అరగంట... గంట తలుపులు తెరుచుకోలేదు. ఇక నిరీక్షించి లాభం లేదు. ఆ యింటి తలుపులు తెరుచుకోవడం లేదుగాని తన కడుపులో మాత్రం ఆకలి కేకలు తగ్గడం లేదు. ఆ శబ్దం వినబడ కుండా తన గుండె తలుపుల్ని మూయలేక పోతున్నాడు.

పుట్టిన చంటిపాప ఏడవకపోతే బ్రతికించేది, సుఖంగా బ్రతకడానికి అవరోధంగా వచ్చేది, బ్రతుకంతా దానికోసమే తాపత్రయ పడేలా చేసేది, మనిషికి మనిషికి మధ్య మౌనాన్ని ఛేదిస్తూ విశృంఖలంగా విలయ తాండవంచేసేదీ, ఏడుస్తూ ఏడ్పించేది, కట్టెలా కాలిపోతూ నువ్వూ అలా కాలిపోవాలని శపిస్తూ వికటాట్ట హాసం చేసేది — ఆకలి, ఆకలి, ఆకలి.

వెంకటేశం ఆ యింటి తలుపు తట్టేడు.

''ఎవరదీ'' లోపల్నుంచి కొత్తగా ఒక ఆడగొంతు. 'బహుశా ముసలమ్మ కోడలేమో' అనుకున్నాడు వెంకటేశం

కళాభారతి (నిజామాబాద్), జవహర్ బాల కేంద్రం(శక్కర్ నగర్)సంయుక్త ఆధ్వర్యంలో నెలకొల్పబడిన నృత్య కళాకారుల ప్రారంభోత్సవ సందర్భంగా నృత్య ప్రదర్శననిచ్చిన కళాభారతి విద్యార్థిని, డా. నటరాజ రామకృష్ణ శిష్యురాలు కుమారి జయలక్ష్మి.




''నేనమ్మగారూ'' నీరసంగా జవాబిచ్చాడు వెంకటేశం.

''నేనంటే వవరని ? పేరు లేదూ'' లోపల్నుంచి విసుక్కుంటున్నట్లు అరుపు.

''నేనమ్మగారూ ! ఇందాక మీ ఇంట్లోంచి చచ్చిన పిల్లిని తీసుకెళ్ళి బయట పారేశాను. పెద్దమ్మగారు అన్నం పెడతానంది. అందుకని'' నసిగాడు వెంకటేశం.

''వేళాపాళా లేదూ. పొద్దున్నే కనబడు వెళ్ళు'' మళ్ళీ కసురుకుందా గొంతు.

''అది కాదమ్మా. ఆకలేస్తోంది.''

లోపల్నుంచి ఎటువంటి సమాధానం రాలేదు.

''అమ్మా, మిమ్మల్నేనమ్మా.''

''...... ... .... ..''

మరోసారి పిలిచాడు. నిశ్శబ్దం మౌనంగా పలుకరించింది. నిట్టూరుస్తూ ఆ యింటి కెదురుగా వున్న చెట్టు కిందకి నడిచాడు. చెట్టు కిందకు చేరబోతోంటే కాల్లో ఏదో గుచ్చుకుంది. తీసి చూసాడు. ''ఛ ... ఇనుప ముక్క. చేగోడీ ముక్క అయ్యుంటే ఎంత బాగుణ్ణు.''

ఆ రాత్రి చెట్టుకింద చల్లని గాలిని తింటూ గడిపాడు వెంకటేశం. ఆకలి అతన్ని అనేక విధాలుగా ఆలోచింప జేసింది.

వీళ్లెవరికీ ఆకలంటే తెలీదా !—ఆకలని గోలపెడితే దయ కలగదేం ? తనేం ముష్టిగా అడగలేదే పని చేశాడు. కూలిగా అన్నం పెట్ట మన్నాడు. ఏదీ ! ఇదేనా శ్రమకు విలువ. సాటి మనిషి ఆకలిని గుర్తించడం ఇలాగేనా ? పిల్లిని బయట పారేశాక ఇల్లంతా శుభ్రంగా కడుక్కొని సాంబ్రాణి ధూపం వేసుకొని ఎంత హాయిగా, సుఖంగా నిద్రపోతున్నారు. వాళ్ళకేనా సుఖం తన కక్కరలేదా ! తన ఆకలి తీరేలా పట్టెడన్నం పెడితే తన కెంత తృప్తి కలిగేదని. వీళ్ళకి ఎదుటి వాళ్ళ సుఖం అక్కరలేదు. ఎదుటి వాళ్ళ ఆకలి అసలే పట్టించుకోరు.

కడుపులో ఆకలి బాధ ఎంత నీచమయిన పనయినా చేయిస్తుంది. దొంగతనాలు...హత్యలు ఇలా అలాంటివేం తను చేయలేదే. వాళ్ళ ఇంట్లోంచి భరింపరాని కంపుని బయట పారేసాడు, అయినా కడుపు ఏడుస్తూనే వుంది.

తననెంత మోసం చేసారు. ఒక అనామకుడిగా చేసి ఎంత హాయిగా నిద్రపోతున్నారు. వాళ్ళనేం చెయ్యాని, పరాభవం పొందిన ఆత్మాభిమానంగల ఆకలి కడుపు నాది. అది తిరగబడాలంటే... తిరగబడితే, వా ళ్ళేవౌవుతారు వాళ్ళనేం చెయ్యాలి.

కాల్లో గుచ్చుకున్న ఇనుప తీగె, చేతిలో కదులుతోంది. వెంకటేశం ఒక నిశ్చయాని కొచ్చాడు.

*　　*　　*

తెల్లవారుతూనే ఆ యింటి తలుపులు తెరుచుకున్నాయి. ముసలమ్మగారి కోడలు తలుపు

## పంటి నొప్పికి ప్లాస్టరు!

పంటినొప్పిని తగ్గించగల ఒక కొత్త ప్లాస్టరును తయారీ చేసినట్లు జపానులోని పరిశోధకులు కొందరు పేర్కొన్నారు ఈ ప్లాస్టరును చిగుళ్ళమీద అంటిస్తారు. ఇది వెంటనే పనిచేయడం ప్రారంభిస్తుంది. టోకుషిమా విశ్వవిద్యాలయంలోని శాస్త్రవేత్త డా మసుమిషి టకాసుగి ఈ పరిశోధనలకు నాయకత్వం వహించారు. దీనిని కొందరు రోగులపై పరీక్షించినట్లు దీనివలన సత్ఫలితాలు ఏర్పడినట్లు ఆయన తెలియచేశారు కొన్ని సెల్యూలోజ పదార్థములు, బాధ నివారిణి మందులతోనూ ఈ ప్లాస్టరును తయారు చేశారు 15 నిమిషాలతో దీని ప్రభావం కనిపిస్తుంది ఆహారం తీసుకున్న తరువాతకూడా, ఆరు గంటలసేపు దీని ప్రభావం ఉంటుంది మామూలు బాధానివారిణి మాత్రలలో ఉపయోగించే మందు మోతాదులో పదో వంతు మాత్రమే దీనిలో ఉపయోగిస్తారు

తీసింది. తలుపులు తెరుచుకోవడంతేనే వెంకటేశం ఆ యింట్లోకి పరిగెత్తాడు

''ఏయ్ ఎవరునువ్వు లోపలికి వచ్చేస్తున్నావేమిటి'' వెనుకనుంచి అరుస్తూ వెంకటేశంతో బాటు లోపలికొచ్చిందామె

వెంకటేశం ఒగురుస్తున్నాడు. ఆకలికి, నీరసానికి పీక్కుపోయిన అతని ముఖం కోప రూపం దాల్చి నుసిబారుతున్న నిప్పు బొగ్గులా వుంది.

''నేనెవరా ? రాత్రి మీ యింటి తలుపులు కొట్టి పట్టెడన్నం పెట్టమని అడిగానే. ఆణ్ణి'' అన్నాడు వెంకటేశం.

''అయితే ఏమంటావు. ఇలా లోపలికి వచ్చేస్తావేమిటి, అత్తగారూ, అత్తగారూ'' మరో గదిలోకి కేకవేసిందావిడ ముసలమ్మ లోపల్నుంచొచ్చింది.

''ఏం మహాతల్లీ చచ్చిన పిల్లిని బయట పారెయ్యి. అన్నం పెడతాను డబ్బులిస్తాను అన్నావే ఏది తల్లీ. దాన్ని తీసుకెళ్లి బయట పారేశాను. నువ్వు మాత్రం సుఖంగా పడి నిద్దరోయావు. ఏం తల్లీ సుఖం మీకేకానీ మాకక్కరలేదా! మేం మనుషులంకామా'' గట్టిగా అరిచాడు వెంకటేశం.

''నువ్వు తిన్నంత పెడతా నాయినా. ఇప్పుడిలా వచ్చి గొడవచేస్తావెందుకు'' ముసలమ్మ అన్నది.

''ఆఁ! పెడతావు. ఆకలేసినప్పుడు కావాలమ్మా తిండి. దాన్ని బలవంతంగా చంపుకున్నాకకాదు. ఆకలంటే ఎలా వుంటుందో తెలియదు మీకు. మీరు పశువులు. దొరికింది సమిలి మింగేయడం, బలవంతంగా కబళించాలని చూడ్డంతప్ప మనిషి లక్షణాలులేవు మరో మనిషి ఆకలి తెలుస్తుందా! అందుకే మీకు బుద్ధి చెప్పాలని వచ్చాను ''

''ఏమిటి నువ్వంటున్నది.'' భయంగా అన్నారిద్దరూ

''అవునత్తల్లీ నేను బ్రతికినన్నాళ్ళూ కష్టపడి బ్రతికాను రోగం ముంచుకొచ్చింది అయినవాళ్ళు కాదన్నారు కొడుకు వదిలేసాడు. నాలో పెరుగుతున్న రోగానికి బలైపోవాలనుకున్నాను. ఓపిక వున్నంతకాలం, రోగం నన్ను మనిషిగా పనిచేయించినంతకాలం కష్టపడ్డాను. ఇక సత్తువలేదు. కానీ కోరిన వెంటనే చావు రాలేదు మనిషికి అన్నీ దొరుకుతాయిగానీ ఆకలన్నప్పుడే తిండి దొరకదు చావు వచ్చేవరకూ బ్రతకాలి అందుకు తిండికావాలి. తప్పదు కానీ ఈలోగా కడుపులో అసహ్యంగా మెలిదిరిగిన పేగులు ఆకలంటూ గొడవ పెడుతున్నాయి. దాన్ని శాంతింపచెయ్యాలి. కానీ ముష్టి బ్రతుకు నాకు కిట్టదు. నిన్న ఈ ముసలమ్మ పిల్లిని తీసి పారెయ్యమంది అన్నం పెడతానంది. అడుక్కోవడం లేదు కదా, ఆ పని చేస్తే తిండి పెడుతుంది కదానని ముసలమ్మ అడిగినట్లే చేసాను చివరికి మీరేం చేసారు. కాలుతున్న నా కడుపుమీద తన్నేరు సుఖంగా పడుకున్నారు ''

వెంకటేశం మాట్లాడలేక పోతున్నాడు విపరీతంగా చెమటలు పట్టి ముఖం పాలిపోయినట్టుగా అయిపోతోంది

''రాత్రి ఆ పిల్లి ఇక్కడే వుంటే అంత సుఖంగా నిద్రపోయేవారా లేదు మీకు ఎదుటివాళ్ళ సుఖం అక్కరలేదు. వాళ్ళ ఆకలి మీకు తెలీదు మీ సుఖం మాత్రమే మీకు కావాలి. మీలాంటి వాళ్ళంటే నాకసహ్యం. మీ మీద కసిగ వుంది కోపంగా వుంది మీలాంటి వాళ్ళకు బుద్ధి రావాలి అందుకోసం నేనేం చేస్తానో తెలుసా'' ఒక క్షణం ఆగాడు

''ఏం చేస్తావు'' ఇద్దరూ ఒక్కసారే అన్నారు

''చచ్చిపోతాను ఇక్కడె మీ ఇంట్లోనె ఎలాగో తెలుసా ఆ పిల్లిలాగే నాలాంటి అనామకుణ్ణి, నిష్ప్రయోజకుణ్ణి అవసరానికి వాడుకొని ఆ పిల్లి శవాన్ని బయట పారేయించి సుఖంగా వుండగలిగారు ఇప్పుడు నేనిక్కడ చస్తాను నా శవాన్ని ఎలా బయటకు పంపుతారు అది మీకు పెద్ద భారవౌతుంది ఆకలి అరుపులు వినబడని మీకు అది పెద్ద సమస్య అవుతుంది మీ కుటుంబానికి సంబంధించని వ్యక్తిని నేను రోగిష్టివాణ్ణి, ముష్టివాడికన్నా అధ్వాన్నంగా వున్నాను చూడడానికి. అటువంటి వాణ్ణి ఇక్కడ చచ్చానంటే ఎన్నో అనుమానాలు, సమస్యలు వస్తాయి. అదే నాకు కావాలి మీకలాంటి శిక్షే విధించాలి. మీకలాంటి శిక్షే విధించాలి'' వికటంగా నవ్వేడు వెంకటేశం.

''వద్దు వద్దు ఆ పని చెయ్యొద్దు'' ఇద్దరాడవాళ్ళు గట్టిగా అరిచారు

రాత్రి కాల్లో గుచ్చుకున్న ఇనుప తీగెను జేబులోంచి తీసాడు వెంకటేశం. దాన్ని చేత్తో పట్టుకొని స్విచ్ బోర్డువైపు నడిచాడు స్విచ్ బోర్డులో ప్లగ్ సాకెట్‌లోకి ఇనుప తీగను పెట్టాడు

ఒక్కక్షణం —

ఒళ్ళు జలదరించింది వెంకటేశానికి. మరుక్షణం కళ్ళ ముందు చీకట్లు ముసురుకున్నాయి అతడలాగే అచేతనంగా నిలబడిపోయాడు ప్లగ్ సాకెట్‌లోంచి ఇనుప తీగెలోంచి అతని శరీరంలోకి ప్రవహించిన కరెంటు అతన్ని ఎక్కడికో తీసుకుపోతోంది. 





# వంటలు

## జామ్ పాయసం

కావలసిన వస్తువులు : జామ్ – అరకప్పు, నీరు – అరకప్పు, చిన్న కొబ్బరికాయ – ఒకటి, జీడిపప్పు – తగినంత, ఏలక్కాయల పొడి.

ఈ పాయసం చేయడానికి ఏదైనా జామ్ తీసుకోవచ్చును.

తయారుచేయు విధము . జీడిపప్పు నేతిలో ఎర్రగా వేయించి తీసి పెట్టుకోవాలి. కొబ్బరిని తురిమి రోట్లో వేసి తగినంత నీరు చేర్చి, బాగా రుబ్బి పాలు తీసుకోవాలి. తర్వాత మరి కొంచెం నీరు చేర్చి రెండవసారి రుబ్బి పాలు తీసుకోవాలి. ఈ పాలను రెండింటినీ ఒకటిగా చేర్చి తీసుకోవాలి. ఇప్పుడు ఒక వెడల్పుమూతిగల పాత్రలో జామ్‌ను తీసుకుని దానికి నీరుపోసి స్పూన్‌తో బాగా కలపాలి. దీనిని పొయ్యిపై పెట్టి మరగనివ్వాలి. మరిగేటపుడు కొబ్బరిపాలు పోసి బాగా కలియపెట్టాలి, బాగా గరిటతో కలిపెడుతూ వుండాలి. అన్నీ బాగా కలిసి పొంగు వచ్చేటపుడు దించేసి, ఏలక్కాయలపొడి, నేతిలో వేయించిన జీడిపప్పు వేసి బాగా కలియపెట్టాలి. ఈ పాయసం వేడిమీద చాలా రుచిగా ఉంటుంది. సులభంగా తయారవుతుంది. ఇంట్లో ఉపయోగించకుండా మిగిలిపోయిన జామ్ ఖాళీ అవుతుంది.

— శ్రీమతి గార్ల సరస్వతి

## "కలకండ పూరీలు"

కావలసిన వస్తువులు :– మైదాపిండి అర కిలో, నెయ్యి 200 గ్రాములు, కలకండ 125 గ్రా, బాదంపప్పు 50 గ్రా.

తయారుచేయు విధము :– ముందుగా మైదాపిండిని బాగా జల్లించి ఒక పాత్రలోకి తీసుకోవాలి. దానికి కొంచెం నెయ్యి, తగినంత నీరుపోసి పూరీల పిండిలాగా కలిపిపెట్టాలి. పిండి బాగా మెత్తగా వుండాలి. తర్వాత కలకండను మెత్తగా నూరాలి. ఈ పొడిని విడిగా వుంచాలి. బాదం పప్పును కాస్సేపు వేడినీటిలో నానబెట్టి నలిపితే పై పొట్టు వచ్చేస్తుంది. పైపొట్టు తీసేసిన తర్వాత పప్పును రోట్లోవేసి బాగా మెత్తగా రుబ్బి తీసుకోవాలి. దీనిలోకి కలకండ పొడినికూడ వేసి బాగా కలిపి చిన్న చిన్న వుండలు చేసి పెట్టుకోవాలి. ఇవే పూర్ణం వుండలు. ఇపుడు మైదాపిండిని చిన్న చిన్న వుండలుగా చేసుకుని పల్చగా పూరీలు వత్తాలి. వాటిపై పూర్ణం వుండలనుపెట్టి పూరీతో మూసేయాలి. ఈ వుండను మళ్లీ పూరీగా వత్తాలి. ఈసారి వత్తేటపుడు కాస్త దళసరిగా వత్తాలి. వీటిని మరుగుతున్న నెయ్యిలో వేసి బాగా వేయించి తీయాలి. ఈ పూరీలను సన్నని మంటమీద వేయించాలి. మంట పెద్దదిగావుంటే పూరీలు మాడిపోతాయి.

— ఉదయభానుసుందర్.

## షీఖ్ కబాబ్

కావలసినవి : మాంసము – 250 గ్రా., నిమ్మకాయ – 1, గసగసాలు – 1 స్పూను, యాలకులు – 2, లవంగాలు – 4, దాల్చిన చెక్కపొడి – పావు స్పూను, మిరియాలపొడి – పావు స్పూన్, ధనియాల పొడి – 1 స్పూన్, కారం – అర స్పూన్, ఉల్లిపాయలు – 2 పెద్దవి. ఇంకా వెల్లుల్లి, పచ్చిమిరపకాయలు, కొత్తిమీర, ఉప్పు, నెయ్యి.

తయారుచేయు విధము : మొదట ఉల్లి, వెల్లుల్లి నూరి ముద్ద చేసుకోవాలి. తర్వాత పొయ్యిమీద బాణలి పెట్టి అందులో నెయ్యిపోసి ఉల్లి ముద్దను వేయించాలి. దీన్లోకి ఇప్పుడు కారం, ధనియాలపొడి, యాలకులు, లవంగ, గసగసాలు, దాల్చినచెక్క పొడులను కలిపి కొద్ది సేపయ్యాక మాంసం ముక్కలు, కొత్తిమీర, పచ్చిమిర్చి (తరిగినవి), మిరియాలపొడి, ఉప్పు, నిమ్మకాయ రసం కూడా వేసి బాగా కలిపి మూతపెట్టి కొంచెంసేపు వుంచి దింపేయాలి. షీఖ్ అంటే సన్నని ఇనుప కడ్డీలకు నెయ్యిరాసి ఈ మాంసం ముక్కలను వీటికి గుచ్చి నిప్పుల మీద కాల్చాలి. మధ్య మధ్యలో ఒక గుడ్డ ముక్కను నెయ్యిలో ముంచి ఈ కబాబ్‌లకు నెయ్యి అద్దుతూ కాల్చాలి. ఎర్రగా కాల్చాక కడ్డీల్లోంచి తీసేయాలి. ఇవి చాలా రుచిగా ఉంటాయి.

## షామీ కబాబ్

కావలసినవి : పచ్చిశెనగపప్పు – 1 కప్పు, ఖైమా – 250 గ్రా., ఉల్లిపాయలు – 1 పెద్ద సైజుది, పచ్చిమిరపకాయలు – 3. వెల్లుల్లి – 3 పాయలు, అల్లం – అరంగుళం ముక్క, నిమ్మకాయ పైతొక్క నూరినది – పావు చెమ్చా, జీలకర్రపొడి – పావు చెమ్చా, మిరియాలపొడి – పావు చెమ్చా, ఇంకా కొత్తిమీర, ఉప్పు. నెయ్యి తగినంత.

తయారుచేయు విధానము : షామీకబాబ్ రేపు చేసుకుంటామనగా ఈ రోజు రాత్రి పచ్చిశెనగపప్పు నానవేయాలి. ప్రొద్దున్నే ఈ పప్పును బరకగా రుబ్బుకోవాలి. ఉల్లి, వెల్లుల్లి, అల్లం, కొత్తిమీర, పచ్చిమిర్చి మెత్తగా రుబ్బుకొని ఉంచుకోవాలి. తర్వాత ఖైమా శుభ్రంగా కడిగి రుబ్బి ఉంచిన ఉల్లి ముద్దతోపాటు అన్ని మసాలాలు ఖైమాలో వేసి బాగా కలపాలి. రుబ్బిన పిండిన కూడా కలపాలి. ఈ మొత్తాన్ని నిమ్మకాయ సైజులో ఉండలు చేసుకోవాలి. నిమ్మకాయ తొక్క నూరింది ఉండ మధ్యలో ఉంచి పొడుగ్గా రోల్సులాగా చేత్తో చేసుకోవాలి. వీటిని నెయ్యిలో వేసి ఎర్రగా వేయించాలి.

— ఎం. జరీనా



# హైదరాబాద్ నోట్‌బుక్

## ఎంతకాలానికి ! ఎంతకాలానికి !!

అమ్మయ్య ! ఎంతకాలానికి విన్నాను అపశబ్దాలులేని ప్రసంగాన్ని !! కొమ్ములు తిరిగిన విద్వాంసులు, మహాకవులు విచక్షణ లేకుండా సమైక్యానికి సమైక్యత అని, ఆహూతులకు ఆహ్వానితులని, బాధ్యతను భాద్యత అని అంటూ ఉపన్యాసాలు దంచేస్తున్న కాలంలో — కాదు అపశబ్దయుగంలో ఒక ఐ. ఎ. ఎస్. అధికారి, కేవలం కర్రపెత్తనమే — ప్రధాన ధర్మమైన వాడు ఆహూతులని, సమైక్యమని, బాధ్యత అని సలక్షణంగా అనడం నామట్టుకు నాకు ఆశ్చర్యానందాలు కలిగించింది. ఆ అధికారి సమాచార సాంస్కృతికశాఖ కమిషనర్ శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్. ఫిబ్రవరి 24 న త్యాగరాజ గానసభలో జరిగిన శ్రీమతి మాదిరెడ్డి సులోచన ప్రథమ వర్ధంతి సభలో శ్రీ ప్రసాద్ బహుమతి ప్రదానం చేస్తూ ముక్తసరిగా, ముచ్చటగా మూడే నిముషాలు ప్రసంగించారు. ఆ ప్రసంగాన్ని విన్నపళంగానే అచ్చు వేయవచ్చు. ఒక పొల్లు మాట గాని, అనవసరమైన భావంగాని లేనిది గనుక. శ్రీ ప్రసాద్ అన్నట్టు శ్రీమతి మాదిరెడ్డి సులోచనపై గౌరవంతో హాలు ప్రేక్షకులతో కిటకిట లాడింది. ముఖ్య అతిధిగా వచ్చిన శ్రీ అక్కినేని నాగేశ్వరరావు తమ ప్రసంగం తర్వాత పొద్దున్నుంచి 20 మైళ్ల దూరంలో ఎండలో నిలబడ్డాను, సెలవు తీసుకొంటాను అంటూ వెళ్లిపోయినా, జనం వెళ్లిపోలేదు. ఈ సభ మరొక విశేషం గుంటూరు బి.ఇ.డి. కళాశాలలో ఉపాధ్యాయిని అయిన శ్రీమతి అధరాపురపు తేజోవతి ప్రతిఫలాపేక్ష లేక 'కోయిల పిలిచింది' అనే తమ నవలను శ్రీమతి సులోచన స్నేహ స్మృతికి అంకితమివ్వడం. సభకు ఆంధ్రప్రభ ఎడిటర్ శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు. శ్రీ బండారు సదాశివరావు ప్రసంగించారు. సులోచన చివరి నాటిక 'కాలంతో కదలండి'ని మొదట్లోనే ప్రదర్శించారు, మరి రెండు విశేషాలు సులోచన ప్రసంగం టేపు వినిపించడం, కథల పోటీ నిర్వహించడమూను. పోటీలో శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుకు ప్రథమ బహుమతి, శ్రీ బెహరా వెంకటసుబ్బారావుకు రెండవది, శ్రీమతి సర్వలక్ష్మికి మూడవది లభించాయి. ఇదంతా నిర్వహించిన అభ్యుదయ వేదిక అధ్యక్షుడు శ్రీ పిరాట్ల వేంకటేశ్వర్లు ప్రారంభంలో స్వాగతం చెప్పారు. శ్రీమతి మాదిరెడ్డి సులోచన గొప్ప నవలా రచయిత్రి అని, ఆమె నవలలు కొన్ని చలనచిత్రాలయాయని, గ్యాస్ ప్రమాదంలో భర్తతోసహా అకాలమృత్యువు వాత పడ్డారని పాఠకులకు చెప్పనవసరం లేదు.

## రేడియో అన్నయ్య కాలధర్మం :

దాదాపు ఆరు దశాబ్దాలుగా బాలసాహిత్యం కోసం జీవితం అంకితం చేసిన రేడియో అన్నయ్య శ్రీ న్యాయపతి రాఘవరావు ఫిబ్రవరి 24 మధ్యాహ్నం ఆంధ్ర మహిళా సభ ఆస్పత్రిలో గుండెపోటుతో కాలధర్మం చెంది బాలసాహిత్య బంధువులను విషాదంలో ముంచివేశారు. ఆయన వయస్సు 79 సంవత్సరాలు. పిల్లల సర్వతోముఖ వికాసం కోసం ఆయన చేపట్టని సాహిత్య ప్రక్రియ లేదు. నాటికలు, నాటకాలు, పాటలు, నవలలు, సుద్దులు, కథలు— ఇలా ఎన్నో ! రేపటి తరం కోసం అలసట ఎరుగని ఉత్సాహంతో పని చేశారాయన. 1905 ఏప్రిల్ 13న ఆయన బరంపురంలో జన్మించారు. తండ్రి ప్రముఖ న్యాయవాది శ్రీ ఎన్. ఆర్. స్వామి. 16వ ఏట చదువు మాని జాతీయోద్యమంలో చేరారు. ప్రముఖ పత్రికా రచయిత, శ్రీ న్యాయపతి నారాయణమూర్తి సంపాదకత్వంలో ఆంధ్రవాణి అనే జాతీయ వారపత్రికను 1921 లోనే ప్రచురించారు. పిదప పట్టభద్రులై మద్రాసు నుంచి వెలువడే హిందూ ఆంగ్ల దినపత్రికలో చేరి 10 సంవత్సరాలు పని చేశారు. 1939 నుంచి 1969 వరకు సతీమణి శ్రీమతి కామేశ్వరమ్మతో సహా రేడియోలో పిల్లల కార్యక్రమం నిర్వహించారు. 1945లో బాల పత్రికను స్థాపించారు. తెలుగులో ఇదే తొలి పిల్లల పత్రిక. పిల్లల చలనచిత్రాలలో పాల్గొన్నారు. మల్లీశ్వరి, రత్నమాల, నా ఇల్లు మొదలయిన చలనచిత్రాలలో నటించారు. 1947 లో బాలానంద సంఘం స్థాపించారు. అది తామర తంపరగా విస్తరిల్లింది. పెక్కు రాష్ట్రస్థాయి బాలల మహాసభలు నిర్వహించారు. ఆయన పెక్కు రచనలకు జాతీయ బహుమతులు లభించాయి. రాష్ట్రప్రభుత్వం పిల్లలకోసం ఏర్పరిచిన పెక్కు సంఘాలలో సభ్యులు. 1975లో ప్రపంచ తెలుగు మహాసభలో సన్మానితులు. రాష్ట్ర బాలల అకాడెమీకి ప్రథమ కార్యదర్శిగాను, పిదప ఉపాధ్యక్షులుగాను ఉన్నారు. పిల్లలకోసం బాలానంద మేజిక్ స్కూలును, రాఘవ నటశిక్షణాలయాన్ని 1983లో స్థాపించారు నటశిక్షణాలయంలో రెండు సంవత్సరాల డిప్లొమా ఇస్తారు. దీని డైరెక్టర్ శ్రీ డి. ఎస్. దీక్షిత్. నట శిక్షణాలయం ప్రగతిని ఊహిస్తూ కన్నుమూశారు అన్నయ్య. ఆయన రచనలు దాదాపు వంద సంపుటాలున్నవి. వాటిని ప్రభుత్వమో బాలల అకాడెమి గాని, ప్రచురిస్తే, బాలసాహిత్య భండారం నిండారుతుంది.

## ఉపశ్రుతి :

ఏం సార్, తెలుగుదేశం ప్రభుత్వం వార్షికోత్సవంలో ముఖ్యమంత్రి దూరదర్శన్ ప్రసంగాన్ని అంతగా పొగిడారే, మీకు ప్రభుత్వం మెచ్చి మేకతోలు కప్పిందా ?— అనడిగారు నన్నొక పెద్ద మనిషి. మంచిని పొగడడం, చెడును తెగడడం పత్రికా రచయిత ధర్మం. దానిని ఆయన నిర్వహించారు. మేము మెచ్చుతచ్చులు, మేకతోళ్ళు కోరము— అన్నారు తీవ్రంగా, నా పక్కన వున్న మరొక పత్రికా రచయిత.

— తిరుమల రామచంద్ర ★

రేడియో అన్నయ్య శ్రీ న్యాయపతి రాఘవరావు, అక్కయ్య శ్రీమతి న్యాయపతి కామేశ్వరి



## అవీ ఇవీ అన్నీ

### ఉత్తమ ప్రదర్శనగా ఎన్నికైన 'చండాలిక' నృత్యనాటిక

శ్రీమతి కొత్తపల్లి పద్మ దర్శకత్వం వహించిన 'చండాలిక' నృత్యనాటికను ఆంధ్ర నాటక కళాపరిషత్తు వారు తమ వార్షిక ప్రదర్శనలలో 1983వ సంవత్సరానికి ఉత్తమమైనదిగా ఎన్నిక చేశారు. ఈమె 'నృత్యాలయ'



శ్రీమతి కొత్తపల్లి పద్మ

వ్యవస్థాపకురాలు, దర్శకురాలు. ఈమె డా॥ వెంపటి చిన సత్యం శిష్యురాలు. ఈమె దర్శకత్వం వహించిన అనేక నృత్యనాటికలు మంచి పేరు పొందాయి. సాంస్కృతిక ప్రతినిధిగా శ్రీమతి పద్మ చాలాసార్లు విదేశ పర్యటనకూడా చేశారు. ★


Printed and Published by S. Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

లక్షలాది
ప్రజలకు సూపర్
భావం కలిగించే
టీ!





"సూపర్
రుచి"





"సూపర్
డికాక్షన్"



"సూపర్
పొదుపు"

బ్రూక్ బాండ్
సూపర్ డస్ట్

భారత దేశంలో
అత్యధికంగా అమ్మబడు
చున్న ప్యాకెట్ టీ




HTC-BBI-5287